THE

# THARAKAPACHAYAM,

EDITED AND PUBLISHED.

BY

**IVATURI SURYAPRAKASA KAVI**
KOTHAPETA,
*NAGARAM TALUK,*
*Godavari District*





AMALAPUR
PRINTED BY *PERI VENKATESAM,*
PROPRIETOR
AT THE [illegible] PRESS.



PRICE 2 Rs
FIRST EDITION 2000



1911

శ్రీరస్తు.

# తారకాపచయము.

అనునీప్రబంధము

---

తణుకుతాలూకాలోని

క్రొత్తపల్ల్యగ్రహారనివాసియు,

ప్రకృతమందు

రాజవోలుతాలూకా

కొత్తపేటవాస్తవ్యుఁడునగు

ఇవటూరి సూర్యప్రకాశకవిచే

రచింపఁబడి

---

అమలాపురము

పేరి వేంకటేశముగారి

స్వకీయ శ్రీశార్వాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడెను.

---

మొదటికూర్పు. 2000

1910

దీని వెల. రు 2-0-0

## ఆంధ్రమహాజనులకొక విజ్ఞప్తి.

—:0:—

విద్వదాంధ్రజనులారా! సప్తసంతతులలో క్షితిని క్షతిలేనిది కృతియని కృతులనికృతులు పెద్దనాదిమహాకవులు రచించిన మనుచరిత్రమున్నగు కావ్యములను శ్లాఘించుచుండుటవిని తగుమనుతగననువిచారముదవ్వాననుంచి చాపలప్రచోదితుడనై యేల్లుభట్టుపల్లకీయెక్కఁటచూచి సర్వ్భట్టు చెరువుగట్టెక్కెఁనన్నట్లు నేను మూడేండ్లకు ముందీకావ్యరచనకుదొరకొంటిని. దొరకొని ఎట్టెట్లో ఇందలిప్రథమభాగమేనిమిదాశ్వాసములు సంవత్సరముకుపూర్వమే ముగించినానుగాని నేను గ్రాసవాసోదైన్యముమట్టుకులేని సామాన్యగృహస్థుడనగుటచే నేతద్గ్రంథ ముద్రణమునకువలయు ద్రవ్యమును స్వంతముగా వెచ్చించుటకు చాలికలేకపోవుటచేతను నేనీకృత్యాదిలోని (అనయంబు పరమేశ్వరునిదక్క) అనుసీసపద్యములోచెప్పినట్లితరులను ధనదానాద్యుపకారమును కోరని యప్రతిగ్రహవ్రతినగుటచేతను ఋణమో ఫణమో చేసియైనను స్వంతపుద్రవ్యముతోనే ముద్రింపంతునేని ముద్రణాదికమునకైన వ్యయమయినను తిరిగిచేరునో లేదోయను భీతిచేతను నింతవరకును దీనినచ్చొత్తింపజాలకుండియు నెట్టెటో శ్రమచేసి వ్రాసిన యీపొత్తమును వెల్లడింపకెంతకాలమిట్లుమూలబడవైచియుంతునని విసుగుపుట్టి తుదకు తెగువచేసి స్వంతపువ్యయముతోనే ప్రథమభాగమేనిమిదాశ్వాసములును, నీదరిమిలానువ్రాసిన ఉత్తరభాగములోని నాల్గాశ్వాసములును నచ్చొత్తించినాడను. ఛందోవ్యాకరణాదివిషయములలో పూర్వకవులుశాసించినమార్గమునే యనుసరించినాడగాని లడలర మొదలైనవానికి విశ్రమ | పాసమై| త్రిని నేనె

చ్ఛటను వాడియుండలేదు. ఉత్పలమాల చంపకమాల శార్దూల మత్తేభవిక్రీడితాదివృత్తములలో పూర్వకవిమతవిరుద్ధముగా నెక్కుడను పాదపంచకములుంచియుండలేదు. లఘ్వలఘు రేఫలకు ప్రాసమైత్రిగాని, విశ్రమమైత్రిగాని క్వచిత్ గానైనను వాడుక చేయలేదు. పవర్గునకును, వకారమునకును విశ్రమమైత్రి క్వాచిత్కముగా వాడవచ్చునుగాని స్వేచ్ఛగా ప్రాయికముగా వాడగూడదు. కనుకనే భారతము పదునెనిమిదిపర్వములలో (పరతేంద్రియవృత్తినున్నవానిశమికుఱ్ఱ) (ప్రతయొకబావి మేలు మరిబావులునూరిటికంటె) ఇత్యాదులగు మూడునాలుగుస్థలములలోమాత్రమే పవర్గునకును వకారమునకును విశ్రమమైత్రివాడబడినదిగాని పదునెనిమిదిపర్వములకును పదునెనిమిదిపద్యములైనను అట్టివిదొరకవు. కొంచెముగనో తరచుగనో ప్రామాణికకవులుపయోగించిరికదా మన మేలతరుచుగామాత్రముపయోగింపగూడదందుమేని భారతమాదిపర్వములో "కాదనక అనిదకారప్రాసతోపద్యమారంభించి రెండవపాదములో బోధనఅనిధకారము ప్రాసస్థానమునందుంచినాడు" ఇట్లని మనము దధలకు స్వేచ్ఛగా మైత్రివాడవచ్చునా? వలనుపడదు. అస్లేతప్పనిసరియైనచోట నేతప్ప స్వేచ్ఛందముగా వకారపవర్గములకు విశ్రమమైత్రి వాడకూడదని నాయభిప్రాయమగుటచే తప్పనిసరియై మూడునాలుగుచోట్లమాత్రము పబలకు వకారముతో విశ్రమమైత్రివాడినాను. ఇప్పటికి పూర్తిచేసిన పంద్రెండాశ్వాసములను నీవిధముగానే చకితచకితముగా వ్రాసినాను.

సీ॥ గుదికాళ్లు మొదలుగా గుంతలంబులదాఁక నిడుదవెన్నుపిసాళి
తొడవులొప్పఁ । గరికృత్తిబెబ్బులి కడవసంబును నుత్తరీయాంతరీయం
బులై యొసంగఁ । దోరంపుబుఱియల పేరులురమ్మునఁ దోమాలియలు
వోలెఁ దుఱఁగలింప । మడికాసుసుబ్బ్రగివడువునఁ బోడవైన యూలపోతె

కిరింతయైతలిగ్వ। నెవ్వఁడో కాని యతఁడు మున్నెపుడు నేను। చూడనట్టి మహాపురుషుండు రేయి। నిమురబోవుతఱినివచ్చి యెదుటనిలిచి। కేల నాజత్రువునుదాఁకి మేలుకనిపె॥ అని నేనును పూర్వకవులలో గొందఱవలె భగవంతుఁడు స్వప్నములో సాక్షాత్కరించినట్లు మొదట వ్రాసినాడనుగాని తరువాత నట్టియసత్యముంచుటకు మనస్కరింపక యాభాగమునుతీసివేసినాను. ముద్రాపితమైన యీపుస్తకమునకు రు ౧-౦-౦లుమాత్రమే మూల్యమేర్పఱుపబడినది. ప్రతిఫలములేకుండ నెట్టియాఢ్యవంతులును వేయినూటపదారులిచ్చినను గయికొనననియప్రతిగ్రహవ్రతమునుపూనిన నన్ను ఈమాత్రపు వెలయిచ్చి యొక్కొకపుస్తకమును తీసుకొనుటకు వెనుకదీసి నిరుత్సాహపఱుపక యాంధ్రదేశీయమహాపురుషులు సాదృతి స్వీకృతైకైకపుస్తకక్రయధనదానరూపముగా నన్నాదరించుటకు మరిమరిప్రార్థించుచున్నాడను.

ఇట్లు విద్వద్విధేయుఁడు,
ఇవటూరి సూర్యప్రకాశకవి.

———:0:———

శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# తారకాపచయము.

శా॥ శ్రీపర్ణప్రభువుండు శ్రీరమణుఁడున్ శ్రీకంఠుఁడున్ సర్గర।
స్థాపింజాత్మని యోగనిర్వహణముల్ కైమోద్భవులన్ నిల్చి వి।
జ్ఞాపింపన్ వినిమీఁదికర్జములనాజ్ఞాపించి సర్వాత్మక।
త్వోపేతుండయి చూచుచుండెడు పరంజ్యోతిన్ భజింతున్ శివున్॥

మ॥ తలపై వెన్నికవెట్ట వీల్పడని శుద్ధస్వర్ణదీనారముల్।
గలవిత్తేశుఁ డవయ్యు మేనఁ దొడవుల్ గాఁ దాల్తుతోల్బూదియ।
స్థలునున్ గావున మున్నెలుబ్ధకుఁ డవంచున్ మేలముల్ వల్కుఁగు।
బ్బలిరాచూలిని జూదినవ్వు కుహనావ్యాధుండు మమ్మోముతన్॥

సీ॥ ప్రణతశైభజియించుభారతీప్రభృతులఁ గ్రేగంటఁగనియాదరించుప్రభ్వి।
వినయంబుమైబ్రహ్మవిష్ణ్వాదులొనరించు నవ్యాజనుతులకు నలరుదేవి।
హరిహయాద్యవిజేయులగురక్తబీజాది ఘోరదైత్యులమన్నిగొన్నదిట్ట।
సోమార్ధకోటీరువామార్ధదేహంబు కూరిమిమీఱఁ గైకొన్నప్రోడ।
పాతసంత్రస్త దేవతాజాతలోక।
మాతహతదుర్నిశాచర వ్రాతశైల।
జాతదృఢహార్దయునుఁ గృపోపేతయునగుఁ।
గాతనాయందు నాచేయు జోతలుగొని॥

మ॥ తనవత్సంబునఁ బొల్చుకౌస్తుభమణిన్ దర్శించుచున్ జంద్రమా।
మనసోజాతయటంచుఁ బల్కఁగదయామ్నాయంబు గానన్ విరో।
చనుఁడోకోఱయిదియంచు నొండొరులతోఁ జర్చించునాత్మాగత।
ర్షినికాయంబులఁజూచి నవ్వుకొను లక్ష్మీనాథునర్చించెదన్ ॥

ఉ॥ కంటినిమిమ్ము నొకఱునిఁ జగంబులలోపల నెప్డునబ్దమొ।
కఱంటికి నాల్గుమాసములుగా మితిదప్పక యుండనత్తవా।
రింటనె కాఁపురమ్ము వసియించు మహాత్మునటంచుఁ బక్కిఱడా।
ల్దంటను మేలమాడుకమలన్ విశాలంబగు బత్తిఁ గొల్చెదన్ ॥

మ॥ స్తుతమూర్తిత్రితయంబునందొకఁడనై శోభిల్లు నాకేలప్రా।
జ్యత లేదయ్యెఁ జగంబులన్నిటనటంచత్యంతచింతాసమా।
న్వితచిత్తుండయి శక్తిమైఁదనకుఁ దానేప్రాజ్యుఁడైనాఁడనన్।
సుతయాపల్కుఱచెలిన్ వరించిన విరించున్ గొల్తునిష్టాప్తికిన్ ॥

మ॥ తనకున్ గానమురోరుహంబగుటచేతన్ దద్రసంబెల్లనం।
దెనయన్ జొన్పుచు నున్నదోయని జనంబెంచన్ బ్రపీనోన్నత।
స్తనమందొప్పఁగఁజేర్చి కచ్ఛపిని చేతంబూని త్రైలోక్యమో।
హననిక్వాణమొనర్చు శారదనెడన్ ధ్యానింతు వాక్ప్రౌఢికిన్ ॥

ఉ॥ శీతమయూఖశేఖరుని శీర్షమునెక్కి శిశుత్వఖేలలన్।
ద్యోతటినీజలంబుఁ దనతుండమునిండఁగఁ బీల్చి దిగ్గజుల।
చేతులుమోడ్చి మ్రొక్కఁగ కరశీకరముల్ పయిఁజల్లినవ్వుశైవ।
మాతురుఁ గొల్తు సత్కృతిసమాప్తివివర్జితవిఘ్నమాటకున్ ॥

సీ॥ కలితవిశ్వేశ్వరాగముఁడైనవిశ్వేశ్వరారాధ్యచంద్రముఁడేయనఘుతాత।
" సంజ్ఞాతలింగాంగసామరస్యుండైన పేరనారాధ్యుఁడే ధీరుతండ్రి।
ప్రాజ్ఞులు సాంబనారాధ్యవిశ్వేశ్వరమల్లనారాధ్యులేమాన్యసహజు।

లేమహాత్ముఁడు సర్వతోముఖ పాండితీప్రౌఢిచేసభలఁగౌరవమువడసె।
నమ్మహాబోధుశబ్దశాస్త్రపారీణ।
గూఢపాన్నాధు నివటూరి కులజలధిని।
శీధినీనాధునిర్జితక్రోధు సోమ।
నాధుమద్గురుఁదలఁతు మానసమునందు॥

సీ॥ లేక లేకేనుకల్గితిఁగాన నామీఁదనసువులకంటెను నరితిప్రాని।
బడికిఁబంపినవొజ్జ బాఁదునప్పటి యోనమాల్ సైతము తానచెప్పి।
క్రిందవ్రాశిననామవ్రేల్నొచ్చుననియక్కరములుబల్పుమీఁదవ్రాయ
యోపికతీరికయునుఁగల్గినపుడెల్లచదివించికొంతకోవిమునిఁజేసి। [నేర్పి
మత్పురాకృతపాపకర్మమునఁ బాల్య।
మున నె యూర్ధ్వగతికిఁజన్నజనకునిపద।
ములు స్మరించెద నాయన తలఁపువలన।
లోచనాశ్రువులు రలికాలువలు నాఱ॥
గీ॥ పుడమి జగమున వేడుకపడి వయాళి।
తిరుగవచ్చిన పొత్తువు తెఱవకేజ।
గద్వదితునాలక ప్రథమోపకార్యయయ్యె।
నాకవివరేణ్యుఁదలఁతు వల్మీకభవుని॥

ఉ॥ వేదములన్ స్ఫుటంబులుగ వీథ్రమతిన్ విభజించి యెవ్వఁడు।
ష్టాదశ సత్పురాణములు సంస్కృతభాషరచించెనట్టియం।
హాదశనక్షుమప్రయితసూక్తిపగాయణుఁ బాదరాయణున్।
మోదమునన్ నుతింతుఁ జలముజ్జిభమూర్తి విలాసువ్యాసునిన్॥

ఉ॥ కోహామటంచునేకవికులాగ్రణి తన్నడుగన్ గపాలభృ।
ద్దేహిని సర్వభీమదవగీర్ణచరిత్రనసంశయ స్త్వమే।
వాహామటంచుఁ బల్కెనో మహామహునాతని సన్నుతింతుసో।
త్సాహసమర్పిత త్రిదశశైల శరాసునిఁ గాళిదాసునిన్॥

కాంతవృత్తము॥ మాఘున్ భవభూతిని మాఘ్యగదో।
ల్లాఘూత్మునిఁ భారవిలాలితధీ।
ద్రాఘిష్ఠుమురారినిఁ దండికవిన్।
శ్లాఘించెద సంస్కృతసత్కవులన్॥

ఉ॥ వాగనుశాసనుండనఁగ వాసికినెక్కిన నన్నపార్యుడున్।
ధీగురుఁడెల్లప్రెగ్గడయుఁ దిక్కనసూరన పెద్దనార్యుఁడున్।
భాగవతాగ్రగణ్యుఁడగు బమ్మెరపోతనసోముఁడున్ మొదల్।
గాగల తొంటియాంధ్రకృతికర్తలకాదృతిఁ గేలుమోడ్చెదన్॥

చ॥ కవికులసార్వభౌముఁ డనఁగాఁ బ్రథఁగాంచినబట్టుమూర్తికే।
నవనిసురుండ నన్న మరహంతఁ బోకారిచి యమ్మహామహుం।
డు వృషలవంశజుండనియునున్ మదిఁగొంకకబత్తిమోడ్పకే।
ల్లవయొనరింపనేయతఁడు గాన్పడునంతటిబాగెమబ్బినన్॥

ఉ॥ తోలెపుశేవులోఁ బహుకృతుల్ సరసస్తుతరీతిఁ జెప్పఁగా।
జాలినయట్టిపూర్వకవిచంద్రులపాదనఖాంకురమ్ములన్।
బోలనివాఁడనయ్యునహిభూషణపుణ్యకథాసుధారస।
ఖ్యాళిత సర్వపంకుఁడను కావులకీకృతిఁ జెప్పఁబూనితిన్॥

ఉ॥ కాయలు పండ్లునున్న సహకారములొల్లక వేఁపపండ్లకై।
పోయెడు చాడ్పునన్ సరసముల్ విషయంబులు కోరిచూడఁబో।
కేయెడనైనఁ దోషములె వేనియునుండ వెయంచు నారయన్।
గాయువుపూనుకాకవులు కాకవులేకద యెంచిచూడఁగన్॥

వ॥ అనియిట్లిష్టదేవతావందనంబునుఁ గురుచరణస్మరణంబును సు
కవిజనాభివాదంబునుఁ గుకవిజనావహేళనంబునుంగావించి యెద్దియేనొ
కమహాకావ్యంబు రచింపనభిలషించి పెద్దచింతించి॥

గీ॥ జగములందు సూర్యప్రకాశమ్ము తార।
కాపచయకర్తయగుట ప్రఖ్యాతమెయని।

జనులుతలఁప సూర్యప్రకాశమును నేను।
తారకాపచయమొనర్పఁ దలఁచి కడఁగి॥ [యును।

సీ॥ అనయంబుఁబరమేశ్వరునిఁదక్క రాఁ జేని నేని యన్యునినాశ్రయింపమి
సామ్రాజ్యపదవియొసఁగునన్న నొరుచేతిక్రిందఁజేజాపఁగాంక్షింపమి [యును।
గలయంతవట్టురిక్థము మామకీనంబు సద్వినియోగంబుసల్పుటయును।
గోటిలాభంబు చేకుఱునన్న నీశ్వరాగ్రహహేతువృత్తు లఁగడఁగమి [యును।
నామనోనిశ్చితములుగానఁ మనుజున।
కెంతవిడుపరి కథకర్థి కేనిఁదీనిఁ।
గృతియొసంగుట కెద నిచ్చగింప కీశ్వ।
రునకుఁ గృతియిచ్చుటకు మనంబునఁ దలంచి॥

సీ॥ క్షితిమేకవార్థియైనతఱి నేప్రోలు భైరవునిశూలమున నగ్రముననిలుచు।
ముమ్మారునరులేపురమ్ము నిక్కఁపుఁబత్తిఁదలఁచినఁ గలుషముల్తొలఁగి [పోవు
మరణించునపుడే నగరిమ్ము ప్రాణులకుఁ దారకమును శ్రోత్రరంధ్రముల [నొడువు।
నేపీటమేవీడు జీవులకపునరావృత్తియాముక్తిసంపత్తిపొసఁగు।
నట్టివారాణసీక్షేత్రమందుఁ బ్రణమ।
దనుజిఘృక్షుఁడై నెలకొన్నయట్టివిశ్వ।
నాథుని మదీయ సుకృతికి నాథుఁజేసి।
నేను సుకృతినొటకు మదినిశ్చయించి॥

షష్ఠ్యంతములు.

క॥ స్థాణునకు నిందిరాధవ।
బాణునకుఁ బ్రపన్నదురితపటలాబ్దజగ।
త్త్రాణునకునుక్షపతికం।
ఖాణునకు నమత్స్వదత్తకళ్యాణునకున్॥

క॥ శర్వునకున్ నమదఖిలసు।
పర్వునకున్ క్షుపితపద్మపలలాశనదో।
గర్వునకున్ మహిమభరా।
ఖర్వునకున్ నిగమరథ్యగంధర్వునకున్।

క॥ భీమునకు భసితసాత్కృత।
కామునకు మహర్షివినుత కళ్యాణగుణ।
స్తోమునకుఁ బతితపావన।
నామునకు మృగాదనాజినక్షౌమునకున్॥

క॥ ఈశునకు వతంసితతా।
రేశునకుఁ బదానతామరేశునకువియ।
త్కేశునకుఁ బదనిహతకీ।
నాశునకానంద కాననని వేశునకున్॥

వ॥ సభక్తిసమర్పితంబుగా నాయొనర్పంబూనిన తారకాపచయం
బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన॥

ఉ॥ పుణ్యమునిప్రవేకులు ప్రభూతతమశ్రుతిమంత్రహూతినై।
పుణ్యము వెంపనబ్బురము మ్రోలకుఁబిల్చి హవిష్యమీనశీ।
ర్షణ్యము వంగిగైకొని సురల్ తమిసాపడనొప్పునైమిశా।
రణ్యమునామృగోత్తమ శరణ్యమొకానొకకానమొప్పెడున్॥

గీ॥ క్రాలుఁ గాలవశాండిల్య కౌశికాము।
లైనఘనతరుల్ కల్గియకాననంబు।
క్రాలుఁ గాలవశాండిల్యకౌశికాదు।
లైనఘనతపుల్ కలిగి యకాననంబు॥

తరల॥ అమలినాత్ములు శౌనకాది మహామునుల్ తమచేయుస।
త్రమను పేరిటి యధ్వరంబు యథావిధిన్ నెఱవేర్పివ్వ।

ర్థమునిముఖ్యులతో నభీష్టకథావినోదమొనర్పనా।
సమయమునందరుదెంచె సూతుఁడు సంయమీంద్రదిదృక్షుఁడై॥

క॥ వచ్చినయాగ్రశ్రవసున।
కెచ్చుగు కౌతూహలమున నెదురుగఁజనితో।
డ్తెచ్చి పవిత్రమయవిచి।
త్రోచ్చాసనమొకటి చూపి యుపవేశింపన్॥

క॥ శౌనకుఁడు మున్నయినయా।
వానప్రస్థవరులార్జవమున నతనిస్మే।
రాననముఁజూచుచాతని।
తోనిట్లులనిరి వినీతిధుర్యోక్తులతోన్॥

సీ॥ ఎవనిముత్తాతవేఁడి వెలుంగుకొలపుఁబొమ్మ్మడికపుతాల్పులమేటియొజ్జ
యెతని నెయ్యంపుఁదండ్రి తుదియుగంపు మేల్పాడి పొత్తంపుఁగూర్ప [రులమిన్న।
యేబాసవాల్పొట్ట ప్రాఁబలుకుఁగమి మొదల్వెన్నై పొమ్ముదలిర్పు వెడఁ [దపెట్టె।
యెవ్వానికొమరుండు పువ్వులకోరివిలాఁకని నోర్చినముగమానికంబొ।
సత్యవతి పెద్దబము పంటజమునయేటి।
రేఁగుదీవిఁజనించిన జోగిరాయఁ।
డై దవమునుకుఁగూర్పరినీము నెనరు।
టొజ్జ యాతండులెస్సయై యున్నవాఁడె॥

క॥ మొగములతిగయగపడకుం।
డఁగఁబుడమికిఁదిగిన పలుకునవలామొడయం।
డగుతబిసిచేఁజమువులె।
ల్లఁగఁబదిన వలంతి వీవలంతివె తలఁపన్॥

క॥ తూలమునలజంఝూవా।
తూలమువలె శ్రోతృజనులమఃఖమునాడి।
వ్యాలపనాయితనీది।
వ్యాలపనాయిత మృమూక్తులపయూపించున్॥

ఉ॥ చెప్పితి క్రౌంచదారణునిచే మును తారకశూరపద్ములన్।
గొప్పనిశాటులచ్యుతునకున్ గలినోరువరాకయాతనిన్।
రొప్పిన మేటిబల్లిములు త్రుంగుటవారలకట్టిగారవం।
బెప్పగిదిన్ బొసంగెవచియింపవె తజ్జననాది వృత్తముల్॥

ఉత్సాహ॥ స్కందుఁడొకరుండె కృత్తికలకు నార్వురకుఁగుభృ।
న్నందనామహేశులకుఁ ధనంజయునకుఁ గంగకే।
ట్లిందటికిఁ దనూజుఁడయ్యె నేర్పడన్ వచించిమా।
సందియములు దీర్పుమయ్య సరగ రోమహర్షణీ॥

శా॥ చిత్రంబుల్ కడుఁ శ్రోతృముక్తివనజాక్షీప్రాంచితోద్వాహవా।
దిత్రంబుల్ గ్రహయాళుదుష్కృతలసత్తిగ్మాతపాపేలవ।
ఛత్రంబుల్ జగదేకనాథుఁడగు నాచంద్రార్కకోటీరుచా।
రిత్రంబుల్ వినుచుంటకున్ దనివి మాహృద్వీధిలేదెన్నఁడున్॥

మ॥ వనజాతాసన కేశవప్రముఖ దేవవ్రాతనుత్యాదరం।
బున నాలించుశశాంకమౌళిచరితంబుల్ బ్రహ్మహత్యాదిపం।
కనితాంతప్రసితాత్మకుండొకఁడుదక్కన్ వేఱొకండెవ్వఁడున్।
వినహేయంపడు నయ్యయో వసుమతీవిఖ్యాతపౌరాణికా॥

క॥ అనినపిను రోమహర్షణ।
తనుజాతుఁడు ద్విజులకిట్లు తనవినుచుటయెం।
చినఁదలక్రిందనిచూపెడు।
ననువునఁ దనుజాతరోమహర్షణుడయ్యెన్॥

చ॥ సిరివిరిబోఁడి నేలు జగజెట్టికి నైననుఁ బెట్టిదంపు మో।
హరమున నోహటింపని విఘాతులఁ గొట్టిన యట్టి మేటిసో।
టరికత చెప్పఁ బూనుట కొండల్ నిడు వెండ్రుక వెట్టఁ బాసవా।
ల్దారలకు మోడ్పు కేలుగవతో నెఱియొప్పఁగ సూతుఁ డిట్లనున్॥

సీ॥ వితతస్ఫటాపంక్తి శతమా ప్రధమపృదాకువు చెంతనల గర్దకూర్దనంబు।
తపలలాటంతపాతపచండిమప్రభాకరుపజ్జజ్యోతిరింగణవిలసన।
మున్మాల్యమానసారోర్వీజమగుమహావాయువు చెంగటివ్యజనపవన।
మతిమాత్రవిన్నతోయంబౌ నుదధి క్రమోలఁగుల్భదఘ్నోదయాకుల్య
నెట్టివట్టిద వేదాగమేతిహాస। [పెంపు।
ఘుస్మరమనీషులరు మీనికటమునందుఁ।
బరిచితస్తోకపంచషాత్కురుఁడ నేను।
తగుదునను కొని చెప్పంగడఁగుటయరయ॥

ఉ॥ కూరిమిఁ బెంచి రాచిలుకకున్ బలుపల్కులు నేర్పి వెండియ।
కీఱరముఁ నోటనుండి పలికించి వినోదముఁ జెందువాగ్మ్మల।
ట్లీరఖిలేతిహాసవిమలీ యనభిజ్ఞుఁడు చెప్పఁగా వినం।
గోరుటవీని పైఁగలయకూటఁ పుటమ్మలిగాదె యారయన్॥

క॥ మానివరులార వేల్పుల।
పైనన్ జవదాఁటరాని ప్రాంచితమగుమీ।
యానతి యతిక్రమింతునె।
నానేరిచినట్టి తెలుఁగునన్ వినిపింతున్॥

వ॥ అనిపలికి పలగొని యాహసర్రులకు నమస్కరించి పారికాంక్షివర్యుండగు పారాశర్యుని మనోంబుజంబునన్ దలంచి యనేకావ్యాజభక్తికప్రణామంబులొనర్చి యశేషపురాణకథాకథననిష్ణాతుండగు సూతుండిట్లని చెప్పందొడంగె॥

మ॥ మును త్రేతాదిని దైవతౌఘమునకుఁ బూర్వాదితేయోత్కరం
బునకుఁ భూతభయానకంబయిన సంస్ఫోటంబుగా నందు శ
త్రునితాంతార్దితులైన నిర్జరులకుఁ దోడై హృషీకేశుఁడ
ద్దనుజానీకమునోర్చె శార్ఙ్గధనురుద్యద్బాణఘాతంబులన్ ॥

గీ॥ చక్రికాళుగగిళనంబు సాజమగుట
మ్రింగుచున్నాఁడొ యంచు వైరిధ్వజినులు
తెల్లవోయిచూచుచునుండఁ దితిజులేయు
నంపగములెల్ల మాయించు నచ్యుతుండు ॥

మ॥ తమయస్త్రావళులట్లు వన్నెగులయ్యెన్ దైత్యారియస్త్రంబులం
గములంగాడి ప్రభూతమానలజడిన్ గావింపనుద్విగ్నులై
యమరద్వేషణులోడిపారిరని శేయన్ లేక బృందారకేం
ద్రముఖుల్ శాత్రవులందఱున్ బ్రమదమందన్ గాండిశీకాదితిన్ ॥

సీ॥ ఆదిత్యతేజో మహాప్తికోప్పక తమలాగున్నయడవులఁదాఁగిదాఁగి
తమమనంబులువోలెఁ దతతమోవృతములై యొప్పుగవులలోన నుం[డియుండి
తమకథోగతియెంతత్స్యంబంచుఁ దెల్పపగిదిరసాతలముననొదిగియొదిగి
తమయట్లె కలితభంగముగదా కడుపులోనిముకోదెయని వార్ధినడఁగి [యడఁగి
తమయనాథత్వమునకు ఖేదముపడిపడి
వైరనిర్యాతనమునకవంధ్యమగును
పాయమొక్కటి నిర్ణయింపందలంచి
రాత్రిచరులెల్లఁజనిరి భార్గవునికడకు ॥

క॥ చరణానతులగుచునదీ
చరణార్థితులైన రాత్రిచరులజగవభృ
చ్చరణారవిందమునప
చ్చరణాయితహృన్మనకనిరిజననగురునకున్ ॥

ఉ॥ నవ్వుహితాశుండు నస్మదధునాతనదుష్పరిభూతివిన్నచో।
జివ్వలలోనము న్నెపుడుఁ జెందనిబన్నమునొంది యిట్లుగా।
నెవ్వఁగఁగుందుచుండుటకు నీకిటులొప్పరికించెదేని మే।
మెవ్వరివారమైమనుదు మెవ్వరుదిక్కగుమాకుఁ భార్గవా॥ [గూర్చి।

సీ॥ అల్లప్రసూనాహ్వయునశ్రమంబునఁ ద్రుంచిద్రుముని సమూలబలముగ
వృత్రసంజ్ఞునిఁ గుహావితతికిఁబోఁదోలి పంచాస్యుఁగానల పాలొనర్చి।
పాకునినాహవాప్రౌఢుఁడంచు హసించి పాటకర్దమాహ్వాయు మన్ను
[జేసి।
తారాభిధానునిఁ గడిమిఁ నీటఁగానరించి యంధకునిఁ వికలాంగుఁజేసి।
తెకుక్కగలరక్కసుల నెల్లనుక్కడంచి।
ముముఁబరిభవాబ్ధిఁ ద్రోచిరి మఘవముఖ్యు।
లైన సురలద్యాతుండు తోడైనకతన।
నేమిజెప్పుదు మయ్య మాహీనదశను॥

క॥ నొచ్చితిమి కదనమునఁనర।
సచ్చితిమఁగుల జయింపఁజాలకయిటుకన్।
వచ్చితిమి త్వద్దిదృక్షన్।
జొచ్చితిమి మిముశరణము విశుద్ధచరిత్రా॥

శా॥ పాలన్మ్రింగిన నీటముంచినను నీభారంబు పెంపేదినీ।
పాలం జేరితిమో శుక్రప్రముఖ శుంభద్దివ్యవిద్యాకలా।
పాలంకారరసజ్ఞమాయిడెడు కుయ్యాలించి విష్ణ్వాదిగో।
పాలస్తోమజయాప్తికై యొకమహోపాయంబు జింతింపుమా॥

* తెరువోజ *

అనియిట్లు దైతేయు లత్యంతదీనతామాత్రగవణాస్యులై వేఁడుకొనఁగ।
ననుకంపమానుఁడై యాశరాచార్యుఁడాంతరదృష్టిదీక్షప్రసిద్ధాన।

మునిమీఁది తాత్పర్యుఁడైను ప్రసన్నమగుచుఁ జెలువొందఁ బ్రహ్లాదంబుచొప్పునఁ
[గొంతఁ।
దనుకనిశ్చలవృత్తిఁ దానుండి తగనుదర్కమెఱిఁగి యాదైత్యులకనియె॥

ఉ॥ తొల్లినమాశతంబు నియతుండయి యంచితఘోరనిష్ఠనై।
నుల్లమునన్ శివుంగొలుచుచుండి తపంబొనరించె నాకస।
త్తల్లజుఁడా సహోత్థుఁడుతద్ఘనభక్తికిమెచ్చియంబికా।
వల్లభుఁడిందుమౌళిమునివంద్యుఁడుదాఁబొడసూపె శార్ఙ్గికిన్॥

వ॥ ఇట్లు నాళీకలోచనునకు నళినలోచనుండు లోచనగోచరుండై నారాయణాయ నన్యాచరణీయంబగు నీదుశ్చరతపంబునకు మెచ్చితి నత్యంతవిక్రమాఢ్యుండవై యభీష్టంబులీవచ్చితి శక్తిమంతుండవగుము నఖిలలోకపరిపాలనాధికారంబిచ్చితి నెల్లలోకంబులు నొక్కటనెత్తి వచ్చినను నెట్టిబల్లిదులకుఁ గదనంబున నీయెదుర నిలువఁ దరంబుగాదు. వేయేల శోడశుటగలిగినవన్నెనైన బన్నంబునొందింపఁజాలుదుని నిర్వాపిష్యమాణా నేకనైరిచక్రంబగుచక్రంబొసంగి యప్పాక్షపరాధీనుండు తిరోధానంబునొందె. నిదియువిష్ణుదేవుని మహానుభావబీజంబు॥

మ॥ కలనన్ మీకననేల నియ్యఖిలలోకవ్రాతమేకంబుగాఁ।
దలపడ్డన్ త్రిదశప్రవేశుఁడగునద్దైత్యారిచేఁ జిచ్చునన్।
శలభస్తోమము గ్రాగ్రుచాడ్పున వినాశంబందు నయ్యిందిరా।
లలనాధీశ్వరునాజిఁ గంగమునఁ గెల్వన్ శక్యమేయేరికిన్॥

గీ॥ మీకు నెవ్విధమునను సమీకనుందు।
జంగమస్థావరాత్మక సకలజగద।
ధీశుఁడగు విష్ణుదేవుఁ జయింపరాదు।
గాని యొక్కవిశేషంబు గలదు వినుఁడు॥

సీ॥ గంధర్వపలభుక్సుధాంధోస్సరోహిప్రముఖజాతులకు నెల్లమూలకంద।
మజుని చేసత్కృత్యనియుక్తులగు ప్రజాపతులకెందఱకును బ్రాథమికుడు।

నిగ్రహానుగ్రహనిష్ణాతమగు సప్తఋషిమండలమునఁ బురోగముండు।
పరమేష్ఠి మానసప్రభువుఁడైన మరీచియను నాదిగృహమేధికాత్మజుండు।

కశ్యపుండనెడు ద్వయాతిగప్రవేకుఁ।
డమునిసామాన్యసాధారణానుభావుఁ।
డుత్తమతపంబు సల్పుచునున్నవాఁడు।
రుచిరవిష్ణుపదీనదీరోధమందు॥

వ॥ అని చెప్పి యసురేంద్రుండనువానిం జూచి॥

మ॥ సురసారంగవిలోచనానుతతనూశోభన్మదభ్యస్తభా।
సురసాహిత్యరుగీతికాదికకళాసూర్ధానసభ్యంచితా।
సురసామ్రాజ్యరమావతారమనఁగా సొంపారునీయాత్మజన్।
సురసాభిక్ష్యనుఁబంపుమా మునివరేణ్యుండున్నగాంగోర్వికిన్॥

క॥ ఆయనునత్పుంగవునకు।
నాయమకును ముప్వురుద్భితులగు సురధికతే।
జోయుతమూర్తులునుఁ బ్రభి।
న్నాయుతపృథుబలులునగు మహాశూరవరుల॥

వ॥ ఆముప్వురిలోన॥

గీ॥ మన్యముండు శాత్రవధనుష్మన్యముండు।
ప్రోద్యదమరౌఘభయదజనోద్యముండు।
వైరమానాధుఁదొట్టిదాయలఁజయించి।
దివిషదులమీఁది మీకినఁ దీర్చిమజెయు॥

క॥ అగ్రియుఁ ప్రాజ్యతరతరస।
భుగ్రాజ్యమహోపదాధిపుని జేయునుమీ।
వ్యగ్రతలుమానిమల్లపి।
తాగ్రియకృత్యమునకై ప్రయత్నింపుఁడనన్॥

సీ॥ సహజనియగు సమిచ్ఛక్తి చక్రాయుధుచేఁ బ్రసంగుటయు నందుచేఁ [గలిగిన
సాంద్రమశిక్షఫలాశౌచంబుఁగొన్నాళ్ళవట్టియమైత్రలవోవంగనవుడు।
మహితశుక్రోక్త్యఘమర్షణబుఋక్కులనానందశింధువునందు లెస్స।
యవగాహనమొనర్చి యతిభక్తినన్వయగురువర్యుచరణతామరసయు
గను బునఃపునః ప్రణామంబులొనరించి। [గము।
యమ్మహాత్మునొద్దనానతిఁగొని।
స్వస్వధామములకుఁ జనిరసురేంద్రపు।
రస్సురులయినట్టిరాత్రిచరులు॥

ఉ॥ అంతఁదనూజఁబిల్చి యనెనయ్యసురేంద్రుఁడు తల్లిభార్గవీ।
కాంతుని చేనరిన్ గడుఁబికారమునొందిసు రారులెల్లను।
క్శాంతికినై యుపాయమడుగన్ గురుచెంతకుఁ జేరి వేఁడగా।
నాంతరదృష్టిఁజూచి యతఁడంతయుఁ దెల్పెను భావివృత్తమున్॥

* కవిరాజవిరాజితము *

అలఘుచరిత్రుఁడు విశ్రుతశాంతిదమాదిగుణౌఘవిశిష్టుఁడనా।
విలహృదయుండలకశ్యపుఁడన్ మునిరేలుపుటేటిదరిన్ దబమున్।
జలిపెను నమ్మునిలోకవరేణ్యుని సంగతినీకునయింతురుపు।
త్రులు ఘనతేజులు ముప్పురు శౌర్యనిధుల్ ప్రథనోగ్రులవార్యబలుల్॥

స్వాగతవృత్తం॥ అందుమధ్యముఁడహర్పతితేజం।
డిందిరావరుఁ జయించినికారం।
బొందజేయు సమరోర్వినటంచున్।
గందయొజ్జమునకావ్యుఁడు సెప్పెన్॥

క॥ సత్వరమయుత్తపస్యా।
పత్వరతుఁడివలన నాత్మజన్మనమోఘా।

జిత్వరు విష్ణ్వాదిదివిజ।
జిత్వరుఁగనిమాకు హితము సేయుముతల్లీ॥

ఉ॥ నాకిజనంబుచే నని మొనర్చ గడుఁబన్నముఁబొంది మేమతి।
వ్యాకులితావిలాత్మకులమైతిమితల్లిరొ గోరుచుట్టుపై।
రోకఁటిపోటుగాగ హ్యారుంతుదమామునిశాపసంభవ।
చ్ఛోకముఁ దెచ్చిపెట్టకుముసుమ్ము సురల్ విని పెద్దనవ్వఁగన్॥

సీ॥ మాయావిమషినొటమునగురుండొనరించె మాయయంచునభిక్ష్యనుగు [వనీకు।
నని పెదఁ భావిజ్ఞుఁడగుకవిదిన్నంపుమని పెలుచన్ జెప్పినందువలన।
నమ్మహితునిహృదయమెఱింగి మెలఁగు మాయమ్మ హితుల్ హర్షమం [దఁజనిన।
కార్యముఁ దగనమోఘతఁదీర్ప మానిలోకార్యముని యనుగ్రహం [బువడసి।
దానవీతతి నేర్పున్నదానవీవ।
నీవతగుదిప్పనికిఁభావినీవతంస।
మాయనుంగుఁదనూజయొమాయవేగ।
మరిగి భిమరముత్పాదింపు మరిగిరులకు॥

నర్కుటవృత్తం॥ అనవుడు నప్పొలఁతియ నెనయ్యొడకంపుటకున్।
మనసెటులొప్పఁ బుష్పసుకుమారమనోహరసం।
హననలుపొల్తులెకఁడ నమర్త్యణులైనతపో।
ధనులు దృఢాత్ములెకఁడనెదన్ డగనారయుమీ॥

గీ॥ సారధిమణాసురాచార్యజటికుఱఁగట।
నలఁతితనమొందదే రంభయంతటిదియు।
నిట్లగుటకనివినియును నీకుమారి।
యెంతటిదియనిమనమున నెంచవైతి॥

ఉ॥ ప్రేముడిమీఱఁ బెంచినతుభీశిశువున్ బులివాతఁ ద్రోచిన।
ట్లామునిసింహుచెంగటికినంపఁ దలంచితినన్నకట్టా।
యేనయిపోయెఁ బుత్రిపయినిందనుకన్ గలయన్యరాజక।
న్యామణిమర్లభంబయిన యట్టిపుంగారము దానవేశ్వరా॥

చ॥ అనవినిముగ్ధవౌటఁ దనయాయిటులాడితికాని నాకునీ।
వనఁగనునాముప్రాణమననంతరమున్నదటమ్మయమ్మహా।
త్వనిధికినీకు సంగమముదైవవినిశ్చితమంచుఁదివ్యదృ।
ష్టి నెఱిఁగిక్రవ్యభుగ్గురుఁడుచెప్పుటచేఁ గదయింతకొప్పితిన్॥

ఆ॥ చెప్పవలసియట్లు చెప్పితినేగాని।
నీకుమానిశాపనిహతిభయము।
లేమిదిక్కుమింత లెస్సయెఱింగియు।
కాదె యిట్టిపనికిఁగడఁగినాఁడ॥

క॥ దీవనయొసఁగెఁ గపిసురన।
దీవనవాసి యగు నయ్యతివరుని వలనన్।
నీవనపాయరిపుధ్వజి।
నీవనపావకునిఁ బాపఁగన్ గనెదనుచున్॥

ఉ॥ కొండలమంచుచున్ జనుటకూడదుసుమ్ము ప్రియాత్మజానమః।
ఖండశభిన్నవాయనఁగఁగర్బురకన్యలనీవయస్యలన్।
గొండఱుఁదోడుగొంచరిగి కుందనసార్ధ్యులు వీరమాత్రవై।
పొందుమనూనమైన యశమున్ భృశమున్ గృశముద్విపోదినీ॥

చ॥ అనిజనకుండువల్కఁదరహాసముమోమునఁ జెన్నుమీఱని।
ట్లనుసురసాభిధానయగునవ్వరవర్ణిని దైత్యవర్యమే।
మనియెదో నీవుచూతమనియుంటినిగాని మదీయకౌశలం।
బునకు నశేషమైన జగమున్ వశమౌననశంకయున్నదే॥

చ॥ అరిగెదనిష్టసీమలకునాదలఁదాలిచియమ్మహామునీ।
శ్వరుమహిమాఢ్యునిష్టవరివశ్యులనవ్వహమున్ భజించెదన్।
గురుతరమైనతత్కరుణకున్ దగుపాత్రము నైతినేనిదు।
స్తరవిపదబ్ధిఁగూలిన నిశాచరజాతికి సాకనయ్యెడన్॥

క॥ నీవును నాప్త్మకాభిను।
తావాప్తియవశ్యసుగమమగుటకునన్నున్।
దీవించి వీడుకొలుపుము।
నావుడు నసురేంద్రుఁడ త్తనయకను నెలమిన్॥

క॥ ఈపూటవలదు రేపటి।
రేపకడఁబ్రయాణమై యరిగెదన్ గళ్యా।
ణాపాదియగు ననంశయ।
మీపయనమునీకుఁ ధీమతీడితధిషణా॥

ఆ॥ అనిన వల్లెయని నిజాత్ములఁదనవలె।
హృష్టులైన పూర్వదేవసుతలఁ।
బయనమునకుశిద్ధపరపించి యాత్రిక।
య్యావిదయాయితమయియుండెనంత॥

సీ॥ ప్రాచియన్ సీమాటిపడమర నేస్తకత్తియకుఁబంపిన కెంపుతెలెయనంగ
హదనుసొన్నారి రేయతివసొమ్ములకుఁగాఁగరఁగినయుపరంజికరుడనంగ।
వరుణాత్మజులుబ్రకుంకుకరువపైనాడివిడ్చినయట్టిమొజపుట్టచెండనంగ।
సాంధ్యరాగము పేరిజ్వలనశైలముపెళ్ళఁగ్రకిటన యుజ్జనకల్లనంగ।
దమ్మికేవియబోఁడికి నెమ్మికాఁడు।
నిద్దఁపుంజీకటికిఁ దీరనిపగవాఁడు।
తొవలయుల్లాసమడఁగించు దండగీఁడు।
పశ్చిమాంభోధిదరిఁజేరెఁ బవలుతేఁడు॥

ఆ॥ వహ్నిరీతిమూర్తి తోవలవెట్టముతన ।
దీప్తిఁ గోలువడెఁ బ్రతీచిఁ జేరి ।
యారయనినుఁడైన వారుణినానుచో ।
మందతేజుఁడగుట సందియంబె ॥

ఉ॥ ఆగడమూనిపట్టపగలర్మిలిఁ బద్మినితోడఁ గూడిసం ।
యోగముఁ జేయుటెల్లరకు నుల్బణమాటయూఁదన్నుఁబట్టును ।
ద్యోగమునన్ రయంబునఁ బ్రదోషము వెన్బడినన్ భయంబునన్ ।
డాఁగుటకేగెనోయన నడంగెఁ బ్రభాకరుఁడంబురాశిలోన్ ॥

చ॥ సవిధపథంబునం జనుత్విషాంపతిఁ గన్గొని పుచ్ఛడీకయా ।
చువరుణపత్నియన్యపురుషుల్ తను నెవ్వరుఁ జూడకుంటకై ।
భవనము మ్రోలనడ్డముగఁ బన్నినదట్టవుచెంద్రకావిగం ।
డవడమొకో యనన్ బడమటన్ బరవంజెను సాంధ్యరాగముల్ ॥

సీ॥ పతివచ్చునని దిశావాసక సజ్జికకట్టవిప్పిన కావిపుట్టమేమొ ।
హరిరథాశ్వఖురక్షుణ్ణచరమాద్ర్యధిత్యకోద్ధూతగైరికధాతుధూళియేమొ ।
ప్రొద్దుతోనైనపోరుననింగిఁ బాలుమందేహదేహాసృక్ప్రవాహమేమొ ।
సవితతోఁ దినలక్ష్మి సహగమించుటకుఁ బేర్చి జ్వాలింపఁ జేసిన చిత్యయేమొ ।
యనుచు మధ్యమవిష్టపంబున వసించు ।
జనులు తమతమమదికిఁ దోఁచినవితమునఁ ।
బలుతెఱఁగుల నుత్ప్రేక్షించిరలవి నాంత ।
సమయమునఁ బొల్చు సంజకెంజాయఁ జూచి ॥

చ॥ అసదృశమున్ స్థిరంబునగు నంబరరత్నము నోవుటన్ ఖిత్ర ।
ప్రసువనునింతి వంతగమరన్ విలపించుతటిన్ దదీయశో ।
కసహయరీణసంవళితకజ్జలరోదనవర్గమోయనన్ ।
విస్ఫురమయ్యె నెల్లెడల వెగ్గలమై తిమిరమ్ము రోదసిన్ ॥

చ॥ కువలయభూరిశర్మఘటకుండును సత్పథవర్తనుఁడునై ।
నెవఁడెవు రాజువచ్చునని నిద్దపుహాళితలిర్పనింగిచం ।
దువకలదిష్టశుండనుఁడు దొత్తగఁగట్టిన ముత్తియంపుచే ।
రువలననొప్పె ఋక్షనికురుంబములాకసమందు నెల్లెడన్ ॥

సీ॥ మిత్రునిజాడ లేమికిఁ బొక్కుచుఁదలెత్తి నెమకుచుండిన తూర్పునెలఁత [మొగమొ ।
యొంటనివాని రేకంటుఁదాఁకి జయింప నుడిమొగ్గరమువన్ని నడచు [నిగమొ ।
హాలక్రైశదిబిడ్డఁడెగుప్పై చుపుఁబూర్వగిరిపైఁబడినబంతి విరులచెఁడొ
సనుయనూంత్రికుఁడు ధ్వాంతముమాప సంత్రపిభూతిక్రై తెచ్చినబూ [దిపఁడొ ।
యనుచవనిలోకముననున్న జనములెన్న ।
సురలకోగిరమిడవిడుపరులమిన్న ।
కనులవనములపాలిటి గొడుగున్న ।
పొడుపుఁగుబ్బలిపైఁదోఁచెఁ గడలివెన్న ॥

మ॥ ఇలపైఁ బ్రాణులుపద్దడంగుటయు హాయిన్ స్వాంతరంగంబుని ।
ర్మలమైయొప్పుడు లోకతాపసుఁడెడన్ బ్రహ్మనుసంధానమున్ ।
జలుపన్ గ్రొందెలి నారపీరమెయినిండన్ దాల్చెనోయంచుఁద్ర ।
ష్టలు భావింపనెసఁగె నెల్లెడలఁ జ్యోత్స్నల్ పుష్పపూచాడ్పునన్ ॥

చ॥ అపుడసురేంద్రుఁడాత్మజఁబ్రియం బలరఁబిలిపించి పానజా ।
శిపులుఁగువోలెనా సొబగులేమకుఁ బంగటకేగినిల్వన ।
చ్చపునెలవెల్లునైటఁ దనుజాసహితంబుగఁ గూరుచుండిక ।
శ్యపమునిచెంతకున్ జయనమైచనమన్న కొమార్తెకిట్లనున్ ॥

క॥ ప్రాణమును విడిచియైనన్ ।
మానమె దలఁకొనంగుణము సేయవలెన్ ।

గానన్ మానినిప్రాణస।
మానన్ నినువిడువవలసె మానము సొంతెన్ ॥

గీ॥ ఎపుడు లాంటివిలాతుల నెఱుఁగనిపసి।
కూనవగునిన్నుఁ దేశముల్ కానిదేశ।
ములకుఁ బంపించి హాయినంబుల కొలంది।
నిన్నువిడిచియెట్లుందు నేకన్నతల్లి ॥

సీ॥ విద్రకై యాచార్యునొద్దకేగినయప్డె చాలసేపుంటకుఁ జలదరింతుఁ।
జోటికత్తియలతో నాటలకై పోవఁదడవు గా నప్డమికిఁ దల్లడిలుదు।
నోలమందిదీశ్వరోపాసనము సేయుచున్నప్డె మసలుటకున క్షలింతు।
నెటకైనఁబయటనే మెగుటలటస్థంబై ననినుఁబాసిచనుటకు నెగులుపడుదు।
మామకతపఃఫలమనీవు మగిడివచ్చి।
కంటఁబడుదాఁక నీప్రతీక్షణము హాయి।
గంబులెటువలెయాపింపఁగలుగువాఁడ।
నకటా యెంతనిర్దయయయ్యె నియతి ॥

సీ॥ మఱుకువలఁటివాక్చమత్కృతి నెడలోనిబెంగయెవ్వతెవఁ జపించునింక।
గలకంఠరవముతోఁ గానమెవ్వతె పాడ వీనులవిందుగా విందునింక।
శ్లోకంబులన్వయించుచునర్థములు ముద్దుపలుకులనెవ్వతె తెలుపునింకఁ।
బలువితంబులచేతిపనులచేఁ జెలులకు విస్మయంబెవతె గావించునింకఁ।
బంజరంబులోనున్న పచ్చగఱుల।
పులుఁగులకు నేర్పునెవ్వతె పలుకులింక।
నీవులేనన్నినాళ్ళును నావసథము।
గహనభూప్రాయమైయుండుఁగద వెతల్లి ॥

చ॥ కడిమియు రూపసంపదయుఁ గల్మియుఁగల్గిన యొకరుఁ సోఁకుడుం।
బడుచు మనకున్ గుణాఢ్యునకుఁ బావకసాక్ష్యమునన్ హితుల్ ప్రియం।

పడనినుఁబల్కెఁగా నొసఁగుభాగ్యముగల్గక గోఁచిపాఁతరా।
యఁడయిన వృద్ధతాపసునకర్పటయీవలసెన్ ద్వితీయఁగాన్ ॥

చ॥ అనితఁమీఁది వార్ధకమున నశ్రువులొల్క నతండ్రిఁజూచియిం।
పుననను నామెకోడలికిఁ బుద్ధులుచెప్పుచున త్తఱంకువో।
యెనవినచాఁవ్రకఁ బయనమేఁగుతఱిఁ వెతకూడదంచునా।
కుఁనొడిపినీవె యిప్పగిదిఁ గుంచుటయర్హమె తండ్రి బేలనై॥

గీ॥ చక్రవజ్రాదిధారలసంమునఁదల।
లిటికియున్నగరాసులకీకనన్ను।
శ్రీపతీంద్రాదులంజలిసేయుపాఁరి।
కాంక్షికిచ్చుటనాదు భాగ్యంబకాదె।

క॥ జాతిజయగు నొకనాతియ।
రాతిపరాభూతులయిన రక్షసులఁద్వెష।
ఖ్యాతిదొలంచిమనిచెనను।
ఖ్యాఁబడయుకంటె నేమికావలెనార్యా॥

వ॥ అంగికస్పందాదులగు ననేకనిమిత్తంబులుధాఁచిశుభోదర్క సం
సూచకంబులగుచుఁ గన్పట్టుచున్నయవి యిష్టార్థసిద్ధియగుట యవిదికిఁ
తంబుకావునవాపోకకై యూవంతయు వంతనొందక సుఖంబుండుము నీ
కిడుచున్నట్లు నేపోయివత్తునని మందలించిన నానందపరవశుండై బృందా
రకసపత్నుండాసుందరీమణితుండంబున ముందలఁజొన్పి బిట్టుకౌగిలించు
కొని నీయట్టిపట్టిగలనాకికష్టులు మట్టుపడుటయేమిచిట్ట తల్లినీవుపుత్రికా
రూపంబునం బ్రసన్నవైన నాపాలిటిభాగ్యదేవతవగుటనిక్కువంబని వ
కాణించి మఱియునిట్లనియె॥ [నాకినట్లు।

సీ॥ కడువాఁడియైనట్టి కౌక్షేయకముచాయ నాల్కయంతయుఁ జాఁచి
త్యక్తనిరోష్ఠకంబుదారుణంబునునైనకోడెదిల్వనుముద్దుగొనినయట్లు।

కాలుసేతులుగట్టిగాఁగట్టుకొని యేటఁగడలకందనిచోటఁ బడినయట్లు।
గళముదాఁకశిరంబుఘాతుకంబైన శార్దూలంబునోటిలోఁ జూర్చినట్లు।
కినుకముక్కునఁగల్గిన మునులతోడి।
వైరకాలికైకత్రవాసమ్మపాయ।
కరముకరముప్రమత్తవై కశ్యపుకడ।
మిగులజాగ్రత్తతోడుత మెలఁగుమమ్మ॥

మ॥ తనయారత్నము యన్యరాత్రిచరకాంతాపద్గర్భఁబున్ సుధీ।
జనతాశ్లాఘ్యమునైననీతెలివియున్ జాతుర్యమున్ దాత్య్యమున్।
వినియోగించుటకిప్పుడజ్జయొదవెన్ నిష్ణాతవై యెత్తెఱం।
గునన య్యుత్తముచిత్తమున్ బడసి నాకున్ గూర్చెదో భద్రమా॥

ఆ॥ ప్రొద్దుచాలవోయెఁ బొమ్ముసంవేశాల।
యమునకీవునేనునరిగెదను।
కొందువంచుముద్దుకూఁతును పిల్చి।
యరిగెఁ బడకటింటికతఁడు నంత॥

ఉ॥ తోయజులార మీపతులదోర్ద్రఢబంధములొత్తిగించమీ।
మీయుదయంపుచెయ్వులను మెల్లనలెండనిపిల్చుచున్నవే।
మోయుటులంచు శ్రోత్రజనముల్ ముకుళించలపోయఁగొర్కొరో,
కోయని యజ్జవాలుపులుఁగుల్ రుతిసేయఁదొడంగెనొక్కెటన్॥

సీ॥ చెలువులూంచి దినకంచెలతెప్పటిఘటించి విడెపుతమ్మలు తమ్మపడిగను [మిసి।
తొడవులపీడపాటెడలించి దసరిజేసికూర్చి పీడినకురుల్ కొప్పువెట్టి।
వలపుకీళ్ళుబిగించివలువలుసవరించి చేలకొంగునఁజెమటఁదుడిచి।
మకమకలాడుదీపకళిక వెల్గున నిల్వుటద్దమున మేనీడఁజూచి।
బడిబడిఁ గులాయములనుండి వెడలివచ్చు।
కిమ్మపలుకుతుంపుడు రామతమ్మపెట్టు।

లనఁగ మగనాండ్రు కేళిగేహములనుండి।
వెలువడిరి ఘుస్రముఖకృత్యములకునపుడు ॥

శా॥ సాయంకాలమునందునీసరసకున్ జంద్రుండురాఁగంటినే।
డీయాతండలి నాయకుండలుకఁ జూడింకన్ దన్నుం బ్రశ్నింపనే।
చాయన్ బోయెనొ నేనెఱుంగనని విస్రంభాప్తికైప్రాదిత।
స్త్వాయఃపిండముఁ బట్టెనో యనఁగ సప్తాశ్వుండు వొల్చెన్ దివిన్ ॥

చ॥ వెలుఁగులరాచకోడివిను వీధినిఁ గల్గడరాలియున్నరి।
కఱలనెడుగండ్రనూకలను గ్రక్కున మెక్కుచునుండఁ దన్ననున్ ।
గలుపునఁ గప్పినట్టికడిగా భ్రమియించి మెసంగునోయటం।
చళుకుననోషధీశుఁడపరాంబుధిఁ దూఁకొని నక్కెనక్కడన్ ॥

క॥ ఆతటిమద్దిష్టోద్యాను।
కౌతుకియను రేంద్రుఁ డొప్పుగా వేల్పునిశ।
యాత్రలముఁ గిడిది నెయ్యుఁడుఁ।
గూఁతురిశయనాలయమునకున్ జనివడిగన్ ॥

ఉ॥ దూరము సెప్పరాని పెనుత్రోవ జరించెను బాటసారి పై।
న్బ్రరులలోననిలిగిన పోటరు లేగెను దండుదారిదు।
ర్వారతమిస్రమశ్రమలవంబుగఁ జొపెను హాలాంతకారితాఁ।
దూరుపుకొండ నెత్తమునఁ దోఁచెహిమారికుమారికామణీ ॥

క॥ లెమ్మా మొగమ్ముఁ గడికికొని।
పొమ్మా మనోనసములోని భోజనమునకున్।
గమ్మ పయనమ్ము వేగమె।
లెమ్మా కొలమువారిగోడుదీరఁ దనయులన్ ॥

క॥ అనిజనకుఁడు మేలొ్కొలిపిన।
వినిడిగ్గన లేచి సెజ్జవిడిచి సురన్న।

ట్రను మధ్యయప్పటికిఁదగు।
పనులు నెఱపి చెలులతోడఁ బ్రస్థితయయ్యె॥

ఉ॥ కశ్యపమౌని చెంతకరుగన్ బయనంబగుచున్నయయ్యెసా।
దృశ్యతనూవిలాసనసురేంద్రతనూజను సాఁగనంపుటా।
వశ్యకమంచు నెల్లపనిపాటలునున్ దృజియుంచి ఖేదము।
ద్వశ్యముననున్నలై వెడలివచ్చిరి నైగములా మెపజ్జనున్॥

సీ॥ మాతల్లినిన్నఁగ్రమ్మఱఁజూడఁగల్గుటయెన్నాళ్ళకోయనియేడ్చువారు
నినునెడబాసి యీనిగమనుందెట్లు కాఁపురముందు మేయని పొరుల
శంకరుకరుణనాసాదితేప్సితకార్యసిద్ధివైరమ్మని చెప్పువారు। [వారు।
నిక్కముగైనను రారులకుఁ దేవనై యుద్ధరింపుమీయని యెచ్చరించువారు।
నగుచు వెంబడి నరుగునన్నిగమగృహులు।
కెల్లవేర్వేఱఁ గేలోడ్చి మెగుచున్న।
తనయనశ్రుపరీతనేత్రయుగళుఁడయి।
కాంచుచనురేంద్రుఁడు యెఁ గద్గదికతోడ॥

ఉ॥ ముద్దులకూన ప్రాయమున ముకులపచ్చలె యారకుండియున్।
బెద్దవుతద్దయున్ దెలివిపెంపున నెవ్వరియొద్ద నెవ్వడె।
ట్లాద్రికమై మెలంగవలెనో సమయాదితినేర్చుపీవెనే।
బుద్ధులు సెప్ప నెవ్వఁడను పొమ్మునినున్ శివుఁడోముఁగావుతన్॥

చ॥ పదిలముసుమ్ము తల్లి మునిపజ్జ మెలంగుతఱిన్ బుభుక్షయున్।
నిదురయుమానియైన నతనిన్ భజియుంచి తదీయనిర్వ్యక।
ల్పదయకు నీవు నేర్పుమయిఁ బాత్రమవై మముఁ బ్రోవుమమ్మయం।
ఛెదఁగదియించి ముద్దుగొనియెన్ జనకుండనురేంద్రుఁడాత్మజన్॥

ఉ॥ ఆసురసాఖ్యయున్ జనకునంఘ్రులకుం బ్రణమిల్లిపట్టగా।
వాసులవంకఁజూచి యపవాదమొసంగుఁడు పోయివచ్చునా।

కోసము మత్ప్రసూపితలఁ గుందఁగనీయకుఁడంచుఁ జెప్పయా।
ళీసహాగమ్యమానయయి లేమచనెన్ బెడవాసి స్వీయులన్ ॥

క॥ అసురేంద్రాద్యాశరులును।
రసపోయిఁవలనికిన్ మరలిచూచుచునా।
వసథములకుఁ బోయిరిమా।
ననములకున్ నలఁకువల్ పెనంగొనియలఁపన్ ॥

వ॥ అనియామహర్షులకు రౌమహర్షణి యిట్లు చెప్పె ॥

* అచలజిహ్వకందము. *

క॥ అహిపుంగవబాహానుహా।
మహాపుంగవవాహాభీమనుఖవముఖనహా।
నహాభవగంగాభీకమ।
ఖహాబహువాపాహిభోగఖగప్రాగవిభూ ॥

* బంధురవృత్తము. *

రవిశిఖితుహినకిరణశుభనయనా। రౌప్యమహీధరరాట్ఛయనా।
సవనహరణమునిజననతచరణా। సాధుముముక్షుసుధీశరణా।
పవిధరవిధుముఖవనితసుచరితా। పండితశస్తకృపాభరితా।
శివవిషధరవిలసితమణివలయా। శ్రీజగదబ్జపురీనిలయా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దినటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు ప్రథమా
శ్వాసము.

:0:

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రితభక్తలోకరక్షా । చతురాచతురాననాది సంసేవితయా ।
ప్రతిమానుభావమునిరా । జ్ఞితశమ్యనుపదభూమి విశ్వనాథస్వామీ ॥

వ॥ అవధరింపుము శౌనకాది మహామునులకు విదితాశేషపురాణవ్రాతుండగు సూతుండవ్వలికథ యిట్లని చెప్పె॥

సీ॥ అంబుభృత్స్వఃపీలితాంబులైన యనేకకుత్కీలములను పశ్చాత్కరించి ।
స్వస్వజాత్యుచితజీవనజనపదములౌ దేశముల్ పెక్కులతిక్రమించి ।
జంభీరసాలాక్షుకుంభీరసాలాదిసాలముల్ గలవనుల్ చాలఁగడచి ।
తనయుల్లె పతిసంగమునకునై శరవేగమునఁబోవు బహుశైవలినులు [దాఁటి ।
యన్నిశాచరపంకేరుహాయతాక్షి ।
ప్రియసఖులు వెంటనేతేరఁ బితృనియుక్త ।
కృత్యనిర్వహణైకాగ్రహృదయయగుచుఁ ।
గతిపయదినాభినిర్యాణకలననరిగి ॥

క॥ గంగన్ బావితసగరతు ।
గంగన్ శ్రితముక్తియోషిదంచత్కటనా ।
చంగన్ సమధిగతశైవ ।
రాంగన్ దగ్గతహృజ్జ్వలతారంగన్ ॥

పా॥ క॥ అంగనకనుఁగొనె శబ్దన ।
భంగనపాకృతనిమగ్నపాపాత్మాంహా ।
స్సంగనధిగతశివోచ్చై ।
రంగనవితపశ్యదంతరంగా గంగా ॥

ఆ॥ సాటిలేనివేల్పు ఱేటితీరమునకుఁ ।
జోటితుటుముతో నిశాటిఁజేరి ।
తాటిసిడమురాచమేటితల్లిని మెచ్చె ।
మాటిమాటికోసఁగు చేటికోళ్ళ ॥

సీ॥ అగజాకరాంగుళికాష్టకచ్యుతవయి విష్ణుపదమున నావిర్భవించి ।
మందాకినియ నెడుమానితసంహూతిఁద్రిదశాలయంబునస్థితివహించి ।
పరగఁజాహ్నవియునుఁ భాగీరథియునను సంజ్ఞలచే మర్త్యజగతిఁ నిలిచి ।
భోగవతీసంజ్ఞఁ బొలుపొందఁగాఁ దాల్చి యిలయధోభువనంబు నధిగ[మించి ।
కడఁగి త్రైలోక్యపావనీకరణదీక్ష ।
పూనిచరియించునట్టినీపుణ్యచరిత ।
మభినుతింపఁగనాతరమగునె ప్రణత ।
కలుషశమనైకమౌనిగంగాభవాని ॥

క॥ మజ్జనమొకపరిసల్పుచు ।
సజ్జనమునకిదియయఘచయక్షాళనమా ।
సజ్జననవరతమునీ ।
పజ్జనవసియించు టెంత ప్రాయత్యదమో ॥

చ॥ సరసిజనాభ తామరసజన్మశచీదయితాదినిర్జరే ।
శ్వరమకుటోపలద్యుతిపిశంగితమంగళపాదపీఠుఁడౌ ।
పరమశివుండు నీపరమపావనతాగుణమెంచికాదెనిన్ ।
శిరమున నాదరంబున వసింపఁగఁజేసెఁదరంగిణీమణీ ।

క॥ శుభచరితయెవ్వరీభూ।
తభవిష్యద్వర్తమానదాతలలోఁద్వ।
న్నిభులకలుషజీవనదా।
నభృన్నైకాయనత పెంపునన్ గణుతింపన్॥

చ॥ ఘనతరమైన గర్భనరకవ్యథమాన్పెడుచోటికెక్కు-మె।
ట్లనఁదగుత్వత్తరంగములయూహతులంబడునట్టివారలె।
ప్లుమ సమవర్తికింకరకఠోరతరాయుధజాలగాఢమ।
ర్దనములఁబాధనొందరుగదా తటినీకులచూళికామణీ॥

గీ॥ స్నానమొనరింపఁ బంకసంక్షాళనంబు।
నాచరించినసత్కృష్ణులైయాత్రియింప।
నమృతమొసఁగియుఁ బ్రోచెడియాదిమూర్తి।
విలనుప్రత్యక్షదైవంబవీవకావె॥

మ॥ అభవుండగ్గెడునోయటంచు నళుకావంతైనయున్ లేకని।
త్యభవద్వార్యవగాహదీక్షితునకున్ దద్దేవసారూప్యమున్।
రభసంబొప్ప స్వతంత్రవైయొసఁగె దారానిత్తికెక్కించుకొ।
న్నభయంబుండునె యాత్మనాధునెడనెన్నండేని ప్రోయాంద్రకున్।

సీ॥ ప్రాలేయభూధరోపత్యకాంగణమున శైశవక్రీడలు సలిపిసలిపి।
యధికవటంచుఁబొందాసించిహూడినయమునాదితటినులనాదరించి।
యంగవంగాదిదేశావనులకునెల్లరత్నగర్భాత్వసార్థకతనొసఁగి।
యనురూపుఁడైననాధునిఁగోరి చనిచని వాహినీపతియైనవరునిఁబడసి।
బహుసపత్నులలో నిజప్రాభవమున।
నగ్రమహిషీత్వపంపదనధిగమించి।
ప్రణుతివైనట్టినీదు సౌభాగ్యగరిమ।
ముచ్చటగుగాదె మముబోఁటిముద్దియలకు॥

గీ॥ ఆశ్రయముఁ గోరి దరిఁ జేరినట్టి వేన।
నేలుకవులను లోఁగొనియే లెదెపుడు।
కూర్మలకుఁ బుట్టినిండ్లు మీకొలము వారు।
గానఁనీకిదియుచితంబె కాతలంప॥

క॥ అవదాతగుణవఃయాత్మిక।
కవులను భరియించుటొకట ఘనతయెనీకున్।
భువనంబులె భరియించెద।
పవిరతమును నధికతరమహాత్మ్యముననన్॥

క॥ క్రముకేదనీకి దేతల్లీ।
క్రముకేద శ్రితలోకకల్పభూరుహావల్లీ॥
క్రముకేద నమృతపువెల్లీ।
క్రముకేద స్రోతస్వినీసమూహామతల్లీ॥

ఆ॥ అనుచుఁ బొగడిపొగడి యాసేచనకమైన।
యాస్రవంతిమహిమమాళిజనుల।
కెల్లసారెసారెకెరుఁగంగఁ జెప్పుచుఁ।
దన్నదీతటీపథమునన౽గి॥ [నొప్పు।

సీ॥ హోమధూమాక్తంబులుటజముల్ కప్పటాకట్టుదద్దడముల కరణి
మునిసన్నిహిత శివమూర్తులోయనఁగ వ్రేలిమి బూదిపొవులెల్లెడలఁ [దనరఁ।
దడుపుతాల్పులు సెప్పమిడియలసారములు స్రోతలమమలకు సొగపుఁ [గూర్ప।
శుకశారికాదిపక్షులు సంతతశ్రుతిసంస్తవంబునఁ బనసల్ పఠింపఁ।
బుట్టుటీల్గుటయును లేని యట్టిమనికి।
కనుపులెరు వెలుఁగఁ దపోధనాశ్రయంబు।

గోరివద్దియుండినముముక్షులప్రచార।
మెసఁగనొప్పారు ఋషివాటినింతికాంచె॥

చ॥ పదములుకొందఱున్ మఱియుఁ బ్రాహ్మణమింకొకకొందఱున్ క్రమం।
బొదవఁగ్రమంబుఁగొందఱును నొప్పుగసంహితగొందఱున్ లస।
త్పదమలబుద్ధినైనుపనిషత్తులు కొందఱు శ్రద్ధధానులై।
చదువుచునుందురొక్కనిమిషంబునుమానక బాలురచ్చటన్॥

క॥ పతియొకఁడె దైవమనుచుఁగు।
స్మృతిలేనిమనమున విశ్వసించియవస్థా।
త్రితయమున సాధ్వులుకరణ।
చతుష్కమునఁ బతిసపర్యసలుపుదురచటన్॥

సీ॥ ఉబ్జంబులేకాని యుండమంజులసంజవనములులేవని వనరరెపుడు।
కట్టవాల్గంబులేకానిమృద్వంబరములులేవనుచుమూతిముడువరెపుడు
కాయగడ్డలెకాని గ్రసియింపశాల్యోదనమ్ములు లేవనినవయరెపుడు।
పూలుపూసలెకానిభూషింపరతనంపుఁదొడవులు లేవనిమిడుకరెపుడు।
ప్రాణనాథునందుఁ బరమేశ్వరునియందుఁ।
గాఢతుల్యభక్తిగలిగివారి।
సమ్యగర్చనంబె జన్మవ్రతంబుగా।
మెలఁగుచుందురచటి మించుబోండ్లు॥

వ॥ అరిషడ్వర్గముఁ గెల్చి రాగమమతాహంకారముల్ లేకము।
క్తరక్తావసరంబునందయిన సత్యంబున్ దయన్ వీడరు।
ర్వరలోష్టంబున హేమమందును సమభావంబొప్పవర్తింపుచున్।
బరమైకాయనమానసంబుదనరున్ బాడబ్యమాపల్లియన్॥

వ॥ అందుఁబ్రవేశించి॥

శా॥ కావ్యంబుల్ ఘననాటకంబులు నలంకారోల్లసద్గ్రంథముల్।
శ్రావ్యస్వానసమిన్నుఁ లంగములు షట్ఛాస్త్రంబులున్ సంవిదా।

దివ్యాళాన్వయనాథులై చనువు ధాత్రీదేవమాణవ్యమున్ ।
గ్రవ్యాదాంబురుహాక్షిగాంచె మదిలోఁగౌతూహలంబొప్పఁగన్ ॥

సీ॥ జమ్మేటియసటిపెన్బొబ్బస్మరిండ్లఁనుగ్రొద్దిప్రాఁబడెననితీసిపారవైవ।
స్వచ్ఛమౌక్తికములసరిబేసులాటాడి పనికిరావికనని పరిహరింపఁ।
బెనుమగటాలనచ్చనగాయలాగినాడిసఖువయ్యోనివియనిసంత్యజింపఁ।
గాంగేయన్యాదువాలుకనుదెచ్చి గూఢమణులుకొంతసేపాడి కలయఁ
దబిసికన్నెలు కనకరత్నమయభూష। [జల్లఁ।
ణములఁగైసేసిరొకొకయనంగఁదగుచు।
పొంపలరుచున్నవీధులఁజూచియలరె।
నచటియామాణవకని స్పృహతకునతివ॥

ఉ॥ బంధములేక స్వైరముగఁ బచ్చికఁగుత్తుకబంటిమెక్కరో।
మంథమొనర్చుచచ్చటిక్రమంబులనీడల దీర్ఘసాస్నలౌ।
కంధరలొప్పఁబండికొని కన్నులపంటవుసేయుచున్నత।
న్కంధములౌశకృత్కరులఁగన్గొనెనింతి మనోజ్ఞమూర్తులన్॥

ఉ॥ ఆశరసార్వభౌమసుతయారుసికుప్పమునెల్లఁజూచిత।
త్క్రోశదవిష్ఠమైనయొకతోఁపునఁగశ్యపుఁడాసురాపగా।
భ్యాశమునందుఁబ్రాంచితతపంబుననుండుటెఱింగియుత్తప।
స్వీశునిదర్శనంబునకునేగెఁబ్రియాళ్యనుగమ్యమానయై॥

సీ॥ బొబ్బమెకంబులుగబ్బుచెంపమెకంబుఁగంమలతోఁజెలగాటమాడ।
నేడికబాలెంతకెరదెచ్చిముప్పన్నెమెకముగారామునమేఁతవెట్టఁ।
గూనదిల్వాలకెండమేనసోఁకకయుండఁబురివిచ్చినట్టువపులుఁగులోమఁ
గడుపారనిండుక్రేఁకటికాకినెలఁతకుఁ గోటఁడామెతఁదెచ్చి కుడువ
సాజపుఁబగల్విడిదిసత్వచయమెకలసి। [నోసఁగ।
మెలసియుండుటగనుగొని మివులఁదావ।

సాగ్రణితపోమహిమమునకబ్రపడుచుఁ ।
గశ్యపుతపోవనముసేరెఁ గ్రాలుగంటి ॥

క॥ ఆధునికబుధపురాతన ।
సాధునికరవినుతిపాత్రచరితుఁబరివ్రా ।
ణ్ణాధునిఁగశ్యపునాగం ।
గాధునిదరిఁగాంచె నొకక్రముకముక్రిందన్ ॥

సీ॥ ప్రతిజనార్ఘ్యంబైనవైయాఘ్రముకృత్తిపైఁబద్మాసనస్థుఁడైవరగువాని ।
నామ్రపల్లవలోహితాంచజ్జటాపటల్య పిహితచరమాంగుఁడైనవాని ।
ఘూరాక్తసర్వవిగ్రహుఁడయి నివుఱుగప్పినకిత్తివోలె శోభిల్లువానిఁ ।
గనుదోయి మోడ్చినాయునిరోధియైగాఢతన్మయావస్థచేఁదనరువానిఁ ।
గశ్యపమునీంద్రుఁగన్గొని కమలనయన ।
భూరిభయభక్తిసమ్మదాభ్యుదితరోమ ।
హర్షయై జోతలొనరించియాళిజనము ।
లెల్లరకు మెల్ల మెల్లన నిట్టులనియె ॥

క॥ ఎడగలుగఁబోయినిలుతము ।
జడదారులతేఁడుతపము చాలించినవేం ।
బడినెమనమితనికంటన్ ।
బడుటయరయమిత్తినోటఁబడుటయెకాదే ॥

ఉ॥ అల్లదె కాననంబొకటి యబ్బురమైనప్రసూనసౌరభం ।
బెల్లదెసల్ లలిన్ బరవనెంతయునొప్పెడునేత్రపర్వమై ।
చల్లనిమ్రానినీడలను శ్రాంతిదొలంగఁగవిశ్రమింతము ।
చల్లనిశాచరేంద్రతనయామణియానతియీయనందఱున్ ॥

క॥ మందిదియని యావనికిన ।
మంథరగతినరిగియందు నందములరని ।

ర్మించిన యొకజగతిపయిన్ ।
మించినతమిఁ గొంతవిశ్రమించి యటువయిన్ ॥

క॥ సుమనోపచయము గోరుట।
యమరాహితజాతిక దితవాఁగదయనిపోఁ ।
కుమడంతులొండొరులఁగూ ।
రిమి వెనకొల్పుచుఁ దొడంగిరివిరుల్ గోయన్ ॥

* లయగ్రాహి *

ఎమ్మెలెసలారఁ బ్రియకమ్మలును మేల్పనుపకమ్ములును సతుర్కరవక
[మ్ములుఘనాశో ।
కమ్ములునురు చ్యతిలకమ్ములునుహారికనకమ్ములునులోనైనకమ్మవిరులోలిన్
జుమ్మనిదుండగఫుఁదుమ్మెదలుపైవయిని గ్రమ్ముకొనిమూఁగితుమఁలమ్ము
[వచరింపన్ ।
గమ్మవిలుకాని బలఁగమ్మనఁగనొప్పునిసి ద్రిమ్మరికొలంపు చెలకొమ్మగమి
[కోసెన్ ॥

ఉ॥ ఒకర్తె మెఱుంగుబోఁడి తనయొద్దివెలందిని వెన్కపాటునన్ ।
జకిలిగింతవెట్టుటయుఁ జయ్యనయ్యదిచూచిచూచుమా ।
చకర్టిదిట్టయంచు వెనఁజల్లెను పుష్పాడిదానికన్నులన్ ।
బకుర్ననవ్వి రాఁదగినపాదితమయ్యెనటంచు నందఱున్ ॥

చ॥ కురవకమున్ బ్రసూనమునకున్ జిగురుం దియొకర్తె యొకర్తెవి।
త్తరికదిచూడనప్పు పరిధానమునందుఁదగిల్చి దవ్వగా।
నరుగుమునీవుపుష్పవతివైతివిపుట్టముఁజూచుకొమ్మనా ।
నరసిసుపమ్ములోజెఱఁగునంటుటఁగన్గొనినవ్వె నాపెయున్ ॥

గీ॥ పొన్నపూవులుగోయుఫ్రాబోఁడిఁజూచి ।
నీవుగఁడెటిఁగె నేనివండింపకున్నె ।

యన్యపురుషసమాగతవైతివిమఁగ ।
నాలవయ్యునటంచోర్తు మేలమాడె ॥

ఉ॥ సింధురయానయెంతపని జేసితె కోంకక తత్కుమారక ।
స్కంధముమీఁదఁ జేయిడిగి కౌగికనవ్వుచు నుంటివే మెనీ ।
బంధులువిన్నసైతురటె బాగుకుమారి! నీవు నాటనం ।
బంధము మంచిదబ్బెనని పాటనసేయవొ వారికూటముల్ ॥

గీ॥ తనదువిరజాజిపూవుగోసినకతమునఁ ।
దేఁటినిన్ను వెన్నంటియే తెంచుచున్న ।
దదిగొ యో హేమ అదితిభృంగానుసరణ ।
మెప్పుడును నీకుఁ బరిచితమే గదె చెలి ॥

క॥ రమణీతనబ్రహ్మణ్య ।
త్వముసద్ధముగానుక్రముకతరువులతావ్యా ।
జములగు చేతులనయ్యావ ।
తిమణిపయఁట చెఱఁగువట్టితిగి చెఱుఁగంటే ॥

ఉ॥ చేడెరో పూలకై మొగలిచెట్టెగబ్రాకిన ముండ్లు పెక్కుచన్ ।
జోడునఁ గ్రుచ్చుకొన్నవప్పుడున్ మృషలాడెదవేమె యెవ్వరున్ ।
జూడనియోలమందఁ బురుషుం డెవఁడో సమకూడ వానితో ।
గూడితివివ్వియాసరసుగోరులనొక్కులికేలదాఁపఁగన్ ॥

క॥ అనుచువివిధపరిహాసవ ।
చనరచనలతో సుమాపచయముసలిపియ ।
వ్వనరుహవిలోచనలుత ।
ద్వనమునవిహరించిరెలమి దైనారంగన్ ॥

సీ॥ జేజేలతెరువంటిదిఱుతమొయిళ్లనితోఁచఁబూవుందమ్ము రేఁది రేఁది ।
ప[illegible]పుపూనీటి[illegible]ర చాలుపులుపన్నిగంబులుపచరించి దాఁటిదాఁటి ।

యలరు తావులకుఁ దావులగుచు నలరారు తోరంపుటీరముల్ తూఁటి
[తూఁటి ।
తేనియలనుగ్రోలు తేఁటులనదలించికోసిపూల్ కుప్పలువోసిపోసి ।
చేడియలరూపుగొని చెరలాడుచున్న ।
పూలకోరీవజీరు తేజీలనంగఁ ।
గరముసంతసమొలయనకాఱనలోన ।
విచ్చలవిడిగఁ జెరలాడిరచ్చెలువలు ॥

శా॥ ఈలోనయ్యసురేంద్రపుత్రిముగిలోకేశుండనుష్ఠానమున్ ।
జాలింపన్ గసితద్వనీవిహృతులన్ జాలింపనేమించియ ।
యాళీబృందము వెంటఁబెట్టుకొని యొయ్యారంబునన్ మునిశా ।
ర్దూలుఁడుండినచోటికిన్ నడచుచున్ దూరంబునన్ జూచుచున్ ॥

చ॥ సురహరిమధ్యలో మనుజసుందరులో ఫణికన్యలో నిశా ।
చరపరసీరుహేక్షణలో జక్కులక్రొందలిరాకుబోఁడులో ।
తరుణులు సానదీరిదిన దర్పకువాలికతూపులట్టిరీ ।
తెరువునువట్టిమేయరుగుదెంచెదరెవ్వరో సుందరాకృతుల్ ॥

క॥ అనుచతఁడు చూచుచుండం ।
గనె సురసాగ్రేసరంబుగాఁజనివనితల్ ।
వినతోత్తమాంగలైప్రమో ।
కిఱనఁగైకొని దీవనలొసఁగి మునీంద్రుఁడనున్ ॥

ఉ॥ ఎవ్వరుమీరు సారసదళేక్షణలార భయంబులేకయి ।
ట్లివ్వనికేలవచ్చితిరొ యిందటిలో నెఱయందకత్తెయై ।
పువ్విలుకానియకఱజపు మోహనబాణముపోలిఱనొప్పనీ ।
జవ్వనిమిన్నయెవ్వతెయొ సందియమొందక తెల్పుఁడీయనన్ ॥

క॥ ఆసురస కశ్యపునకుధ ।
రాసురసత్తమునకుత్తరంబొసఁగుటకై ।

యాసన్నకోకరుచెలికిన్ ।
దాసన్నయొనర్ప నాసుదతి మునికనియెన్ ॥

చ॥ కలనిజమిట్లుమమ్మునడుగన్ వలెనేపదునాల్గువిష్టపం।
బులఁగలసర్వచేతనులభూతభవిష్యదుదంతముల్ నిర।
ర్గళమగుదివ్యదృష్టినెఱుఁగంగలజ్ఞానులరైనమీకెదన్।
దెలియనిదెద్దియేనిగలదే నిజమారయఁదాపసాగ్రణీ॥

క॥ తరుణహరిదశ్వతేజయ।
సురేంద్రుఁడనుకర్బురునకు సుతయీనవలా।
సురసయనుపేరఁబిల్తురు।
వరసకలకలాకలాపవతినీయుఁడిన్॥

క॥ పలికెమూకసురేశ్వర।
బాలికయీయర్ధశుహినభానునుదిబిం।
బాలికయోనారదజా।
బాలికపిలముఖ్యసినుతభవ్యచరిత్రా॥

క॥ ఈవనితమెపుడుఁద్వత్పద।
సేవనితరవాంఛలేక సేయఁదలఁచియే।
గోవానిన్ బెండ్లాడదు।
మావాసిన్ రూపవిజితమన్మథునైనన్॥

ఉ॥ నావుడుఁగశ్యపుండనియె నాతుకరో యతిలోకరూపధా।
గ్న్యవతరత్నమీయువతికర్బురపుత్రికపోలుఁనున్నదం।
దీవరకేతలంచితిఁజుమీ పరియాఖవవన్నెజాళువా।
ఓవియుతోడనుద్దియగు దీనితనుద్యుతిఁజూచినంతటన్॥

వ॥ అనియాసురసంజూది॥

చ॥ అడవులఁగందమూలములు నాకలముల్ తినుచుండికాలమున్।
గడపెడుపారికాంక్షులకుఁగన్నరిమృష్టపదార్థజాతముల్।

కుడుచుచు రమ్యహర్మ్యములలో విహరించెడు పూవుబోఁడ్లకున్ ।
పడఁతిరో సంగడంబఘటమానము కావుట నీ వెఱుంగవే ॥

క॥ పనితల తాంగీ యూరాయు ।
ఘనితులఁ బేమిటికిఁ బొమ్ము భవనమునకు నీ ।
సనఁ జననుతుఁడగు మునికా ।
వనజనయన యనియె మంజువాచాప్రౌఢిన్ ।

సీ॥ అనఘ లోపాముద్రయను పేర విదర్భవరతనయఁ జేపట్టఁడే పనఁటిచూలి ।
సృంజయరాజపుత్రిక సుకుమారి వరింపఁడే సోరుటో రెంపుఁదవిస ।
సంయాతినృపతనూజాతయైన సుకన్య వరియింపలేఁడె చ్యవనమహర్షి ।
నారాయణి నృపతనయ నింద్రసేనయున్ దరుణిఁ జేకొనఁడె మౌద్గల్యమౌని
వాత్రిపీరిఁ జేకొనఁడె నేలమీఁ రైకాత్ర ।
వేయునేల మనుజాదిలేయముఖ్య ।
జాతిజననాదికారణభూతలైన ।
యించుబోఁడులను పరిగ్రహించలేదె ॥

సీ॥ తనకశేరుకఁ దీసి దంభోళిగాఁ జేసి ఋభులోకనాథునకిచ్చె నొకఁడు ।
నీర్వామిలోఁ గల నీరెల్ల నరచేతిగుంటఁ జేరిచి గ్రుక్కఁగొనియె నొకఁడు ।
నాళీకయోనియంతస్సన స్వమునొంద సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసె నొకఁడు ।
జగదుద్భవస్థితిసంహారకర్తలఁ బిడ్డలుగాఁ గనిపెంచె నొకఁడు ।
మఱియు నెందఱేనియు మునులు యమివరార్ఘ్య ।
లెంత లెంతలోగాటపుఁ బింత చెయ్వు ।
లశ్రమంబునఁ జేసి ప్రఖ్యాతులైరి ।
తాపసోత్తములకు నసాధ్యములు గలవె ॥

మ॥ వ్రతిలోకోత్తమ నిస్పృహాత్ములకు సర్వంబున్ దృణప్రాయమౌ ।
కతనన్ గోరునుగాక మీరు మది సంకల్పించుటో నెల్లనై ।

వతసంఘుంబుల నేలువజ్రితనసర్వస్వమ్ముతోవచ్చిసం।
తతమున్ ద్వాత్పదపంకజద్వయముచెంతన్ గాఁపురంబుండఁడే॥

క॥ పుడుకురతనమ్ము బెట్టుం।
దొడుకును వెలిగ్రాఁకుపైడునున్ గలిగియెసం।
గెడుకులిశధరుఁడుకూరిమి।
కొడుకునముగలరె మానికుంజరనీకున్॥

క॥ పుట్టుగు నెంజెలిమానుపు।
నట్టిమనికి కనుచు తాపయగునీయడుగుం।
బట్టుకొనునంతభాగ్యము।
నెట్టికసీలలకుఁగాక నృజులకొదవునే॥

సీ॥ మతిశాలియహిలోకపతియొకకొడుకువసుంధరాచక్రధురంధరుండు।
ఉత్తమాజశ్శాలి యొకట్టితనూజుండు జగతీప్రవృత్త్యర్థసంచరణుఁడు।
ప్రకటవైభవశాలియొకతనూజాతుండు నాకలోకైకాధినాయకుండు।
అతిలోకబలుఁడొకసుతుఁడనిఁబఁకి వేన్నిక వేన్నిఁక యొండిద్విషఘుఁడు
డొకట్టిఁడొకట్టిఁడుగాగనొకొట్టికట్టి భువన।
మేలుసుతులనుత్పాదించి యొంతయుంబ్ర।
ధనుపడసినట్టి మీకొరుల్ తాపసుల్స।
మానులగుదురె కశ్యపమునుట్టిరీంద్ర॥

ఉ॥ ఓదనుజాప్సరోదితిసుతోరగనాకచరాద్యవేకవం।
శోదయమూలకందనుపయోరుహగర్భమహాత్మసేవధీ।
నీదుపదాంబుజంబులసనీడనివాసమనేకజన్మసం।
పాదితపుణ్యరాశులు శుభంయులుగాకొరులొందనేర్తురే॥

సీ॥ అజ్ఞతాద్వైన్యసమాక్రాంతులకు నీదుసన్నిధియొకొలసన్నిధియగుఁ।
గృత్తపంతమనసంవృతులకునీశుభానుగ్రహముహిమభానుగ్రహముగుఁ

దుష్టాధితర్ష్టార్తితులకునీమధురానులాపముల్ మధురామలాపములగుఁ।
బాపధూస్త్రాపధూపాయితాత్మకులకునీ దయవర్షుకాబ్దోదయమగుఁ।
బెక్కునుడువు లేల నిక్కఁపుఁబత్తితో।
మీయుపాసనమ్ము సేయనబ్బి।
నట్టిపావనులకు నపునరావృత్తిశ్రే।
యమరచేతిలోనియదియకాదె॥

వనమయూరవృత్తం॥ ఆదిగృహమేధిమహిమాఢ్యురెపుడుఁనీ,
పాదయుగళింగొలిచి బాగుపడవేతున్।
గాడనకదీవ్యనుకంపమయిఁబ్రాజ్ఞా।
మోదముననేలికొని ప్రోవఁగదెనన్నున్॥

శా॥ సారస్త్రీస్పృహణీయభవ్యతరచంచద్రూపలావణ్యయా।
నారక్తోలలనావతంసమటులభ్యర్థింపఁదన్మోహనా।
కారాలోకనకించిదంకురితరాగస్వాంతుఁడామౌనిచూ।
డారత్నంబు స్వసన్నిధానముననుండన్ మైకొనెన్ సుందరిన్॥

చ॥ తెలతెలవాఱునప్పుడు తదీయనియోజ్యులకంటెముందుగా।
నలయక లేచి ప్రాస్నావిధులన్నియుదీరిచి యత్తపస్విపు।
ష్కలునిశివార్చనాదులకుఁ జందనపుష్పహవిఃపయోక్షతా।
దులుసమకూర్చియుంచు నలతొయ్యలిమక్కరికాంచిమెచ్చఁగన్॥

మ॥ నలినాక్షీతిలకంబు వన్యములుకందంబుల్ శలాటుల్ ఫలం।
బులుఁదెప్పించి యుపస్కరాన్వితముగాఁబొల్పొందుకారమ్ములో।
గలయన్ జుక్రముతైలపక్వముగఁజక్కన్ వండి నీవారతం।
డులస్పృష్టాన్నముతోడఁజేమనముబెట్టున్ మౌనికిన్ బ్రీతితోన్॥

ఉ॥ జేమనమాచరించిమునిసింహుఁడొకింతుకవిశ్రమింపఁద్రు।
క్యామయమాపవిత్రశయనంబుపయిన్ వెనువాల్చుచున్ దవీ।

యామలపాదయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి కేల్గవన్ ।
గామినియొత్తు మానికపుఁ గాజులు వీనులవిందు సేయఁగన్ ॥

సీ॥ చక్కెర బుగడలు చాపట్లు నీరువత్తిగలు బటాసాలు తేనెతొనలు ।
పోళీలు ఫేణీలు పూరీలు మండెగల్ గరిజకాయలు లడ్డుబరిడెగవ్వ ।
లప్పముల్ గారెలు అరిసెలేలకికాయలం గరొల్లెలు సోగులామాపడలు ।
సరడాలు బెడదలు పారెసత్తులు పూసకజ్జెమలు నిమకుడకలు సుకియలు ।

వెన్నమెఱుఁగులు మున్నగుపిండివంట ।
స్వాదుభక్ష్యముల్ చేసియాజలజనయన ।
హరికాంక్షికి నచ్చటివారలకును ।
గుడువఁబెట్టు వారబ్బురంపడి భుజింప ॥

ఉ॥ ఇమ్ముగ నింటఁ గల్గుపను లెల్లముఁ దీరిది యున్న వేళ రే ।
త్రిమ్మరి వంగడంపు యువతీమణి యూసుర సాఖ్య యూసను ।
పమ్మిన నున్న లేనువు పచ్చిక తన్మని హాయాను ధేనువ ।
త్సమ్ములకున్ ఘనంపు లెలసమ్మెసఁగన్ దినిపించుఁ జేతతోన్ ॥

చ॥ పరపగు నాకుటింటి పరిఁ బంచిటఁ బండిన గృహ్యాకంబులో ।
హరిణములన్ నిజాంఘ్రిసీమకు టావరిఁ జేర్చి నిషణ్ణయై సుధా ।
కరముఖి బెట్టునా మెతలు కాంతత్వ దీక్షణలక్ష్మికోడినిన్ ।
శరణముఁ జొచ్చె లేళ్లనుచు సంయమికన్యలు మేలమాడఁగన్ ॥

మ॥ పరగన్ గావ్యుఁడు మున్ను శిష్యులకుఁ జెప్పన్వింట చేనయ్యను ।
త్తర మేధావతి దైత్యకన్యస్వరితోదాత్తానుదాత్తాదులౌ ।
* స్వరముల్ దిద్దుచునుండు శ్రోతలకు నాశ్చర్యంబుగా నమ్మునీ ।
శ్వరు శైక్షుల పనసల్ రువించునపుడవ్వాక్యంబులన్ దప్పినన్ ॥

* స్వరముల్ దిద్దుచునుండుఁ గావ్యుని శైక్షుల్ వేదపాఠంబులన్ ।
పనసల్ రువ్వడు వెట్టుచున్న యపుడవ్వాక్యంబులం దప్పినన్ ॥

ఉ॥ సింధురయానుకారులయి చిత్రవచోర్ఝరముల్ చెలంగనా,
సింధురయానపాఠములు చెప్ప నలంకృతికావ్యనాటక,
గ్రంథముల త్తపోధనశిఖామణి శిష్యులకెల్ల వారుఁబు,
ష్పంధయవేణి యంత ప్రతిభావతియౌటకు విస్మయంపడన్ ॥

తరల॥ జగతిపై విహరించు పల్కులచానయే మొకదాయనన్,
సొగసుకత్తె విపంచిమీటుచు శ్రోతృకర్ణరసాయనం,
బగు మనోజ్ఞకలస్వనంబొలయంగ నచ్చటిబాసవాల్,
చిగురుఁబోండ్లకుఁ బాటపండువు సేయుఁదీరిక వేళలన్ ॥

క॥ ఈరీతిగ నారక్షో-
నారీతిలకము మునీంద్రునకుఁ దచ్ఛిష్యులతో,
వారికిఁ దలలో నాలుక,
యైరహివర్తిలుచుఁ గతిపయదినములుండెన్ ॥

వ॥ ఆసమయంబున ॥

సీ॥ త్రిభువనిమీఁద నెత్తిచనన్ బయనమైన స్మరసాంయుగీనుని శస్త్రిమార్గుఁ,
డభినవతారుణ్యయగువనలక్ష్మికి సముచితనైపథ్యసంవిధాత,
ప్రణయకోపప్రసభనిరుద్ధహృదయులౌ తెరువఁజంపతులకుఁ దాపికాఁడు
దీర్ఘకాలపు మూఁగతెగులు గొంట్లయియున్న కెంపుకంటులకుఁ జికిత్స
నగుచు నిశ్శేషమానుష్యకాంతరంగి, [కుండు,
కన్యభావకరాత్ముల్లకు ప్రవర్త,
మానసమాన్యజనీభవన్మలయమారు,
తుఁడగు నామని తేఁడు ప్రాదుర్భవించె ॥

ఉ॥ తారివసంతుఁడాన తిముదంబున నీఁజగు రాకు నిండిసీ,
కారులు వాడు పాటలెసఁగన్ బహుమానన టుంపు కానయన్,
చేరిజఁజూపటుల్ వొంగడఁదీవియ పాతరలన్ బ్రసూనభూ,
షారుచిరంబులన్ ననసంబ్బులనాడఁగఁజేసె నత్తలిన్ ॥

చ॥ అవసరధార్తరాష్ట్రుఁడు ద్రుమమావళిపార్శ్వదినిల్వఁబెట్టికో ।
టవినొనరించువ్రానికఁగడంగి దళాంశుకముల్ తొలంపమా ।
ధవుఁడతఁడర్మిలిన్ మగుడఁదాల్పనొసంగె వెసన్ వినూత్నప ।
ర్ణవసనకోటినచ్చటిఘనద్విజబృందము మోదమందఁగన్ ॥

క॥ విరిసెఁదఱచు గురవకములు ।
కురిసెన్ విరితేనెసోనకోనలలోనన్ ।
మురిసెన్ విల్లెక్కిడిమరు ।
డురిసెన్ దద్దయును విప్రయోగులమనముల్ ॥

వ॥ అట్టివసంతసమయంబున ॥

చ॥ చిలుకహుమాయిరావుతను శిక్షితశిల్పిచమద్వికీర్ణుఁడై ।
చెలువుటురంబునందినుపచీలలఁబఁగరుబొంగరమ్ములన్ ।
మెలపుననాటెనోయనఁగ మేచకచూచుకమంజులమ్ములై ।
వలిపపుపైఁటలోనఁ బిగివట్రువచన్గవ గానుపింపఁగన్ ॥ [దానిఁ।

సీ॥ తొల్లింటికంటెముద్దులుగులుకఁ జగదేకమోహనాకృతితోడఁ బొలుచు
బొడగన్నమువ్వేలుపులనైన వలవంతపాలుజేసి యలంపఁజాలుదాని ।
నయ్యైపనులువ్రాని యచటివారేగుట నొంటిపాటుగనింటనున్నదానిఁ ।
దలిరాకుదిండ్లకు త్తలపాటుఁదలకొల్పురమణీయకంఠస్వరమ్ముదానిఁ ।
గంధరాభిధానముసార్థకంబుగాగ ।
నెండుమోడులుఁ గ్రొన్ననలెత్తునట్లు ।
సరసశృంగారరసవృష్టిగురియఁగుతిక ।
యొప్పఁగీతముల్ పాడుచునున్నదాని ॥

క॥ ఆకస్మికముగఁగశ్యపుఁ ।
డాకేన్ దిలకించియాశయమున నలింపన్ ।
లేకయనన్యజశితనా ।
ళీకనిహతిబాధసంచలితమానసుఁడై ॥

సీ॥ జక్రవకవకజ్రసంబు పొందికగల్గఁ జేయక రొండబాపు చెడ్డతనము।
పౌర్ణమాసీశీతభానుబింబమునకుఁ జిహ్నంబుగల్గఁ జేసినజుగుప్స।
దొండపండునకు మాధుర్యంబుగల్గఁ జేయక చప్పదనముంచినట్టిరట్టు।
పదియాఱువన్నియబంగారమునలబ్ధసౌరభంబుగఁ జేయునేరమియును
బాపుకొనఁబద్మయోనియీపంకజాత।
దళవిలోచనారత్నము స్తనముఃఖౌష్ఠ।
గాత్రములనిట్లుకల్పించెఁగాకయిట్టి।
యద్భుతాకారరేఖలెంతైనఁగలవె॥

చ॥ చిదిపినఁబాలుగాఱు సరసీజదళేక్షణదళ్ళుఱ్చెక్కుల్।
సదమలలీలచే భువనజాతములన్ సరిచూడరాదవా।
పదయుగళంపురీవికి సెబాసవలగ్నసమానవస్తువున్।
వెదకుదమన్నఁదోఁచక దివిన్ దిలకించుచునుండఁగావలెన్॥

గీ॥ నెమ్మొగము వర్ణనముసేయ నెలయుగుంగ్ర।
శావలగ్నముపొగడఁ శూన్యాయనమగుఁ।
తత్ప్రవేణినుతింపనబ్దంబగుఁబద।
ములనుశ్లాఘింపఁదొరకొనఁబుపఱరమగు॥

సీ॥ ఉడుపుష్పవల్లుతనొప్పునీయెలనాగనఖరము లనువుదంతహసనంబు।
చక్రధరోపమజానొప్పునీయింతిబటువుచన్దోయియుఁగటియునారు।
సాగసశ్రీసదృశతమించునీచెల్వకనులుజానుగులు మొగమ్ముతళుకు।
మధుకరజాతోపమానతనొప్పారువచనములూరువుల్కచభరంబు।
చేతినేర్పుమెఱయసృజియించినాడుకాఁ।
బోలునీపొలంతిమేలుబంతి।
నబ్జభవునిఁబెద్దయన్నయ్యవీవటుం।
డుమనియొసరించి సుమశరుండు॥

సీ॥ తప్తకాంచనకపీతనపటీరమిళిందనీహారదీధితీందీవరములు।
తిలసూనకుందకుట్మలబంధుజీవకశష్కులీదర్పణశకలములును।
దరమృణాళాంబుజస్తబకకాలభుజంగవిష్ణుపదభ్రమిపీఠికలును।
సైకతకదళికాస్తంభతూణీరర్క్షకల్హారవటఫలకమఠములును।
బొంమపడఁగూర్చి యయ్యరవిందభవుఁడు।
తనవలంతితనంబెల్లఁ ధరణిబయలు।
పడఁగనీకన్నెమిన్న నేర్పరచెనేమొ।
కలరెయిట్టిరుసౌందర్యఖనులుమహిని॥

క॥ అజరాజనిమరణులన।
య్యజరాజకిరీటకైటభారులనైనన్।
గజరాజగమనయిదియం।
గజరాజదమోఘసాయకంబైయలఁచున్॥

శా॥ సారంగోపమనొప్పనీ రమణిరాజద్యానమేతత్సుమ।
ధ్యారోమావళిశంకరాభరణ సామ్యంబందునయ్యారెయీ।
నారీరత్నమునాభిపెంపు మృదుపున్నాగోపమంబీసువ।
ల్లీరుచ్యాంగ్రిప్రవేణియందము వరార్లీమీటుఁజింతింపఁగన్॥

గీ॥ సరససంగీతరూపనీసరసిజాత।
నయనఁగన్నారఁగన్నఁబన్నగవిహగమ్ము।
గంబులకునైన రాగంబుగలుగునిట్టి।
గానవిద్యానిధిని భూజగానఁగాన॥

మ॥ తలఁపన్ జిత్తమునన్ జతుర్దశజగత్తన్వంగ్యసాధారణం।
బులునత్రంబులునైన దీనిలలితంపుంగానమానోజ్ఞకం।
బులహంపూర్విక పూనికొన్నయవిగాఁబోలున్ బళీవిష్టపం।
బులనెల్లన్ దమశక్తివారిది వశంబుల్ జేసి రైకొంటకున్॥

ఆ॥ అనుచు మోహపిహ్వలాత్ముఁడై కశ్యప
తాపసేశ్వరుండు దానిసోయ
గమ్ముపొగడిపొగడి యమ్మగువను జేరఁ
బిలిచి యిట్లువలికెఁ బ్రీతిదనర ॥

ఉ॥ నీమువపుర్విలాసమును నీమసుదభ్రతరావలగ్నముల్
నీదరహాసవక్త్రమును నీబిగిశిబ్బెఁపుఁగబ్బిగుబ్బలుల్
నీమసలీలయానమును నీ-హొం యలుల్ దిలకింపఁజిల్కు బా
బాదొరకైనఁజిత్తధృతిపాయుఁగదే భువనైకసుందరీ ॥

సీ॥ అదితితోఁగూడితి నదితిన్నదనమున నీయంతవలపింప నేరదయ్యెఁ
దితిఁగూడినాడ నదితిరంపుఁగూరిమి నీయంతవలపింప నేరదయ్యె
మునియనునింతికాముని మున్ను యదియునునీయంత వలపింప నేరదయ్యెఁ
గద్రువు మోహనాకద్రువయ్యును నదినీయంతవలపింప నేరదయ్యె
నింతెగాక సురభియు సింహికయుఁదనువు
వినతయు ననాయువునుఁ గాలయును మొదలగు
కాంతలఁ బరిగ్రహించితిఁగానినన్ను
నింతవలపింప లేరైరియుంతిమిన్న ॥

క॥ అన్నులమిన్ననునిను నే
గన్నులఁగాంచినది యాదిగానుద్ధతుఁడై
కన్నులవిలుకాఁడవయత
నన్నులలినలంపఁజొచ్చె నలినదళాక్షీ ॥

సరసాంకవృత్తము॥ జగజెట్టిపూవిలుతుహింసకునోర్వఁజాలన్
బిగియారుకౌఁగిలికిసిబ్బెఁపుఁగబ్బిగుబ్బల్
జిగిమోవియానుటకు నిచ్చిరతోత్సవాప్తిన్
జిగురాకుబోఁడి సఫలేప్సితుఁజేయునన్నున్ ॥

చ॥ వలసిన నెట్టి మర్లభపువస్తువునైననునీకుఁ దెచ్చియీఁ ।
గలుగుచుఁగానఁ గాయలునుఁగడ్డలు మెక్కుచునుండఁబుట్టగోఁ ।
చులజడదారిఁగూడుమనె సుందరగాత్రినటంచు హాఁక్రియా ।
కలన నిరాకరింపకుము గంధమతంగజరాజగామినీ ॥

గీ॥ అనుచతఁడు వల్కుటయుఁదరహాసమువన ।
తాస్యమునకొకవింత చెన్నలవరింప ।
రమణి మందాక్షమందాక్షరమ్యమైన ।
మధురవాగ్గుంభనములఁ గర్మందికనియె ॥

క॥ అలవియగునె నిక్కువముగ ।
నలవియదలకునకునైన నామ్నాయాద్యా ।
ఖిలవిద్యానిలయపిచం ।
డులను నిరాకృతులఁజేయనుతమహిమనిధీ ॥

ఉ॥ మోదముమీఱఁగా నదరిముఖ్యలతోఁబహుదివ్యచంపకా ।
మోదలతోననేకయుగముల్ విహరించిసుతృప్తులైనమీ ।
కీనయతీయపైఁగరుణయిట్టిదిగల్గుట నేకజన్మసం ।
పాదితపుణ్యకర్మ పరిపాకముగాదె తపోధనాగ్రణీ ॥

శా॥ వాలాయంబయి నీయనుగ్రహము నిర్వ్యాజంబుగా నాపయిన్ ।
గ్రాలన్ సమ్మదమందియీకొనకత్వత్కారుణ్యసంప్రాప్తిల ।
క్ష్మీలాభోన్నతిదూరనై చెడుమనే శ్రీతానయే తేరమోఁ ।
కాలడ్డంబిడి త్రోదిపుచ్చుజడుఁడొకండేనియున్నే ధరన్ ॥

మ॥ శమవన్ముఖ్యభవత్పవిత్రతనుసంస్పర్శాగ్నిలోఁ గ్రాఁగియా ।
త్తమలశ్యామికవీడిశుద్ధనయిమీఁదన్ జాతరూపావతం ।
సమనై నిర్జరసుందరీమణులు రిష్టంబందఁదద్దేవతా ।
రమణీమాళిపదంబునన్ నిలువనే ప్రాక్షేడితాభిఖ్యతోన్ ॥

మ॥ హావతీర్థోత్తమయానదేవవరివస్యాగుప్తదానాదిక ।
ర్మవిశేషంబులఁబొందరానిపదముల్ బ్రాపింపఁగల్గుల్ గదా ।
భవదాకృత్యవలోకమాత్రములభింపన్ దర్శనాదేవసా ।
ధవయంచార్యులువల్కువాక్యముయథార్థంబౌనె యెనాటికిన్ ॥

ఉ॥ అట్టిమహానుభావతకు నాస్పదమై తనరారుచున్నమీ ।
యట్టితపోధనాగ్రణులకాదృతిపాత్రమునౌటఁజేసినా ।
చుట్టలకెల్లఁబూజ్యననుచున్ బలుకన్ ఘనమేపులోమజన్ ।
దొట్టిస్నుపాళిచేఁదగుపనుల్ గొనునత్తతనంబె చేకుఱున్ ॥

క॥ మిముఁదనుపుట యీయాత్రలో ।
క్యముఁదనుపుటకెక్కుడగుఁద్వదాజ్ఞకువ్యతిరే ।
కమునొడివితి నుభయలో ।
కములకు వెలియగుదునయ్య కారుణ్యనిధీ ॥

ఉ॥ కావుకఁగాయవాఙ్హృదయకర్మచతుష్టయమున్ ద్రవ్యవస్థలన్ ।
దేవరపావనాంఘ్రులయధీనము జేసితికాదె మున్నెయీ ।
దైవడి మత్సమాధిననఁగన్ వలెనే భవదీయచిత్తమో ।
దావహమౌవిధంబున సుఖానుభవంబొనరింపుఁడర్మిలిన్ ॥

గీ॥ స్వామి వెలయుచునొకవిజ్ఞాపనంబు ।
సేయఁదివురుచున్నది యీభుజిష్యయాగ్ర ।
హంబుసూపక యనుకంపనాదరించి ।
తన్మనోరథసంసిద్ధిసలఁపవలయు ॥

ఉ॥ కన్నియసుందరున్ దరుణుఁగాంతునిఁబెండిలియాడఁగోరుసం ।
పన్నునిఁగోరుఁ దల్లిప్రతిపన్నువిచక్షణుఁగోరుఁ దండ్రిప్రాం ।
చన్నుతవంశజాతుఁడగుసన్నరుఁబంధులుగోరుచుండ్రుప ।
క్వాన్నముగోరుచుండ్రితరులన్ననుడిన్ మదిలోఁదలంపుడీ ॥

వ॥ అనికృతాంజలియై సవినయంబుగాఁ బలుకుటయు ॥

చ॥ అమలినగాత్రి నీమహృదయస్థితమున్ గనుఁగొంటి నింతమా ।
త్రమునకు నింతశంక గదురన్ వలెనే యిదె చూడు నీమది ।
త్తమునకు మెప్పువుట్టెడువిధంబున నిన్నలరింది వాంఛితా ।
ర్థములొనగూర్పఁజాలుముని దభ్రతపోమహిమంబు పెంపునన్ ॥

అనిపలికి॥ క॥ అక్షిమీలన మొనరింప నాజ్ఞ యొసఁగి ।
తనకమండలువునను న్నఘనరసమునఁ ।
దోయజేక్షణకనుదోయిఁ దుడిచి చూడ ।
వచ్చుననియాతఁ డానతియిచ్చుటయును ॥

చ॥ చలువలఱేఁడునున్ గుసుమసాయకుఁడున్ ధనదాత్మజాతుఁడున్ ।
బలరిపుసూనుఁడున్ సొబగుపట్టునఁ గొప్పమతాబు క్రిందిది ।
వ్వెలవలె హీనకాంతులయి వెవ్వెలబోఁ దగియున్నయప్పుతో ।
జ్వలమహనీయమూర్తిని నిశాచరసుందరి చూచె ముందటన్ ॥

క॥ కనియమ్మునిశక్తికి మన ।
మునఁ నింతింతయన రాని మోదము నత్రం ।
బునుఁ గమరత్ర మొకెరఁ నతనికిఁ ।
గనుఁగవ వానందబాష్పకణములు తొరుఁగన్ ॥

ఆ॥ ఆతరుణీలలామ మును నాజటిలోకవతంసమున్ స్వసం ।
కేతిత దేశకాలములఁ గేవలకామసుఖానురక్తులై ।
రాతురు లెల్లనింపలర రమ్యములైన విహారభూములన్ ।
నూతననూత్నరీతుల మనోభవలీలలఁ దేలిరిద్దఱున్ ॥

క॥ ఈతీరునఁ గణరాత్రము ।
లీతంబగుటయును నొక్కదివసంబున నా ।
శాతోదరి తెలఁగా రసి ।
పూతచరిత్రుం డమానిపుంగవుఁ డనియెన్

ఉ॥ కన్యవకానవిన్గుటిఁచి కామవికారమునాకుఁగల్గెఁగా ।
కన్యవధూటి వేనినిను నాదృతిఁగన్గవయెత్తిచూతు నే ।
జన్యతలాంతకత్రయము సత్యపరాక్రమనిర్జితారిరా ।
జన్యము నాటకోపుతనుజత్రయమున్నది నీదుకడ్పునన్ ॥

చ॥ వియదవలగ్న నీజనకువీటికిఁబొమ్మికనందువత్సర ।
త్రయముగతించినంతటను దారబలాఢ్యమునీకునాత్మజ ।
త్రయముజనించువారలకతంబునఁద్వజ్జనకాదిదైత్యసం ।
చయమునకాపదల్ తొలఁగు శంకరదేవుననుగ్రహంబునన్ ॥

క॥ వారలలో మధ్యముదు ।
ర్వారపరాక్రమముచేఁబరాజితులై శ్రీ ।
నారాయణాదులసురులు ।
గౌరీశ్వరునాశ్రయింపఁగలరతిభక్తిన్ ॥

ఉ॥ ఆపరమేశు తేజమున నచ్యుతవజ్రధరాదిరక్షకృ ।
త్యాపటువిక్రముండొకమహాపురుషుండుదయించిసర్వలో ।
కాపకృతివ్రతాచరణమందవకీర్ణితలేనిదైత్యులన్ ।
రూపడఁగించినీసుతులఁద్రుంచు భయానకసంగరస్థలిన్ ॥

గీ॥ సుతులయాచైవ్యర్దశనె నీవుచూతుగాని ।
వాండ్రముగియుకచూతువు వారిజాక్షి ।
కడదిదేవరహస్యంబుగానఁదాని ।
దెలుపవలదెంత ప్రాణతుల్యులకునైన ॥

క॥ నావుడు నానుడివినిరా ।
జీవాయతనేత్రితనదుచిత్తంబునయం ।
దావహిలమోదఖేదము ।
లావాచంయమునకప్పుడనెఁ బ్రాంజలియై ॥

చ॥ పరమమునీంద్ర నీదయకుఁ బాత్రమునయ్యెడు భాగ్యమబ్బుటన్ ।
దిరమనుకొంటి నీప్రియత దివ్యపదంబుల చెంతనుండి ని ।
ష్ఠురుణము దైవమిట్లు చిరకాలములోనె భవత్పదద్వయీ ।
విరహము కల్గఁజేసి వెత వెట్టుటెఱుంగక పోతినక్కటా ॥ [తు నెట్లు ।
సీ॥ అమృతోపమములు హవ్యములు పాపమునోటఁ జెమునల్లనంజుడుల్ కుడు
వేదాంతమర్మముల్ వినుచుండు చెవులతో వెకలిరక్కసినుడుల్ విందు
[నెట్లు ।
దేవరమహిమము ల్తిలకించు కనుల నిష్ఠురదైత్యకృత్యముల్ చూతు నెట్లు ।
మేధ్యర్షి నాటిలో మెలఁగు నెమ్మనితో మఱులుచసోఁకులపొంత నిలుతు
దనుజునకె పుట్టి పెరిఁగిన దాననయ్యు । [నెట్లు ।
నేవమైతోఁచుచున్నది యిపుడు నాకు ।
నస్రుషులతోడి పొత్తు మీయడుగులకడ ।
నుండుటకనుగ్రహింప వేయోమహాత్మ ॥
క॥ నావిని నీకును నాకును ।
దైవవిహితఘటనమింతదనుక నె యీప్పై ।
నీవొక నిమిషంబునునిక ।
నీవాటికనుండవలవ దేగుము తరుణీ ॥
క॥ నాయానమాటువలక్కు ।
మీయనివారిచ్చుటయు మునీంద్రుఁడలుగునే ।
మోయనియేమియుననలే ।
కాయుగ్మలియుండెఁ గదలకాలేఖ్యమొనాన్ ॥
ఉ॥ బమ్మెరనోయియిట్లు కులపాలికయా సురసాఖ్యయత్రుటెన్ ।
సొమ్మకునగ్గమై తెలివిచొప్పడ దెప్పిరివంత పెల్లిదం ।
బిమ్మకొనక మదిన్ దబిసి యింతుల చెంతకు వేగి కశ్యపుల్ ।
పొమ్మనిరింక మిమ్మెడసి పోవలసెన్ దయయుంచుఁడాత్మలన్ ॥

చ॥ ఎఱుఁగకయో యెఱింగియొ యేనొనరించిన తప్పులుండినన్ ।
మఱది యనుగ్రహింపుఁడు సమస్తజనస్తవనీయలారమీ ।
చిఱుత లెవేని నేరములు చేసిన సైతురకాదె నన్నెదన్ ।
మఱవకుఁడమ్మ మీకివె నమస్కృతులేనికఁబోయివచ్చెదన్ ॥

క॥ అనవుడుఁ దపోధననితం
బినులెల్లరు మిన్నువిఱిగి మీఁదఁబడినచా ।
డ్పున వెత పెల్లునఁబొగులుచు ।
నని రాపొలదిండి తేలి యనుఁగుతనయకున్ ॥

ఉ॥ అక్కట యెంతమాట వినవయ్యె నిదెంతటిదుర్దినంబొకో ।
తెక్కరపుంబిడారతెక తేరనుమల్ కదియింప వెన్నఁడున్ ।
రక్కసిచూలి వెట్లయితొ ప్రాణసమానను నిన్నుఁ బాసి మే ।
మెక్కరణిన్ భరింతుమిక నెట్లునయింతుము భావికాలమున్ ॥

సీ॥ ముద్దైనసారములోఁ బద్దెముల్ చదివియే చెలియయర్థములికఁ జెప్పునమ్మ ।
పలురకంబులశిల్పములు చేసి యింక నేచేడె వినోదింపఁ జేయునమ్మ ।
వీణ చేకొని మేళవించి యెవ్వతె శ్రోత్రపర్వంబుగా నికఁ బాడునమ్మ ।
బహువిధంబులవింత భక్ష్యముల్ చేసియే వెలఁదుకయిక విందు వెట్టునమ్మ
పుట్టిబుద్ధియెఱింగి యెప్పుడు నెఱుఁగని ।
బవిసి మూఁడు నాళ్ళనుభవింపనొనగూర్చి ।
యావదసుధారణంబుగా నతులుఁ జిచ్చు ।
దరికొలిపిపోవుచుంటివే తల్లిమాకు ॥

క॥ నీగుణరత్నసమృద్ధియు ।
నీగానబును నీమపనుల నేర్పరితనమున్ ।
నీగానవైదుష్యము నే ।
ఆఁగు మఱచిపోదుమమ్మ లావణ్యనిధీ ॥

సీ॥ ఈవేదభాష్యంబవేక్షించినప్పుడైన లలననన్నెదలో దలంతువేమొ।
యీసాంకవమువాడఁదీసినయప్పుడైన నింతిరోనన్నుస్మరింతువేమొ।
నాతియీసాంగాజినముఁజూచినపుడేనియునునన్నుఁ దలఁపున నుంతు
[వేమొ।
యీగండపాడియుపయోగించునప్పుడైన వనితజ్ఞప్తికినేను వత్తునేమొ।
యంచుఁదమకున్నవానిలో మంచివియగు।
వస్తువులనేరియిచ్చి యవ్వనితలామె।
గ్రుచ్చికౌఁగిళ్ళఁగదియిందిగ్రుడ్లనీళ్లు।
గ్రుక్కుకొనుచెట్టకేనిపీడ్కొలిపిరపుడు॥

సీ॥ కాకయూర్పులచేసొగసువడ్డమోవితోఁగడువిన్ననైనమొగంబుతోడ।
గొలకులనశ్రువుల్కురియుకన్దోయితోవడఁకుచేఁదడవాడునడకతోడ।
మేననెల్లెడలఁగ్రమ్మినగుర్పాటుతో నూఁగాడుపేదకౌఁదీఁగతోడ।
వనటచేఁగలగుండువడిన డెందంబుతో మునుపటివలెలేనితనువుతోడ।
వచ్చియాపారికాంక్షిప్రవరునకుఁబ్ర
దక్షిణమొనర్చి సాష్టాంగదండవత్ప్ర।
ణతులుగావించి యాతఁడానతియొసంగఁ।
బయనమైపోయె ఋషివాటిఁబాసిసురస॥

వ॥ అనిసూతుండుచెప్పినఁదరువాతివృత్తాంతంబేమని మునులడుగుటయు॥

* తోటకవృత్తము *

కమలాసనసన్నుతకామహరా।
విమలాశయరక్షక విష్ణుశరా।
యమవజ్జనసేవిత యద్రిచరా।
హిమవత్తనయాధవ కృత్తిధరా॥

* మందారమాలావృత్తం *

సౌవర్ణశైలోల్లసత్తుంగచాపా ।
వైవస్వతాంభోదవాయుప్రతాపా ।
కైవల్యసంధాతృ కల్యాంఘ్రిదేశా ।
శ్రీవారణాశీపురీసన్నివేశా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాధశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు ద్వితీయా
శ్వాసము.

———:0:———



శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీపరిబృఢకమలాసన ।
గోపాలముఖాదిదేయకోటీరమణీ ।
దీపితపదపంకజకా ।
శ్రీపుటభేదననివేశ శ్రీవిశ్వేశా ॥

వ॥ అవధరింపుము శౌనకాదిమహర్షులకు రోమహర్షణప్రసూతుండగు సూతుండిట్లని చెప్పందొడంగె ॥

ఉ॥ ఆరమణీవతంసము నిజాళులతోడుత మున్నుచన్నయా ।
దారినపోయిపోయి తనతండ్రిపురిన్ దఱియంగఁ బ్రోలికీ ।
లారులువారిఁగాంచి యవిలంబితయానములొప్ప నేగి తే ।
వారికిఁ మ్రొక్కి నిల్చి సుతయాగమనంబెఱిఁగించినంతటన్ ॥

మ॥ ప్రతిఘస్రంబున నేకసైరిభతుభోరభ్రాదికప్రాణభృ ।
త్తతిభూయిష్ఠతరాస్రమాంసముల చేతంగాని పూరింపరా ।
నితమిస్రాచరుపీవరోదరమునన్ హృద్యాత్మజాస్వాగత ।
శ్రుతిజంబైన మహాప్రమోదమిముడన్ జోటబ్బదయ్యెన్ బళీ ॥

గీ॥ ఇట్లు నిర్భరసంమోదమెసకమెసఁగ ।
నర్హసత్కృతిసందేశహరులఁదన్పి ।

కొలువుచాలించి దైతేయకుంజరుఁడవ్వు ।
ఢొకఁ యుత్తమాజానేయమెక్కి వెడలె ॥

చ॥ స్ఫిరపరిణాహమైన పుటభేదనమెల్లనలంకరింపఁగిం ।
కవులకు నాజ్ఞయిచ్చి శిబికల్ తగఁగొన్నిటివెంటఁగొంచును ।
త్వరగమనంబుగానరిగె వల్లవబాలకదగ్ధ్యమానమా ।
తెరువుననాత్మజాముఖదిదృక్షుయనన్యదిదృక్షుఁజేయఁగన్ ॥

చ॥ తనకెదురేగుదెంచు క్షణదాచరవల్లభుఁడవ్వదవ్వులన్ ।
గని హృదయంబునందధిక కౌతుకముం బెనువానయుం బెనం ।
గొనఁగమనంబు దొట్రువడఁగుందితచారుముఖారవిందయై ।
జనకునిచెంతకేగి భువిఁజాఁగిలిమ్రొక్కె మహావినీతతన్ ॥

* పంచచామరము *

రయంబునం హయంబుడిగ్గి క్రవ్యభుగ్వరేణ్యుఁడా ।
ప్రియాత్మజాతఁ గ్రుచ్చియెత్తి బిగ్గకౌఁగిలించిన ।
క్షియందుఁగూరుచుండఁబెట్టి దీర్ఘకేశపాశముం ।
శయంబునం నిమురుచుం మసారవేణికిట్లనుం ॥

* మత్తకోకిల *

జంటలేకకుతోభయుండును జంటకోవనిచొట్లకుం ।
గంటుచాశ్వన నిన్నుసీమలుకానిసీమలకంపివా ।
కొంటకుం గరుపాటుకూరుచు గొడుసీకొదవించియు ।
ట్లింటపాయిగనుంటిఁగుల్కుచు నేను నీకొకతండ్రినే ॥

ఉ॥ శత్రులచేతఁజిక్కి యరసచ్చిననైపడినున్ననన్నుఁదా ।
మిత్రులనిచ్చి మార్తురఁజయింపఁగఁజేసి పునస్సుఖాప్తికిం ।
బాత్రునిఁజేయఁజాలితివిసెబా సఖిలస్తవనీయ నీవుమ ।
త్పాత్రికె మత్కృతప్రతనపుణ్యఫలంబవు గాక యాయం ॥

ఉ॥ ఉత్తమవంశజాతలు నియోజ్యలు పెక్కురుకన్నుసన్నలన్ ।
జిత్తమెఱింగియేమఱక సేయుపనుల్ గొనుదానవీవుజా ।
ర్గత్తమొకింతదప్పకలకక్ష్యపమున్కరిచెంతఁదన్మనో ।
వృత్తియెఱింగి సేవయొనరింపుచు నాకయియెంత నొచ్చితో ॥

సీ॥ తెలియంచమూదిపాన్పులఁబండు నీవుత్త నేలఁబండుట కెంత నెగులువ [డితో ।
నేరాజువల్వలూ నెడునీవు నారచీరలుకట్టుటకు నెంతతలరినావో ।
వరమణిప్రాసాదవాసినివీవాకుటింటనుండుట కెంత యేవపడితో ।
రాజార్హభోజ్యముల్ ప్రాశించు నీవాకలములు మెక్కుట కెంతకుమిలి [నావో
యకట టాభాగ్యహీనుఁడనైననాము ।
గర్భమందుఁజనించినకతననతివ ।
లెందునేనాఁడునుం బొందియెఱుఁగనికడ ।
గండ్లువడి పెద్దనొచ్చితికదవెతల్లి ॥

వ॥ అనిననాసురస సురసపత్నినకిట్లనియె ॥

ఆ॥ తండ్రియెడఁడఁబెడఁదఁదలఁగలేనియపత్య ।
మున్న నేమి లేకయున్న నేమి ।
పితృహితులుసుతులు పిండతాస్థితియందె ।
డిగ్గఁబడుటచాలలగ్గుగాదె ॥

ఉ॥ స్త్రీలు నిసర్గభీరులనిచెప్పుటసత్యమె కానఁదండ్రినే ।
జాలవియాఱనయ్యొ నటఁజల్పిననాదుస్వతంత్రవృత్తికిన్ ।
హేళనపాత్రమామనని యెంతయుసిబ్బితినొందుచుండితిన్ ।
బ్రోలుసొరన్ స్వబంధుజనమున్ దిలకింపనుగూడనో డెదన్ ॥

క॥ నగరమునఁజొచ్చినలువురి ।
మొగములు నే నెవ్విధమునఁబొడగాంతునటం ।

చగధీరనామనంబున ।
వగపెద్దయుఁగలిగెఁదుర్నివారంబగుచున్ ॥

ఉ॥ నావుడు వాతఁడిట్లనియె నాయనుఁగుంబసి వెట్టికూనవీ ।
కీవెడఁగుందలంపుమది నేటికిఁబుట్టినదమ్మదైత్యలో ।
కావనకర్త్రివౌనినుఁజయధ్వనులొప్పవరప్రదాత్రివౌ ।
దేవతగాఁదలంచుచునుతింపరెనైగములెల్లనెల్లెడన్ ॥

క॥ పొరబడితికాకయస్మ ।
త్పురివారలలోన నోలముననైననిన్ ।
బరిహాసోక్తులుప్రేలెడు ।
వరాకులుఁడమినిజమ్ము వగవకువ్యథగాన్ ॥

చ॥ అమృతమయూఖశేఖరమహాత్మునిఁ గశ్యపుఁగొల్చితత్ప్రసా ।
దమహితభాగ్యముంబడసితద్దయుఁదైన్యదశానుభూతిక ।
గ్గమయినదానవాన్వయముఁగాచుటకై పనిబూనిపుట్టెనీ ।
యమయవతారమూర్తియనియందఱునందురువింమముందటన్ ॥

క॥ ఎక్కెనదె ప్రొద్దుచాలఁగ ।
మ్రొక్కుమునీయిష్టదైవమునకు నెలమితో ।
నెక్కుమిదె కనకశిబికను ।
తక్కుమికను లేనిపోని తలఁకుమనమునన్ ॥

వ॥ అనియనేకవిధంబుల ననూనయించి తనూజాప్రియవయస్యల నుచితయాప్యయానంబులనధిరోహింపంజేయించి తనయనుంగుతనయనో కయనర్ఘకనకమయపల్యంకికనధిరోహింపంజేసి తానును వినీతంబునెక్కి యర్హవైభవంబుతో నగరంబునకుంజని యారాజన్యకన్యాతిలకంబునుస ముచితప్రకారంబుననంతఃపురప్రవేశంబు సేయించి సుఖంబుండునంత ॥

క॥ పొలదిండికొలమునంగల ।
తలిరాకుంబోండ్లకెల్లఁదలకట్టగున ।

న్నెలఁతుకకుఁగర్భచిహ్నం।
బులుక్రమముగనపుడువ్యక్తములుకాఁదొడఁగెన్ ॥

చ॥ అనుదినముష్ణభానుఁడుదయంబునఁదోఁచకమున్ననిద్రమే ।
ల్కొనిరదధావనాదివిధులన్ క్రమమొప్పఁగఁదీర్చిగ్రంధముల్ ।
పనిగొనిచూచుచుండు శుభలక్షణప్రౌఢ్ఢోకకాంతయొక్కఁడాఁ ।
కనిదురనుండిమేల్కొనమ గర్భభరాలసయాకతంబునన్ ॥

క॥ మునుపెన్నఁడుఁ బద్దకమనఁ ।
గనెట్టిదోయెఱుంగనట్టికాంతామణికిన్ ।
బనులయెడమునువటిచుఱుకు ।
తనమంతయుఁదగ్గిచుండితనమాపుపొదవెన్ ॥

ఆ॥ స్వాదుతరపదార్థజాతంబు నేనియు ।
వ్రేలఁగొంతదీసి నాలుకపయి ।
రాదిచూచి పనికిరారువంటకుపీంద్ర ।
టంచుఁ గసరుచుండు నాంధసికుల ॥

గీ॥ తఱచు చిట్టుములో కిలింతలునుఁగలిగె ।
గమనమతిదీర్ఘసూత్రతాకలితమయ్యె।
సురభిమృత్స్నాజిఘత్సయుఁగరముహెచ్చె ।
వనజనయనకుఁదౌహృదావసరమందు ॥

క॥ ఆచక్షురుత్సవకరా ।
సేచనకాకృతికిరకసి నెలంతుకకున్ ।
మేచకములైతనర్చెను ।
చూచుకములుచనులోకింతస్థూలములయ్యెన్ ॥

క॥ ఊమియుట ప్రాయికమయ్యెన్ ,
రమణీయానూనసహజరక్తిమమగునా ।

రమణీమణివాతెఱకం ।
దమయినపాటలగుణంబొందవె నయ్యాదనన్ ॥

గీ॥ ఒప్పుగానాభివివరంబునుండి వెడలి ।
చక్కఁగాబారుతీరిచిచనుచునున్న ।
నల్లచీమలచాల్పొయనంగఁజెల్వ ।
మెసఁగునూఁగారుమెలఁతుకకేరుపడియె ॥

చ॥ తఱులఁజిరాత్మ్నవర్ణ్ణకలితంబులరూపడఁగించెమున్నుపే ।
దటిమినయుండియుండియమితద్రవిణంబిపుడబ్బినందునన్ ।
దెఱవవిలగ్నమాత్రజగతిన్ నడుమంతరమందుఁగల్మిచే ।
కుటిలతటారియుల్లెయిరుగుంబొరుగుంజెడఁజూచెడుంగడా ॥

వ॥ ఇట్లు నిర్భరగర్భభరాలసయగు నాసురసకు సురసపత్నుండు తత్తదుచితావసరంబుల వృద్ధానుమతంబునఁ బుంసవనసీమంతాది శుభకృత్యంబులు మహామహంబున నెఱపి దౌహిత్రోదయంబునకుఁబ్రతీక్షించి యున్నంతవత్సరత్రయంబుపూర్ణంబై వైజననంబువచ్చె నంతనసురేంద్రాదేశంబున ॥

చ॥ క్రొత్తమెఱుంగుసున్నమునఁ గోడలకంతట వెల్లవైచిమే ।
ల్చిత్తరువుల్ పటంబులును శ్రేణులుదీరిచియుత్తమంబులౌ ।
నత్తరులన్నియున్ గలిపియంతటఁజక్కఁగనల్కస్వచ్ఛమౌ ।
ముత్తెపుమ్రుగ్గు వెట్టిననబోండ్లలరించిరరిష్టమంతయున్ ॥

క॥ ఆరాజధానిలోఁగల ।
వారెల్లఁదదీయవైభవముఁగన్గొనియా ।
సౌరభమునకునుబ్రేఁపు ।
సౌరునకును వెఱఁగుఁజెందసాఁగిరిపౌరుల్ ॥

క॥ పురిటికివలయుపదార్థో ।
త్కరములలోనొకటియైనఁగడమపడియెనీ ।

నరకనరాకుండఁగనుర ।
పరిపంథియనుజ్ఞసిద్ధపరచిరిలెంకల్ ॥

గీ॥ ఇట్టులన్నియుసమకూర్చియింపుమీఱ ।
నెల్లవారలునున్నఁగొన్నాళ్ళుచనుడు ।
నొకశుభవాసరంబుననుదయవేళఁ ।
బ్రసవమృద్వీకినొవ్వులారంభమయ్యె ॥

క॥ ఆమేలిమాటవినిపుర ।
కామినులందొక తెరైనఁగడమవడకయా ।
చామనుచూడఁజనిరిసు ।
త్రామారినిలయము యానవతమయముగాగన్ ॥

సీ॥ సంబాధమునకిది సమయంబుగాదని క్షుద్రజాతులవెళ్ళగొట్టువారు ।
నల్లరిచేయువారరుగుఁడిచ్చటనుండవలదని కోపించిపలుకువారు ।
నిటనుండరాదుపొండిండ్లకునని పురుషార్భకులనుసాఁగనంపువారు ।
సందడినెవరేమిచల్లఁగాఁగాఁజేయఁగలరొక్కొయనిదార్లగాచువారు,
నగుచునతిజాగరూకమైయలఘుకృత్యా ।
నిర్వహణదక్షమైనట్టి పూర్వదైవ ।
తేంద్రశుద్ధాంతజనముమేనెల్లశ్రుతిద్రు ।
గుక్తిశయముల్లైవ గ్రిల్లుచుండెనపుడు ॥

శా॥ అమ్మాయింకనిమేషమోర్చికొను జాతాపత్యవైచాలసా ।
ఖ్యమ్మొప్పన్ శయనింపఁగాఁగలవు మావ్యాపారముల్ నమ్మనీ ।
విమ్మాడ్కిన్ మగవారలెల్లవినఁగానేడ్వంగరాదామన ।
స్వమ్మెల్లన్ గడచెన్ సుఖప్రసవమా దాలస్యమేలేదికన్ ॥

మ॥ అనిమోదార్చుచుఁ బహ్వపత్యలుప్రసూత్యాభీలమందారితీ ।
రినసద్వృద్ధచిరంటులంతికధరిత్రిన్ జేరికూర్చుండిసా ।

నునయోక్తుల్ వచియింపుచున్ నడుమ నెన్నోకష్టవిస్మారణం।
బునకై మోదకరంబులైనచరితంబుల్ చెప్పుచున్నంతటన్ ॥

ఆ॥ పడఁతుకు వెడలివచ్చె వెడఁదవామెకముల।
కొలముగండుకొదమచెలువుజూపు।
చప్పుడుదితుఁడయ్యె నభిరామభీషణ।
మూర్తియగుచు నగ్రపుత్రకుండు ॥

క॥ కంచముఁగొనిగణగణమ్రో।
యించుచుఁగలినీళ్ళుచల్లివృద్ధాచార।
ప్రాంచితవిధానములునడి।
పించిరితత్రత్యలైన పెద్దముదుసళుల్ ॥

మ॥ లతికావిగ్రహకాపెకున్ గ్రహములెల్లన్ మంగళస్థానసు।
స్థితినొప్పారెదుభవ్యలగ్నమునఁద్వైతీయీకుఁడౌపుత్రుఁడం।
చిత్రసౌందర్యవిశేషసంహననరోచిస్స్మారితోద్యత్త్విషాం।
పతివుట్టెన్ పొలదిండులెల్లరును సేబాసంచునగ్గింపఁగన్ ॥

క॥ అంతమతికొంతసేపటి।
కింతటితోఁదీఱెనాక్యహితులకు నెల్లన్।
వంతలనిపొరులెల్లరు।
సంతసపడఁజరమపుత్రసంభవమయ్యెన్ ॥

ఆ॥ పెకుౕలకుకష్టఁపుఁబురుళ్ళుచకౕగనెఱ।
వేర్చియటమంతుగన్నసావికయొకర్తు।
నాభిలవనాదికములువిన్నను వెలర్ప।
నెరపిపురుడులువోసెనాని సుఁగుతిగకు ॥

క॥ శయనత్రితయమున స్తవం।
ధయతతియము సౌఖ్యశాయితంబయిజ్వాలన।

త్రయమోయననిజదీప్త్యతి।
శయమునఁదేజరిలెఁబౌరజనముప్పొంగన్॥ [కతె।
సీ॥ జీర్ణపాదుకజక్కఁజెవికిఁద్వారోపాంతమునవ్రేలఁగట్టించె ముగుదయొ
పురిటిగీమునఁగాలిసొరరాదటంచు వాతాయనారరములు మూయునొ
[కతె।
కూర్చుండిబాఁపనికూఁతురుమాలని పెండ్లా మనుచనులపించునొకతె।
కుడుపైనతరువాతఁగూరకుండఁబగళ్ళు కతలఁబ్రొద్దులుపుచ్చఁజతు
జొత్తుపాపలు ముగురికిఁదత్తదవస। [రయొకతె।
రములఁగావింపవలసినరక్షణములు।
లెస్సబోధించుచుండఁబలిక్నియొకతె।
దితిజసుతకుఁజాతాశౌచదినములందు।
క॥ వారలయుదయమువంశపు।
వారికెతత్త్వాదృశోత్సవప్రదమైయొ।
ప్పారనసురేంద్రుప్రీతికి।
మేరయె లేదనవిశేషమేతలపోయన్॥
ఉ॥ అయ్యసురేంద్రుఁడప్రతిమహర్షయుతుండయిరాజభోగపుం।
బియ్యఁపుఁగూడుపచ్చడులుబెక్కులుకూరలునూరుగాయలున్।
దియ్యనిపిండివంటలును దీనజనాళికి వేనవేలకున్।
వియ్యపువారికిన్వలెనె వెయ్యముమీఱఁగఁబెట్టెఁదృప్తిగాన్॥
క॥ పేదలకుషడ్రసోపే।
తౌదనములునంశుకములునొసఁగికృతులకున్।
సాదులకుషోడశమహా।
ప్రాదేశనములొనరించెఁబ్రమదభరమునన్॥
ఉ॥ దానవరాణ్ణిదేశమునఁదాసులుతద్ద్రపసూతికృత్యనూ।
ద్ధానలుజాగరూకలయితద్దితిజార్భకతల్లజత్రయిన్।

మానవతిన్ లవంబునుఁబ్రమత్తతనొందక స్వాపలేపముల్ ।
మానితమిశ్రలన్ దివములన్ సరినాగయుచుండిరత్తఱిన్ ॥

శా॥ చేతశ్శీమలఁజోటుచాలమిమదోత్సేధంబొగిన్ బాహ్యాని ।
ర్యాతంబై విరబారెమేననసహీరాలంక్రియామాల్యసు ।
శ్వేతాచ్ఛాదనశేఖరాదిధరులై వీటన్ జనుల్వర్తిలన్ ।
జాతాశౌచదినంబులెల్లఁగడచెన్ శౌతంబశౌతంబుగాన్ ॥

గీ॥ అప్పుడసురేంద్రుఁడత్యంతహర్షమాణుఁ ।
డైయనపదేశగాథభక్త్యన్వితముగ ।
బహునమస్క్రియలొనరించి భార్గవుంద ।
లంచెమనమున నట్లుతలంచుటయును ॥ [నెఱిఁగి ।

సీ॥ పొలదిండిరాయఁడప్పుడుదన్నురాదలంచుటకుంగతము తెల్విచూడిక్
పయనంబువినిశతపర్వవందురఁదడవుండనచ్చటననియాఱడించి ।
పదివాళ్ళకుంజాలుపాఠముల్ గట్టిగానొకమాఱెమెల్లశిష్యులకుఁజెప్పి
యగ్నికార్యాదికృత్యములు శండామర్కులనుతనూజాతులకప్పగించి,
వత్తునీవెంటననికట్టువల్వకొంగు ।
వట్టుకొనికాళ్ళకడ్డమువడినదిఱుత ।
కొమరితనుదేవయానను కుస్తరించి ।
సోఁకుడులరాచవీటికి శుక్రుఁడరిగె ॥

మత్తకోకిల॥ వొగవిప్రవరుండు కావ్యుఁడు వ్యోమయానముచేతన ।
ల్లేగుదెంచుటెఱింగి యయ్యసురేంద్రుఁడచలభక్తియై ।
జాగుసేయకలేచి పాద్యమొసంగియర్ఘ్యమునిచ్చియ ।
ప్డాగురూత్తముపాదయుగ్మమునందొనర్చెఁబ్రణామముల్ ॥

క॥ దేశికునిచేతఁబదవడి ।
యాశీర్వాదంబులంది యాదైతేయా ।

ధీశుఁడుతగుగద్దియనుప ।
వేశింపఁజేసి యనియె వినయంబెనయన్ ॥

చ॥ నిరుపమదివ్యబోధమహనీయయదీయగృహోత్తమంబుత్వ ।
చ్చరణసరోరుహద్వయరజఃకణమండితమౌనొయమ్మహా ।
పురుషునిదివ్యమందిరమెపోధరణీతలవైజయంతము ।
ప్పురుషుఁడెవిష్టపత్రితయపూజ్యుఁడు మాటలు వేయునేటికిన్ ॥

ఉ॥ అంతకహంతృపుణ్యచరణాంబుజమత్తమధువ్రతాయిత ।
స్వాంతభవాదృశుండు గురువర్యుఁడుగల్గినమాకునారయన్ ।
వింతయెభద్రలాభములు వీరలెసుమ్ముభవత్ప్రసాదరూ ।
పాంతరభూతులై నసురసాత్మభవుల్ ఘనబోధశేవధీ ॥

మ॥ అనుచున్ జొత్తునిసుంగులన్ మువురనెయ్యంబొప్పఁదెప్పించియ ।
ద్దనుజాచార్యునిపాదపద్మములమీఁదన్ వైచినన్ జూచియు ।
మ్మునిశార్దూలుఁడునెత్తియాస్తనపుల్ ముద్దాడిదీవించెనిం ।
పునదైత్యేంద్రుఁడు వేఁడె నామకరణంబుల్ వారికిన్ జేయఁగన్ ।

వ॥ అప్పుడొకశుభముహూర్తంబున ॥

ఉ॥ పండితలోకమండనుఁడు భార్గవుఁడాద్యునకుంచె శూరప ।
ద్మండను పేరు రక్కసులమొత్తముతద్దయు మోదమందఁగన్ ।
రెండవవానికాఖ్యయొనరించెను తారకుఁడంచు సింహవ ।
క్త్రుండను పేరువెట్టెఁగడగొట్టునిసుంగునకెల్లరౌననన్ ॥

గీ॥ ఇట్లు వారలకున్ బేరు లేరుపరచి ।
దితిసుతాధీశ్వరుండుప్రార్థింపఁగొన్న ।
నాళ్ళతద్దైత్యపుటభేదనమునునుండి ।
భార్గవుండేగె నూఢార్థభార్గవుండు ॥

చ॥ అమలినతారకాగణసమన్వితమై తనరారుశుక్లప ।
క్షమున సుధాంశుచందమునఁ గ్లానియొకింతయు లేక వాసర ।
క్రమమునవర్ధమానులయి కార్శ్యపులమ్మ గురుల్ సురద్విష ।
త్సముదయదృక్చకోరకతుషారకరాయితహారిమూర్తులై ॥

క॥ అల్లారుముద్దుగావ ।
ర్ధిల్లుచుఁ గ్రియమాణమ్మనురుదితులై పలభుక్ ।
తల్లజునిహృదయమెంతయుఁ ।
జల్లఁబడన్ బ్రాఁకుచుండ్రు చత్వరములలోన్ ॥

మ॥ కరతాళమ్ములుసల్పి రమ్మనెడుసైగన్ జేతులందీయనం ।
కురితద్విత్రిపదంబులుల్బణములై గోమొప్పగానవ్వుచున్ ।
మురుగుల్ దండకడెంబులుంగరములున్ ముద్దొల్కుచుండన్ లస ।
త్కరముల్ చాఁచుచు లేవఁబోదురరులున్ గౌతూహలంబందఁగన్ ॥

మ॥ వడిగారమ్మని చప్పటుల్ చఱచి పిల్వన్నవ్వుచున్ లేచి చి ।
ట్టడుగుల్ మెల్లన వెట్టుచేగిపడితివిన్యాసస్థలత్పాదులై ।
పడియేడ్వన్వెస లేవఁదీసి స్యదమొప్పన్ జంద్రహారాదులో ।
తొడవుల్ చిక్కులుదీసియెత్తికొని ముద్దుల్ వెట్టుకొండ్రింగనల్ ॥

చ॥ ఉరుతరపూర్వశైలశిఖరోద్యదహర్పతి తేజులైనక ।
ర్బురసుతులిట్లు శైశవపుముద్దులుసూపుచుఁ గొన్నినాళ్ళత ।
త్పురజనులన్ సురద్విడధిపున్ సరిగానలరింపుచుండవ ।
త్సరములునాల్గువోయి శుభదంబయియైదవయేఁడుదూఁకొనెన్ ॥

సీ॥ చిడుగుడుప్పట్టి నెట్టుడుగాయయాలంకులల్లా నేరేళ్లు చింతాకుచుణుము ।
బూదికన్నులకచ్చబుడికికిస్సికికిచొప్పబెండ్లగసంచపుటాటపిల్లదీవు ।
తూరనగోలలుదూఱుమంగ కెనపుట్టచెండ్లుడాఁగురుమూత చిందుపర్వు ।
శిరిశింగణావత్తి చీఁకటిమొటికిళ్ళుగోటదొర్లుడుకాయకుండెనగిరి ।

మొదలుగాఁగలకూర్దనంబులపుడపుడు ।
తోడిబాలురతోఁగూడి యాడుచుండ్రి ।
శూరపద్మామలారాజసుతులుముగురు ।
మేలుచేతులెతమకోడిమిడుకువడఁగ ॥

వ॥ అప్పుడసురేంద్రుండు గుర్వాదేశంబున ॥

ఉ॥ భాసురశేముషీకునొకపండితునింబిలిపించియక్షరా ।
భ్యాసమొనర్పఁజేసి తగుభంగిఁబహూకృతుఁజేసి తత్సుధీ ।
శాసనమందివిద్దెలను శ్రద్ధఁబఠింపనబుద్ధపూర్వసం ।
తాసులనప్పగించెను సుతాతనుజాతులనమ్మనీషికిన్ ॥

ఉ॥ బిడ్డలులేనివాఁడగుటఁబ్రేమమునంగృతమంతునేనియున్ ।
గొడ్డునుబాఁదినట్లెపుడుఁగొట్టక బోధనెసాధుఁజేయుచున్ ।
ముద్దులనున్ శ్రమంపడిక్రమంబునఁబ్రాజ్ఞులఁగానొనర్చుచా ।
దొడ్డగురుండుపున్నియఁపుఁద్రోవకుఁబాత్రులఁజేయుఛాత్రులన్ ॥

చ॥ అయవిదనుత్తముండు గురుఁడప్పుడుముందుగనోఁనమశ్శివా ।
యయనుచువ్రాయనుం జదువనాదటనేర్పి అఆదియున్ కఖా ।
దియును తథాదియాదియునుఁదెల్పెడినాలుగుబల్లు వ్రాయగా ।
రయమెసఁగన్ బఠింపసుకరంబుగనేర్పె శ్రద్ధధానుఁడై ॥

క॥ పిమ్మటఁ గుణితముఁ గఱపిప ।
దమ్ములనొకఁటియుఁ దప్పాదవకుండఁగవా ।
క్యమ్ములఁజదువను వ్రాయను ।
ఖమ్ముగనేర్పియునుఁ బుస్తకమువట్టించెన్ ॥

ఉ॥ వేయుమొగమ్ములన్ జెలఁగుపీనులకెంటికినుద్దియౌనుపా ।
ధ్యాయుఁడు శ్రద్ధధానుఁడయి తత్పరతన్ జదివింపఁబాలరా ।
మాయణమాదిగాఁగలుగు మాణవకార్హములైన గ్రంథముల్ ।
పాయనిశ్రద్ధతోఁ జదివి ప్రాజ్ఞతనొందిరి కశ్యపాత్మజుల్ ॥

ఉ॥ ఆపలలాశిరాట్పృథుకులట్లుపలబ్ధివిశేషమొప్పన।
ధ్యాపకుఁడెంతనిష్ఠురతరాంశముఁజెప్పిన నంతలోనెని।
ర్వ్యాపరులై గ్రహింపుచుఁ ధరాజను లెల్లఁగుశాగ్రబుద్ధులీ।
పాపలటంచు మెచ్చుకొనఁ బాఠముచేసిరి గ్రంధజాతముల్ ॥

వ॥ మఱియు ఋగ్యజుస్సామాథర్వణంబులను నామ్నాయచతుష్టయంబును శిక్షావ్యాకరణఛందోనిరుక్తజ్యౌతిషకల్పంబులను షడంగంబులును మీమాంసా న్యాయవిస్తర పురాణ ధర్మశాస్త్రంబులును నాయుర్వేదంబును ధనుర్వేదంబునుఁ గాంధర్వంబును నర్థశాస్త్రంబునన ప్రసిద్ధంబులైన యష్టాదశవిద్యల నామూలచూడంబుగా నవగతంబులుచేసికొని యంత స్వతంత్రంబను పేరంబరఁగు పూర్వమీమాంసయుఁ బ్రాచీనతరంబును నుత్తరమీమాంసాపరనామకంబగు వేదాంతశాస్త్రంబును నక్షపాదకృతంబయిన నవీనతరంబునుఁ గపిలకర్తృకంబైన యోగశాస్త్రంబు నులోనుగానఖిలశాస్త్రంబులునుఁ దుదముట్టనధ్యయనంబుచేసి గదాయుద్ధనియుద్ధంబులయందు మేలుచేతులయి యసిముద్గరతోమరప్రాసపరశ్వధశతఘ్నికాది వివిధాయోధనసాధనంబులనుపయోగించువిధంబులన మర్మకంబుగా నెఱింగి తూకలమదకలాదుల నశ్రమంబున నాశ్రవంబులుగాఁజేయనేర్చి శింధుర గంధర్వాద్యారోహణంబుల యందతిప్రవీణులై చతుష్షష్టికళలయందునప్రతికృతులై నిజమాతృవంశసముదితంబగు శాంబరియందప్రతిబింబత్వంబునొంది షోడశసమావయస్కులయి షోడశకళాపరిపూర్ణకళానిధులచందంబున రాత్రిచరబృందామందానందధుర్యులై వర్తిల్లుచుండిరంత ॥

సీ॥ అఖిలవిద్యావిశారదులధికబలులు।
నైనమనుమలఁగనుఁగొని యమరవైరి।
పంకజాక్షాదులెల్లరు నింకఁదనకు।
లెంకలని పొంగుచుండెను శంకదక్కి ॥

క॥ అతిలోకశుమ్మవిద్యా।
ప్రతీతులగు రాజసుతుల ప్రథవిష్టపవి।
శ్రుతమైతనరఁగనగర।
స్థితులు వికుర్వాణులై నుతించిరి సురసన్॥

* ఉత్సాహావృత్తము *

శూరపద్మతారకులను సూనువరులువిద్విష।
చ్ఛూరపద్మపద్మివరులు సుదతినీకుఁగల్గుటన్।
వీరమాతవై ప్రశిద్ధి వెలసితీవు జిష్ణుదే।
వీరమాతలోదరులకు వేతలుపొసఁగునట్లుగన్॥

చ॥ అమృతమయూఖశేఖరమహాత్మునిఁగశ్యపుఁగొల్చితత్ప్రసా।
దమహితభాగ్యముం బడసి తద్దయుఁదైన్యదశానుభూతిక।
గ్గమయిన దానవాన్వయముఁగాచుటకై పనిఁబూనిపుట్టెనీ।
యమయవతారమూర్తియనియందఱు నిన్ను నుతింతురెప్పుడున్।

క॥ అనిశ్లాఘించెడు స్థానీ।
యనితంబినులఁ దిలకించి యాశరవనితా।
జనతారత్నము వేదాం।
తనిశ్శలాకార్థవిదురతగనిట్లనియెన్॥

వ॥ భవత్సంశ్లాఘ్యమానవిషయంబునందు మత్ప్రయోజకతాలవంబును లేమింజేసి మీయొనర్చు ప్రశంసావచనంబులకు నణుమాత్రంబును హర్షమాణత్వంబునొందనోపనేమనినఁ గాత్రధారి సూత్రధారిచేతి జంత్రంపునాట్యపాత్రంబులాగునఁ జగన్నాటకసూత్రధారుండగు నీశ్వరునిదగు నిచ్ఛాశక్తిత్రిప్పులం దిరుగునకాని చేతనునకు స్వాతంత్ర్యంబుసిద్ధార్థబీజమాత్రంబును లేకుంటసిద్ధార్థంబు సర్వంబును నీశ్వరసంకల్పనాధవంతంబకాని యొండుగాదభీష్టకృత్యంబులు నిరంతరాయంబుగా నెఱవేర్చికొనియు ననిష్టక్రియాకలాపంబు దూరాపాస్తంబుగా నొనర్చియు ధ

న్యులగుట జన్యులకు శక్యంబగునట్టివియెకావునఁ బ్రాజ్ఞులగువారజ్ఞానమూలకంబులగు మమతాహంమతులను మొదలంటవిడిచి పురాకృతకర్మవశసంప్రాప్తంబులగు సుఖదుఃఖంబులకు మోదఖేదంబుల నందకద్వంద్వసహులై నిత్యతృప్తులగుచుఁ గాయంబులు జలబుద్బుదప్రాయంబులగుటనైహికసుఖాసుఖంబులచిరరాత్రానుభావ్యంబులని యెఱింగి వానిఁ గణింపకయపునరావృత్తికసనాతనానందసంధాయకుండగు గూఢచరణాభరణుచరణారవిందంబుల న్వాహోరాత్రంబును నవ్యాజభక్తిమత్త్వంబున నుపాసించుచుఁ దేహయాత్రగడపుట యశరీరధారికి వశ్యానుష్ఠేయంబుస్వకృతంబులగు సుకృతదుష్కృతంబులె పుణ్యపాపలోకానుభవహేతుభూతంబులగుంగాని కొడుకులు నన్నేమియుద్ధరించెదరు నేను కొడుకులనేమియుద్ధరింపనేర్తు నీజనయిత్రీత్వపుత్రత్వాది సంబంధంబు లాభాసమాత్రంబులుకాని వాస్తవంబులుకావు కావున నింతమాత్రమునకై మిథ్యాప్రశంసనములనన్నేలయభినందించెదరు. వలదుపొండనిన నశ్రుతచరంబగునాసురసపరిజ్ఞాతృత్వంబునకచ్చెరువడి యప్పురపురంధ్రులు నిరంతరంబునుఁదదంతేవాసినులై ధర్మసూక్ష్మంబులెఱుంగుచుఁ గృతార్థలగుచుండిరిదియిట్లుండ॥

ఉ॥ బుద్ధిబలంబుఁ దేహబలముం సహజన్ములకంటెఁ బాఢసం।
వృద్ధములై యెసంగఁగులజేడితశౌర్యుఁడు తారకాసురుం।
డిద్ధపరాక్రమంబునరమేశ్వరముఖ్యులచేత నేనియుం।
యుద్ధములం జయింపఁబడకుండ వరంబులనందఁగోరుచుం॥

ఆ॥ సర్వవిద్యలకును సర్వభూతములకు।
హరుఁడె యీశ్వరుండటంచు శ్రుతుల।
నొప్పఁబడుల మొదటనుపసర్జనంబగు।
నోంనమశ్శివాయ యనిదిలమయ్యె॥

ఉ॥ కావున నెల్లవేలుపులకంటె నితాంతగరిష్ఠుఁడమ్మహా।
దేవుఁడె యట్టిసర్వజగతీపతియౌ పరమేశ్వరుండు శివుండు।
భావమునందుఁగొల్చుచుఁ దపంబొనరించెదఁగాన కేగియం।
దావిభుఁడెన్నియబ్దములకైనఁగనంబడుదాఁక నిష్ఠతోన్॥

మాలినీవృత్తము॥ అనియవవివికిత్సస్వాంతుఁడై కాన కేగన్।
జననివలన నిర్దేశంబునున్ బొందుకోరిన్।
జనిజననిపదాంభోజాతయుగ్మంబుఫాలం।
బుననొరయఁగసోఁకన్ మ్రొక్కి యిట్లంచుఁబల్కెన్॥

శా॥ తల్లీకానకునేగి సర్వజగదాధారున్ శివుంగొల్చుచం।
చల్లీలన్ దపమాచరించుటకుఁ దర్పంబూనితిన్ బూర్ణమౌ।
నుల్లాసంబుననీశుచేవరము ప్రత్యూహంబు లేకందిశో।
భిల్లన్ దీవనయిచ్చి శీఘ్రముగ సంప్రీతిన్ ననున్ బంపుమీ॥

క॥ ఇచ్చటనున్నట్లుగ వే।
వచ్చెదఁ బూర్ణప్రతిశ్రవమునమదలనీ।
విచ్చిన నళికాక్షునిచేఁ।
జెచ్చెరవరలాభమంది శిష్టనుతగుణా॥

క॥ అనిపలికినతనుజునిప్రా।
ర్థనమున్ విని బుధపనాయితనయాతనయా।
చనియెదఁ గానలకనియెదు।
వినుఁబాసిన నోర్వఁగలనె నిముసంబైనన్॥

చ॥ భయదములైనపోరుల సుపర్వులకోడి నశించుదానవా।
న్వయమునసముద్ధరింతువనినమ్మిన యయ్యసురేంద్రుఁడాత్మనెం।
తయుఁదురపిల్లఁజొట్టములుతల్లడమందగ నిట్టిదూరపుం।
బయనము సేయుయత్నమిది భావ్యమెనీకుఁగుమారకోత్తమా॥

ఉ॥ నావుడుఁదారకుండనురణంబున లేఖులఁగెల్చి దైత్యులన్ ।
ప్రోవఁగఁజాలనేమొ స్వవపుర్ద్వివిణంబునసన్నశంకచే ।
దైవసహాయతంబడయుతర్షముగల్గియకాదె యిట్లుగాఁ ।
బోవఁదలంచినాఁడ నహిభూషణుఁగూర్చి తపంబుసల్పఁగన్ ॥

ఉ॥ పూర్వసుధాశనాన్వయము మోపుగఁగట్టి తదీయభారమున్ ।
సర్వమునాదుశీర్షమునఁ జల్లఁగనుంచుదురంచెఱింగిత ।
ద్దుర్వహభారనిర్వహణధుర్యతమున్ దగియుంటకేకదా ।
గుర్వతికష్టకృత్యమునకున్ గడఁగన్ మదినిశ్చయించితిన్ ॥

ఉ॥ ఖ్యాతిమహాలవాలమగు కర్బురవంశముఁగొంతనిర్దయా ।
రాతులుగ్రొచ్చిరంచు వినఁగ్రాఁగెడునాహృదయంబువైరని ।
ర్యాతనమాచరింపమిపరాసుతకంటెనుఁబెద్దయంచవమ ।
ర్షాతిశయప్రచోదితుఁడనై పనికింతటికుద్యమించితిన్ ॥

గీ॥ శత్రులకుఁ గుండెగాలమై సర్వవేశ్య ।
లంచు నెచ్చటఁజూచిననచటఁదానె ।
యగుచుఁ గన్పట్టువిధమున మగఁటిమిఁగను ।
బరుపలేనిజీవన్మృతుబ్రతుకుబ్రతుకె ॥

గీ॥ శ్రమలవములేని సుఖతరాసనమొకటియుఁ ।
బుధులకున్ గంటకుఁడఁగాక పొదలుటొకటి ।
యునుగనీవిప్డునాదుసముద్యమమ్ము ।
మేకొనకయుంటె మూడవమేలునాకు ॥

క॥ మగఁటిమివిపక్షహృదయా ।
వగతముసేయఁదగనేని వర్షధరుఁడనై ।
నగరునవరోధమునన్ ।
మగువలకాడంగిపనులొనర్చుచునుందున్ ॥

చ॥ శ్రితజనవత్సలుండయిన శీతమయూఖకలాకలాపుఁగూ
ర్చితపము సేయ నేగుట కె చింతిలి యొప్పనిదాన వెట్లున।
వ్రతిలు మవమ్మ రేపుపలుమానిసిదిండ్లనుమన్నిగొన్నయ।
చ్యుతమఘవాదులౌ కడిఁదిజోదులతో నెదిరింపఁజంటకున్॥

గీ॥ తనయుతినయుక్తికసమాహితముగనిట్లు।
నొడువునొడువులనాసోఁకఁపడఁతియాల।
కిందికిందిదపత్రపాకృష్టిబాధ్య।
మానమానసనవ్యైయనె సూనుఁగాంచి॥

శా॥ పుత్రానీదృఢనిశ్చయంబుఁదెలియన్ బోవల్లునీవంటిఁగా।
క్షత్రాసంబుగనడ్డమాడుదునటయ్యా రాజవంశాంబురు।
ట్క్షేత్రల్ కోరుచునుండ్రుగాదె సుతులన్ విక్రాంతులన్ నీవిటుల్।
ఢ్మాత్రంబుం బ్రకటింపఁజూచుటకు నే సంతుష్టఁగాకుందు నే॥

క॥ అమలాత్మక నేనెళమన।
దమనుఁభజింపుమని చెప్పఁదలఁచియుబహువా।
రములుగన స్త్రీస్వాతం।
త్ర్యమన్వతియనినియమింపఁదలఁచుచునుంటిన్॥

ఉ॥ తెమ్మెరదిండిపెన్ దొడవుదేవరనీకుఁబ్రసన్నుఁడైయభీ।
ష్టమ్ములొసంగు సవ్యభుజసంచలనాదికసన్నిమిత్తముల్।
నమ్మముకార్యసిద్ధిపిశునమ్ములుచొప్పడెడున్ శుభస్యశీ।
ఘ్రమ్మనుచున్ బ్రయాణమికఁగమ్ము ప్రతిశుద్ధిగనాజ్ఞయిచ్చితిన్॥

ఉ॥ ఇమ్మ భయాపవర్జనము నిమ్మఘవత్పరిపంథికోటికిన్।
దమ్ముభరింతువీవనిముదమ్మునఁబొంగుచునుండిరాశరుల్।
కమ్మప్రయాణమింకఁగుతుకమ్మున నేను ననుజ్ఞయిచ్చితిన్।
రమ్ముపినాకిచేఘనవరమ్ములుగైకొని వైళమింటికిన్॥

క॥ సహజద్వేషణులమరులు ।
బహువిఘ్నములాచరించి బాధింతురొకో ।
గహనమునకు నీవ్యగ్రియ ।
సహజన్మసహాయుడవయి చనుముకుమారా ॥

గీ॥ అతడు జ్ఞానబలముల నీయంతవాడ ।
కాననన్యోన్యసాహాయ్యకమున మెలగు ।
చున్న మీకపకృతిసేయనోడుదురభి ।
యాతులు నిరంతరాయమగు మీతపంబు ॥

* మానినీవృత్తము *

ఏమొవచించితినంచు మనమ్మున నెంచి యలక్ష్యము సేయకమా ।
తామహుచే నపవాదముగైకొని తప్పక యగ్రియుతోనటవీ ।
భూములకేగుము నీవసహాయతబోవుటయుక్తముకాదుసుమీ ।
పామరబుద్ధివిగా వెదలోపల బాగుగ యోచన సేయదగున్ ॥

క॥ నినుబోగడరాదుగాక తి ।
ఘనమతిలేకః పథానగంతవ్యయనన్ ।
వినవే యగ్రజుదోడుగ ।
గొనియరుగుమడవికి నీకగుంభవుకంబుల్ ॥

సీ॥ శీర్షంబు వ్యోమకైశికుడు బాహాయుగద్వంద్వముచ్ఛాజగవప్రవేష్టు ।
డుదరదేశంబుకాకోదరాభరణుండుచరమాంగముకరీంద్రచర్మధరుడు
కటిసీమబెబ్బులిక డవసంపుండాల్ప గుహ్యాంబఖిలలోకకోటిగురుడు ।
ఊరుజంఘలనూరుసారథిరదభేదికరపాదములు దండధరమధనుడు ।

శిష్టనిఖిలాపఘనములు శిష్టవష్ణి ।
తాప్యతాపదానుడు తాపసాగ్రణీను ।
నోవిసితచింత్యమానపదాబ్జుడీశ్వ ।
రుండనుక్రోశభరమునబ్రోచుగాత ॥

* మహాస్రగ్ధర *

అనుచున్ దీవించి యగ్రియసుతుఁబిలిచి యాయస్మతద్వార్త్రపర్వం।
బును నా వేదించి సాయంబుగననుజునితోఁబోవశాసించియాతం ।
డునుఁబ్రీతిన్ మైకొనన్ వీడ్కొలిపె సుతులఁబాండున్మృతిస్వచ్ఛకీర్తి।
ఘనులన్ సాధిష్ఠరత్నాకటకకలనచెంగ్రాలగాఁజేసికూర్మిన్ ॥

గీ॥ జననివీడ్కొనియప్పుణ్యజననికాయ ।
శస్త్రవిక్రములుచ్ఛప్రశస్త్రసౌధ ।
దేశముననున్నతాతనిదేశమంద ।
నచటునకు నేగిరి వినీతినచటులులయి ॥

ఉ॥ ధృష్టులు కూఁతుబిడ్డలరుదెంచివినీతిన శేషవిగ్రహా ।
శ్లిష్టమహీకులై యొరఁగిదిత్తమునందుఁబొసంగియున్నస్వా ।
భీష్టమువిన్నవింపనసురేంద్రుఁడు నెంతయుహృష్టచిత్తుఁడై ।
శిష్టియొసంగె వారికి విశేషపుఁదీవనలిచ్చి ప్రీతితోన్ ॥

గీ॥ మాతచేత మాతామహుచేతనట్లు ।
పూర్ణతరమనస్కారమాముదలవడసి ।
రాజనైపథ్యములుడిగ్గఁద్రావితాప ।
పార్శ్వవేషముల్ తాల్చిరయ్యధికబలులు ॥

క॥ శరములు నిశ్శ్వాసములును ।
దరకసములుఁగేలుదోయిఁదాల్పి వెడలిరా ।
సురసాసుతులు హిమధరా ।
ధరసవిధయియాసులై యుదఙ్ముఖులగుచున్ ॥

క॥ దానవరాజకుమారులు ।
కానకుహరుఁగూర్చి తపముఁగావించుటకున్ ।
బోనుంకుటవినియాశిశు ।
జీనముగా వారిఁజూడఁజేరిరి పౌరుల్ ॥

ఉ॥ ఆదితిజాన్వవాయజులకందఱకుందమపోకఁదెల్పియా ।
మోదమెలర్పఁబెద్దలకుమ్రొక్కి తదీయములైనదీవనల్ ।
ప్రోదిగనందియుండ్లకికఁబోండనియెల్లరవీడుకొల్పియా ।
సోదరులిర్వురున్ జనిరసూక్ష్మతపశ్చరణైకకాంక్షులై ॥

వ॥ ఇట్లుచెప్పిన సూతునిఁదదనంతరోదంతంబేమని మునులు ప్రశ్నించుటయు ॥

సుగంధివృత్తం॥ దృక్తనూనపాద్వృతప్రతీతపంచసాయకా ।
ముక్తిదాయకా జగత్సమూహముఖ్యనాయకా ।
భుక్తలోకభీకరప్రభూతమగ్నలాహలా ।
భక్తలోకపాపపాశబంధమోక్షదోహలా ॥

విద్యున్మాలావృత్తం॥ గౌరీచేతఃకంజాదిత్యా ।
పారాశర్యాపాతస్తుత్యా ।
పారావారప్రాంచత్తూణా ।
వారాణశ్యావాసాయీశా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకావచయం
బునందు తృతీయా
శ్వాసము.

—:0:—

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీకాశ్యపగోత్రాంబుధి।
రాకావిధుసోమనాథ రాజద్హృదయా।
ప్రాకటచక్రాంగోత్తమ।
కాకోదరరాజవలయ కాశీనిలయా॥

వ॥ అవధరింపుము శౌనకాది చీరవసులకుఁ గ్రశ్రవసుండిట్లని చెప్పం దొడంగె॥

క॥ స్థానీయజనుల కీడొర్చని।
యానక్తంచరకుమారుల నవరతంబు।
స్థానమున ననేకసరి।
తానననగిరి నీవృదాదికముఁగడచి తుదిన్॥

ఉ॥ శౌర్యసహాయులై యరిగి సంయమిలోకకృతాధ్వరాదిస।
త్కార్యము నిర్జరోత్కరసుధామయశస్త్రతరాన్నదానని।
ర్ధార్యము సన్మహోగ్రమణితల్లజధుర్యము నైన మందరా।
హార్యము నాసురారివహార్యము నిర్వురుఁగాంచిరొక్కటన్॥

గీ॥ కాంచి తత్పృథ్వీధరాధిత్యకాధరిత్రి।
నరిగి యచ్చటఁబడపీశ్రమాపనోద।

నార్థ మొకపర్ణ గహనీడ నధివసించి।
యనుజునకు శూరపద్ముఁడిట్లనుచుఁ బలికె॥

ఉ॥ ఈగిరియే నిదానముగ నింద్రుఁడుమలోనగు సూడుకాంద్రచే।
నేగిరి ప్రేతలోకమున కెందఱొతొంటినిశాచరుల్ సహా।
భోగిరిపుల్ హిరణ్యకశిపుప్రభృతుల్ మనపూర్వులీగిరి।
ప్రాగిరిణస్థలంబున దపంబొనరించిరి మున్ను నిష్ఠతోన్॥

ఆ॥ అనినొడివి తదుచ్ఛ్రయముఁ బ్రశంసించుచుఁ।
గొంచెమచట విశ్రమించిలేచి।
తద్విశేషములను తగనెల్లెడలఁజూడ।
వెడలి యన్నయనె యపీయనునకు॥

ఉ॥ వాజిముఖోపమాస్య పరివర్తనచిహ్నితపాంసుముద్రలున్।
స్త్రీజతురాగరక్తపదరేఖలుఁ దన్మిథునవ్యవాయక।
న్ణైజపతైలె మొసంగరహించెడు పూపాదనెగ్గడంపుదే।
రీజలుగంటె కిన్నరులు క్రీడలుసల్పినపాల్పుఁదెల్పెడున్॥

ఉ॥ పూర్వసుపర్వరాజకులభూషణకిన్నరితాపియెల్లెడన్।
బర్వగనిష్టకాలమునఁ బాగుగఁబూచిప్రియాళుశాఖగం।
ధర్వుల స్త్రీలొ కిన్నరులతామరసాక్షులొ కాకయప్సరః।
పర్వసుధాకరాననలొ పాడుటచెప్పకచెప్పుచుండెడిన్॥

మ॥ తలలన్ రాచినదివ్యతైలములగంధంబుల్ తనూలిప్తవ।
స్తులనెత్తావులు నొకటన్ గలయఁజేతోరమ్యమై యీాసరో।
జలమామోదవిశేషమిచ్చెడినివత్స్వాయెవ్వరోఖేచరీ।
తిలకంబుల్ జలకంబులాడిరిటసందేహంబులేదేమియున్॥

మ॥ సుమనోవల్లులు సప్తలాలతికలున్ సొంపారునీభూర్యశో।
కములున్ మాఖ్యములున్ విలూనసుమసంఘాతంబులయ్యెన్ మద

భ్రమరౌఘావృతవృంతపంక్తులగుచున్ భాసిల్లెడున్ యత్నుక
ర్మమున్ జేసినగోళ్ళచే దివిజకాంతల్గోసిరిచ్చో విరుల్ ॥

ఉ॥ చూడమెభూమిపైఁగల ప్రసూనములీవిరులెండతాఁకునన్ ।
వాడవు వేల్పుఁ బ్రమాని ప్రసవమ్ములుసుమ్మి విస్మృత్తపంక్తిగా ।
వీడిన విచ్చటన్ జిలుగువేలుపుటింతులు చిప్పచిప్పగో ।
ళ్ళాడిరి నిస్తులాళిముఖలౌపదముద్రలె శంకదీర్చెడున్ ॥

గీ॥ సహజనివతంసమనకు సాజంపుమాఁటు ।
తులయియున్న దివ్యోపపాదకుల వెలఁదు ।
లెలమివిహరించుచోట్లివి యిదిమనకుఁద ।
పంబొనర్చుటకుచితదేశంబుకాదు.

శా॥ సామివ్యక్తములైన సుస్వరములన్ శ్రావ్యంబుగాబుగ్యజు ।
స్సామాథర్వణమంత్రముల్ వినఁబడున్ సామీప్యమందెవ్వరో ।
సోమాసుల్ క్రతువాచరించెదరటంచున్ దోఁచెడున్ హెూమధూ ।
మామోదంబిదె ఘ్రాణతర్పణమువాయుప్రాపునీతమైవచ్చెడున్ ॥

క॥ సంయములు న్నెడమనముశు ।
భంయులమై మనమదేమిపాపమొకో వా ।
చంయమలూరకయపరిభవ ।
సంయుతులయ్యెదరు దివిజశత్రులఁగనినన్ ॥

శా॥ సోదర్యోత్తమయిట్లుగానఁదగదిచ్చోటన్ వసింపన్ దపో ।
యోగదేశంబునకేగి యందొకవివిక్తోర్విం బ్రవేశించిరక్ష ।
వ్యాపద్వేషణులెప్డుఁ జేరనియరణ్యాంత వసింపన్ దపః ।
స్యాదీక్షావిధియంతరాయరహితంబై సాఁగునచ్చోటునన్ ॥

మ॥ అతఁడిట్లాడినఁదారకాసురవరుండన్నన్ విలోకించిదే ।
వతలన్ దేవతలంతు ఫుల్లకతృణవ్రాతంబుగాఁభస్మసా ।

తత్కృతులన్ జేయుమమర్థనుశ్శ్వ్యతశరాగ్నిన్ వారిఁదాద్భుతమా।
జతనంబాముసులంపుఁ జెల్లదెపుడున్ శాపాయుధుల్ కావునన్॥

క॥ ఓపనితసంవిదతిశయ।
యోపనితరునట్లు రజ్జులోప్పగఁజెప్పన్।
శాపాయుధులన్ దొడరిన।
సాపాయులమగుట నిశ్చయము చింతింపన్॥

క॥ ఆశరులహితంబులుపా।
రాశరులకుఁజేయుమరుగరాసులనుటమి।
ధ్యాశబ్దమయ్యెడునాయను।
నాశంకన్ జేసి యొక్కొయనిజనులెన్నన్॥

క॥ అదికారణమ్ముగాదు।
గ్త్రాదులు నిశాచరులటంచమార్గముచేతన్।
మదిఁ ద్వేషింతురు తబుసులు;
సదయస్వాంతులును సర్వసములును నయ్యాన్॥

చ॥ అదిమనవారినేరమియయంతియకాని మునుల్ప్రభూతభూ।
తదయకుఁబుట్టినిండ్లు శమధంబునకాకరముల్ గణింపఁద।
ద్హృదయములంపుఁ గాంస్యకరదీపికలన్ గొనిసావధానతన్।
వెదకిననేనియున్ గలదె నిక్కపుటల్కనిశాచరోత్తమా॥

క॥ పాడుమరు సులేకమరులు।
పాడుమరు తపోధనుల ప్రభావంబులుకా।
పాడుమరు తత్త్విత్తులుత్రో।
పాడుమరు తదియముల్ తబపుబద్ధంకుల్॥

క॥ కావున ననవరతము త్రిది।
వావాసానీకమంచు సానుగ్రహులై।

భావుకముల నొడఁగూర్తురు ।
పావనులుమునుల్ మహానుభావులగుటచేన్ ॥

పృథ్వీవృత్తము॥ ప్రశస్తులనుకైతవప్రచురభక్తియుత్సారనా ।
ర్జనంబుగభజించువారికి నభీష్టముల్ చేకుఱున్ ।
ప్రతీపమతులౌచు వారలకవజ్ఞఁగావించుకు ।
త్సితాత్ములకుఁ దేజమున్ శిరియు నాయువున్ గల్గునే

గీ॥ పరహింసశ్రీకులయ్యుఁదప్పకపకారు ।
లైనసదోరహింసశ్రీకులకుమరుగద ।
సంతతము సాధుబాధనిష్కారణముగ ।
సలుపు దుష్టాత్ములకు శిరుల్ తొలఁగుటరుదె ॥

చ॥ అనుపధిగాఢభక్తివినయంబులఁదమ్ముఁ భజింపఁజేరెనన్ ।
మనలఁ దపోధనాగ్రణులు నష్టసపోవుటె కాకదగ్ధర ।
స్వనపవనాశనంబులనిస్వాంతములందుమఁ దలంచిశాపదం ।
డనిహతిబాధితాత్ములనొనర్చుట నిక్క ముమీఁదమిక్కిలిన్ ॥

మ॥ దమునస్తేజత్రిలోకియందునవగీతంబైన బ్రహ్మాదవం ।
శమునన్ బుట్టియుట్టినోసమునఁ బ్రాంచద్బృహస్పతివిద్యాగృహ ।
స్యములెల్లన్ మదముట్టగాసెటిఁగి ధన్యస్వంబునొందంగసం ।
యములన్ జేరిభజింపఁద్దులముకామనోత్కృష్టలింకేటికిన్ ॥

చ। ఉఱుసులసందడిన్ మఱచియుంటిమి చూచితె వెన్కదిక్కునన్ ।
దటుసుల మూవురల్లదెకుధంబులొప్పెయొకేలుదోయిఁదా ।
ల్చిబుదుతజన్నిగట్టు తమచేరువవెంబడినేగుదేరమూ ।
ర్తిబెరయుబ్రహ్మవర్చసము తీరునవచ్చెదరీపొలానకున్ ॥

చ॥ అకటకటాకుపూయదనుజాన్వయమందుఁ జనించినట్టిపా ।
తకమునఁజేసి పుణ్యతమదర్శనులంచుఁ జగత్త్రయంబునన్ ।

ప్రకటయశంబుఁగాంచినతపస్వులఁగాంచి దినేశుఁగన్నపే।
చకములకైవడిన్ వలసె సందులఁగొందులఁజొచ్చి డాఁగఁగన్ ॥

చ॥ ఘనపరమేశ్వరాంశజులుగా మహినొప్పెడు మస్కరీంద్రులన్।
గనుఁగొనిచాటుచాటునఁ జనన్ వలసెన్ జగదాప్తుఁడైనయ।
రుక్కనిలసదంశువుల్ గనినక్షుల్లకఘూకములట్లు వానికిన్।
మనకునిశాచరత్వముసమంబగుటన్ విధియిట్లు వ్రాసెనో ॥

క॥ ఆవచ్చుచునుండినవిపి।
నావాసులలోచనములకగపడకుండన్।
నేవేగమె పెఱచోటికిఁ।
బోవుటె మేలమ్మ లెమ్మ పోవుదమనినన్ ॥

శా॥ నీకీవచ్చెడివారిఁజూచుటనుకన్ లేదన్యథాబుద్ధినే।
నీకానన్ మనకుండఁగూడదని మున్నే చెప్పితిన్ గాదెనా।
కాకోదర్మవిహారభూములివి యీయుర్వీధ్రమునుంమంటని।
ర్శోకంబూడ్చిన దారుణాహికడఁగూరుక్రంజెంమటో నెంచగన్ ॥

మ॥ అనుచున్ దమ్ముని కేలుకేలఁగొని యొయ్యన్ ఘోరపన్నందులే।
చిన నక్తాకరుఁడున్ యియానుఁడయి లేచెన్ లేచి వారిద్వరున్।
జనసంచారములేక హింస్రమృగసంచారాస్పదంబైనకా।
ననపద్యన్ గతుఁడవ్వగాఁజనిరి నూనస్వాంతులై యాత్యులై ॥

ఉ॥ ధీరుఁడు తారకాసురుఁడధిజ్యశరాసనుఁడై తరక్షుకం।
ఠీరవఋక్షభల్లుకకిటిద్విరదాద్యటవీమృగంబులన్।
ఘోరపృషత్కపాతములఁ గుంభినిపైఁబడఁగూలనేయుచున్।
దారుణమైన కాఱడవిదారినిబోయె ననేకఘస్రముల్ ॥

మ॥ తిమిరారిమ్రుఘులన్నిశాటవరులాదిత్యప్రచారంబుకోం
చెమునున్ లేనిదియై నిరంతరపలాశిప్రావృతంబై సుమో।

దముఁగల్గించుచు స్వీయమైన జననస్థానంబు చందాననో।
ప్వమహారణ్యమొకొండుచేరిరిగతిన్ బూర్ణస్యదంబొప్పఁగన్ ॥

శా॥ క్రాంతాంభోధరవర్తనీకపృథుశాఖద్రూరుహాంబైనయా।
కాంతారంబునఁజొచ్చి యొతఁడుపవృత్తచ్ఛాయకున్ జేరివి।
శ్రాంతుండై యలశూరపద్ముఁడనుజున్ బ్రత్యర్థిసేనాబ్జినీ।
దంతీంద్రున్ దిలకించియిట్లు వలికెన్ దత్కాననాస్యస్పృహన్ ॥

చ॥ పనసరసాలదంతశరభవ్యఫలిద్రుమజాతమైనయీ।
ఘనఫలసంహతుల్ జనులకంటికిఁగాన్పడమిన్ మహాదరో।
ధనములలో స్వశైశవమృతప్రియమై పడియున్నశ్యామల।
ట్లనుభవబాహ్యమై వనమునందె నశించెడిఁగదె తారకా॥

క॥ ఘస్రసమయములయందుఁద।
మిస్రములువసింపనద్రిమేఖలపైలో।
కస్రష్టయీవనముఖా।
నూస్రమరాపము స్మజించెనోయని తలఁతున్ ॥

ఉ॥ తమ్ముఁడవింటివయ్య యిదదండకమన్ పిపినమ్మునమ్మపూ।
ర్వమ్మమరావతీసదృశమై భవమా పురముండునీప్రదే।
శమ్మునకున్ లయాగ్నిసదృశంబగుభార్గవదేవుఘోరశా।
పమ్మునఁజేసియిట్టి దశపట్టెనుదండునిమండగంబునన్ ॥

గీ॥ అనవుడు విలక్షుఁడై తారకాసురుండు।
దండుఁడనునాతఁడెవ్వఁడాతనికతమున।
భార్గవుండేలయలిగి శాపంబొసంగె:
నగ్రియా చెప్పవేయని యడుగుటయును ॥

స్రగ్విణీవృత్తం॥ తారకుంగారవుం దమ్మునిన్ జూచియా।
శూరపద్మాసురేశుండు దండాఖ్యదే।

వారివృత్తంబు భాషాంగనాపాదమం।
జీరనాదార్భటిఁ జెప్పెనీచొప్పునన్॥

సీ॥ అదరులౌ వెలిగ్రక్కుచునలంపుఁగొల్లుల కెనయైన నెఱజాజుకనులవాఁడు।
మొగము కంమనకునిమ్ముగ కాద్రరసపుష్టిదలకొల్పు పెనుజీబుదాడి [వాఁడు।
ప్రతిభయ సమవర్తి పరిఘాత నాయితాయత పీనబాహుద్వయంబు [వాఁడు।
ఆన్వహానేకసత్త్వామిషాసృక్పూర్యమాణోదరోరు కుంభంబువాఁడు।
ద్రష్టలను బీతుకొల్పు వర్ణప్రమాణ।
ములను రెంటను జీమూతమునకుమాద్రి।
యగుచునొప్పు పీవరవిగ్రహంబువాఁడు।
దండుఁడనుదండగీఁడు గలండొకండు॥

క॥ విక్రమమున నసదృశుఁడై।
శక్రాహితులెల్లఁదన్ను నంసేవింపన్।
శుక్రుఁడు గురుఁడుగ నీక్ష్మా।
చక్రముఁబాలించెఁ దస్యుజనములు బెగడన్॥

గీ॥ అన్నిగుణములు మంది వెయయ్యునతఁడు।
పరసతీలౌల్యమున ఁమాలువడియెఁజాల।
ఘనహవిఃపూర్ణనిపమొక కశ్యబిందు।
నైనఁబడెనేని యపవిత్రమగునకాదె॥

శా॥ ఆరాత్రించరసార్వభౌముఁడు మృగవ్యాసక్తుఁడై యొక్కనాం।
తారక్షోణిని సంచరించుచుఁ దళత్కంజాతపత్త్రేక్షణన్।
దారాధీశ్వరపూర్ణబింబవదనన్ దంతీంద్రకుంభస్తనిన్।
నారీరత్నముఁగాంచె నోర్తునరజానామన్ వనాంతంబునన్॥

ఆ॥ అఖిలకర్మసాక్షియైన త్రయీతను।
నంబుదృష్టినిల్పి యధికనిష్ఠ।
నుగ్రతపముసల్పుచున్నదానిఁ భార్గ।
వాగ్రియాత్మజాతనప్డుచూచి॥

క॥ సురసాధ్యయక్షవిద్యా।
ధరసారసముఖులచక్కదనమెంచఁగినయా।
తరసాశనపతిసాశ్వ।
ర్యరసాత్మకుఁడయ్యె నామెరమణీయతకున్॥

క॥ ఇందీవరకెన్నుఁడునీ।
యిందీవరనయనఁబాది మెఱుఁగనెసఁగున।
య్యిందీవరసన్నిభకే।
నిందీవరఁపుతెతయీవనితనీక్షింపన్॥

గీ॥ అనుచువర్త్మాంతమొకమహాంతరాయ।
ముగఁదలంచుమ నాసాధుమూర్తిఁగాంచి।
యసమసాయకగోచరుఁడగుచునాల।
తాఁగిచెంతకుఁజేరి యిట్లనుచుఁబలికె॥

ఉ॥ ఎవ్వతెవీవు సారసదళేక్షణ నీయభిధానమేమియా।
మవ్వపుమేనువృద్ధనియమంబులఁ గార్శ్యమునొందఁజేయుచీ।
వివ్వనిలోన ఘోరతపమెవ్వనిఁగూర్చియొనర్చుచుంటివీ।
జవ్వనమేతమాగ్రవనచాంద్రికనెచ్చెలిఁజేసితక్కటా॥

చ॥ వనమునసున్న పద్మినికి వాసరనాథునిద్యోతమిష్టమా।
గనుకనొయింతకోర్చితివికాక వధూమణిలేఁతతీవెతో।
నెనయగుదేహయష్టికలుకుండదు నెట్లుసహింపఁజాలుఁజా।
లుసికనుమానుమీతపములోచనవిప్రకృతాంబురుడ్దళా॥

గీ॥ అకటహృద్యభాస్వన్మూర్తులై నపద్మి ।
నులకును స్వధామకార్శ్యమునుఁగలిగించు ।
నట్టితీవ్రతపముఁగోరుటహాణమానె ।
చెలువ దూరవిచారంబు సేయవైతి ॥

క॥ తోవకంటికుటుముకన్నా ।
కవిభావసునగ్నియందుఁ గ్రాఁగుకలశనీ ।
దువపు స్తపనీయముఘు ।
ర్మవారిదంభంబునన్ గరఁగెడిన్ గంటే ॥

ఉ॥ తామరసాక్షి దంభుఁడను దానవనాథుఁడనేను శిద్ధసా ।
ధ్యానురగుహ్యకాదులు భయంపడుచుందురు సంతతంబును ।
న్నామమువిన్నమాత్రమున నావగునాజ్ఞను నాశ్రవుల్ సుమీ ।
యీమహినేలుచున్నమనుజేశ్వరులెల్లనిజంబువల్కితిన్ ॥

చ॥ దిరిసెనపుఁబూవువంటి మృదుదేహముదానవు కష్టనిష్ఠనీ ।
కరణిఁదపింపనేల గజగామిని నాకుఁద్వితీయవై సురే ।
శ్వరునిద్వితీయపోలె మణిసౌధతలంబులరాజ్యవైభవ ।
స్థిరతరసౌఖ్యసంపదలఁ జెందఁగవచ్చును రమ్మువీటికిన్ ॥

ఉ॥ తొయ్యలియక్షయంబులగు తొమ్మిదిపాఁతరలున్నకల్మికాఁ ।
డయ్యును గుహ్యకేశ్వరునియంతటివాఁడు మదార్జితార్థముల్ ।
నెయ్యమినేగుడెంది కసనివ్వెఱఁజెందుచు శ్రీమదగ్రణీ ।
వయ్యమెసమ్మునామవిభవస్మయమింకనినాకుమ్రొక్కెఁదాన్ ॥

క॥ అమరేంద్రమహిషీమున్నైశ్వ ।
ర్యముగలిగిన నాకురాణివగుభాగ్యముకం ।
టె మృగాక్షీ యీతపమున ।
సమధికఫలమేమిబడయఁజాలుదు చెపుమా ॥

ఆ॥ త్రిభువనస్థితప్రతీపదర్శినులను ।
వలపుగొలుపఁజాలువాఁడ నేను ।
యువతినిన్నుఁ గోరుచున్నాఁడ నిదినీకు ।
తపముఫలముగాఁగఁదలఁపవలదె ॥

చ॥ అనుచుఁ బ్రసూనసాయకవశాశయుఁడై యతఁడట్లు పల్కినన్ ।
దనమదికింపుగాని క్షణదాచరనాథుని విప్రలాపముల్ ।
వినియతనింగుఱించి ప్రభవించినగాఁటపుటల్కమానసం ।
బున నెయడంచి యయ్యలరుబోఁడి మృదుస్వనమొప్ప నిట్లనున్ ॥

చ॥ ఇహసుఖనిస్పృహాత్మనయి యిచ్చటి యాకలముల్ భుజించుచీ ।
గహనములోన నిప్పగిదిఁగాలముపుచ్చుతపస్వినిన్ ననున్ ।
గృహిణులపొందు డెందమునఁగోరుచు స్వైరిణులై చరించుదు ।
ర్మహిళలతోడ నాడినక్రమంబున నిట్లననీకుఁ బాడియే ॥

ఉ॥ దారితవైరివీరబలదానవనాథ సమస్మరార్తులన్ ।
గోరుమగాక నీకుఁ దగుకోమలమూర్తుల నన్నువంటిశృం ।
గారవిరక్తలౌ తపసికన్నెలఁగోరుట యర్హమౌనెకం ।
ఠీరవమెన్నఁడైన హరిణీసురతంబున కిచ్చగించునే ॥

క॥ వినుదుర్గతిహేతువుపర ।
తనుమధ్యలపొందుమన పరదారాన్ గచ్ఛే ।
త్తని ప్రభుసమ్మితమగుతొలు ।
మినుకువదించున్ గదే తమీచరనాథా ॥

ఉ॥ అన్నానన్నిటులాడనీకుదగునయ్యా దానవాధీశనే ।
నన్నాలీకభవోపమానుఁడగు శుక్రాచార్యునగాత్మజన్ ।
నన్నెన్నండును మున్ను నీవెఱుఁగకుంటం జేసి యిట్లంటిగా ।
కున్నన్ నగ్గురుపుత్రిఁ జెల్లెలినిగా నూహింపకిట్లుందువే ॥

గీ॥ నిన్నెఱుంగకమున్నె గన్గొన్నయపుడె।
స్నేహపాత్రంబవీవని నేనెఱిఁగితి।
సన్నుతైలబిలత్వంబెసంగుటొకటి।
యధికముగనిష్టుఁ బినుటచేనది స్థిరపడె॥
గీ॥ సకలసుమనోమధూళీరసజ్ఞ యైన।
యళికిఁ గంధఫలియుఁబోలె నసురనాథ।
నైకమాన్యకృతిప్రాణనాథుఁడవగు।
నీకునస్పృశ్యనైతిని నేనువింటె॥
ద్రుతవిలంబితవృత్తం॥ ఇటులువలికి మతఁ డెమొవ వింపఁబో।
వుటయు నడ్డమువోయి వ్యవాయలం।
పటుఁడు దానవపాలకుఁ డామెతో।
స్ఫుటతరోక్తులుచొప్పడ నిట్లనెన్॥
చ॥ సుకముగ నాదుసొమ్ముఁదినుచున్ ననునాయిలుఁగాచియుండు దై।
త్యకులగురుండు కావ్యుఁడు మదాశ్రితవర్గములోనివాఁడవా।
నికిఁదనుజాతవౌటఁదరుణీమణి నీవుమదర్థమైతిపిం।
చుకతలపోయుమీ ప్రజలసొత్తులురాజువిగావె యారయన్॥
ఉ॥ నీకునిజంబుదెల్పెదను నీరదనీలశిరోజ నేనుదో।
షాకరమైన దైత్యకులమందుఁజనించినవాఁడఁగానులో।
కైకపనాయితంబగు దినేశ్వరవంశమునందుఁబుట్టియు।
క్ష్వాకుఁడనన్ బ్రథన్ గనిన క్ష్మాతలనాథునకున్ దనూజుఁడన్॥
శా॥ మత్తాతాదులు నాదుబాల్యమునఁ బల్మాఱు త్తమంస్వార్జితం।
వి త్తమ్మంచు సమజ్యలన్ బలుకఁగా వింటన్ స్వబాహాబలో।
పాత్తంబైన ధనంబెకాని యికఁబిత్ర్యంబైనయర్థంబుఁగిం।
చిత్తైనన్ భుజియింపఁగూడదనితోఁచెన్ నాదుచిత్తంబునన్॥

శా॥ అంతన్ బంధులనెల్లఁబాసి పయనంబై పోయి వింధ్యాచల ।
ప్రాంతోర్విన్ మధుమంతమన్ నగరమున్ బాలింపుచున్నట్టియు ।
త్యంతాఖిలులఁదైత్యులన్ గెలిచి యయ్యాదిత్యవైరుల్ కడున్ ।
సంతోసంబలరార వేఁడుకొనుడున్ గైకొంటిఁ దద్రాజ్యమున్ ॥

చ॥ బలియుఁడు వాసవుండెపుడు పైఁబడిచంపునొయన్నబీతుచే ।
నెలఁతరొ కంటినిండ సుఖనిద్రయెఱుంగని యాతుధానము ।
ఖ్యులు మదనూనదోర్బలసమున్నతిపెంపున నోటదక్కఁగుం ।
డెలపయిఁజేయువైదికొని నిద్దురవోయెదరిప్డు హాయిగన్ ॥

ఉ॥ వాసరనాథువంశమున వైభవమొప్పఁగ నుద్భవించుటన్ ।
జేసి తపస్విముఖ్యుఁడు వశిష్ఠుఁడు నాకుఁగురుండుగానిరా ।
కాసులమూఁకకున్ గురుఁడు కావ్యుఁడు నాకుగురుండుకాడు శం ।
పాసదృశాంగి మద్గురుకుమారివి నీవునుఁగావువింటివే ॥

ఉ॥ పున్నమనాటి చందురునిఁ బోలుభవన్ముఖలక్ష్మియున్ బదా ।
ర్వన్నెపసిండితీవెకెనవచ్చెడు నీనును మేనిజగ్గునీ ।
క్రొన్ననచెండ్లకుద్దియగు గుత్తపుచన్గవపొంకమున్ గనుం ।
గొన్నఁదపస్వులున్ మరునికోఁతలపాలయి కుందకుందురే ॥

చ॥ తమితటిఁజేతిరొక్కమును దస్యుఁడు ముద్దులఁగూర్కిమంపునన్ ।
స్వముఁగొనిపోవనిచ్చి తరువాయిని మేల్కని యేడ్చుపోల్కినో ।
రమణితబంపు వేఁడుఱుపరాకున మారునకొప్పగించియు ।
త్తమునను గోలుపోయి యనుతాపమునొందెదుసుమ్ము పిమ్మటన్ ॥

వ॥ సహస్రపత్రపత్రనేత్రి యతిమాత్రవ్యథావిధానపటిష్ఠ యగుతపోనిష్ఠచేఁజిరరాత్రసమాసాదనీయఫలసిద్ధియగు నాముష్మికసుఖంబుఁబడయనపేక్షించి యుత్తమక్షత్రగోత్రజుండను స్వయంకామయమానుండ నునగు మహారాజపుత్రునన్నుఁ బరిగ్రహింపనొల్లక యుపేక్షించుట యు

దగ్రశాఖిశాఖాగ్రస్థితశలాటు జిఘృక్షుచేనులంగవనిరంతరసమావరణంబ గుభూరుహాపక్రికాండంబునకెగఁబ్రాకుచుఁగరస్థితపరిణత స్వాదుఫలంబు పరిహరించుటయుఁగుఁజుమీ యాసేచనకంబగునీమోహనాకారంబులోచనగోచరంబైనంతనుండియు విషమనారాచుండుబెట్టిదుండై యేఁచం దొడంగె భయ...నుసుందరాంగగాఢపరిష్వంగసుఖంబొసంగి యాదరింపవే సి యికనొకనిమేషంబును దాళఁజాలననునతను సామ్రాజ్యపట్టబద్ధుంజేసి యీవును మదీయాతనుసామ్రాజ్యరాజ్ఞీత్వంబునకుఁ బట్టబద్ధవుకమ్మా రమ్ము శృంగారసారణి నోలలాడనిమ్మని గంధశుండాలంబు బాలరసాలకిసాలంబుఁగేలదెమల్చు లీలనాసుశీలకరగ్రహణంబు సేయంబోయిన నా యనవద్యచరిత మదాంధుండగువీఁడు కదియంబడెనని కర్జంబుదప్పునని కపటానురాగోక్తులచేఁ బ్రతారించి సురుఁగందలఁచి యారాత్రించర పతికిట్లనియె ॥

శా॥ ఏమేమీ కృతలక్షణుండయిన యాయిక్ష్వాకుభూజానికిన్ ।
ప్రేమామతిమవైన పుత్రిఁడవె యోపృథ్వీతలాధీశనిన్ ।
సామాన్యంబున యామినీచరునిగా స్వాంతంబునందెంచితిన్ ।
నామాహాత్మ్యంబునకున్ సహింపుమెదఁగినట్లు బూనకుద్యద్దయన్ ॥

చ॥ కలుషవివర్జితంబుఁ ద్విజగద్విదితంబునునైన భానుని ।
తులలమునఁ బార్థివోత్తమునకున్ బ్రభవించినవాఁడనౌటవీ ।
నులసు రసాయనంబులగునూత్నమృదూక్తుల నీవుదెల్పగాఁ ।
దెలియఁటఁజేసి నామనమతిప్రియతాన్వితమయ్యె నీయెడన్ ॥

చ॥ సుకలులుగాక త్వాదృశులు చూచినగన్ వనిఁదోళ్ళుగట్టికా ।
యకసవులన్, మెసంగుచుఛదాలయువాసము సేయువెట్టివా ।
లకపు తపోధనాత్మభవులన్ విరసాత్ములఁ బెండ్లియాడనౌ ।
ల్లక యొకరాజపుత్రిఁ గృతలక్షుఁబెండిలియాడఁగోరుచున్ ॥

క॥ ఈపగిదిఁ దపమునల్పెడు ।
నాపైఁగృపఁబూని దివసనాథుఁడు పనుపన్ ।
నాపాలిభాగ్యదేవత ।
వై పొడసూపితివి నీవహస్కరబీజ్యా ॥

ఉ॥ ఓనరలోకనాథతనయోత్తమ త్వల్లపితప్రియోక్తులన్ ।
వీనులవిందుగాఁగవిని నిక్కమెఱుంగుటకల్లు వల్కితిన్ ।
గానినినున్ సురూపరతికాంతునిఁ గన్గొనినంతనుండియున్ ।
సూనశరాసనుండలఁచెఁజొచ్చెఁజుమీ నిజమిప్డు దెల్పెదన్ ॥

ఉ॥ నీదగుప్రావృషేణ్యనవనీరద సుందరమైన దేహమా ।
చ్ఛాదనఖేలకై వనవసుంధరఁగుమ్మరుటన్ నిరంతర ।
స్వేదపృషత్పరీతమయి చెన్నుదొలంగి భవత్పథశ్రమా ।
వేదకమౌచునున్నయది ద్వేషణభీషణ దావపావకా ॥

చ॥ అదెయస్మృతోపమానమున నావిలమున్ భృశశీతలంబునౌ ।
నుదకముచేఁ బరిపూర్ణమయి యొప్పుచునొక్కసరోవరంబుతూ ।
ర్పుదెసనునల్పదూరమునఁబొల్చుచునున్నది యందుఁబోయిత ।
త్పదమలినావతారమున స్నాతుఁడవై చనుదెమ్ము హాయిగన్ ॥

శా॥ నేనున్ నీవరుదెంచునప్పటికిటన్ నీరాడి ధౌతోపసం ।
వ్యానంబున్ మొయిఁదాల్చి యుజ్జ్వలతపస్స్యాయాసనై యుండునా ।
పైనన్యోన్యమనోనురాగములు సాఫల్యంబునొందన్ దమిన్ ।
సూనాస్త్రాహవకేళిఁదేలుదమటంచున్ బొల్తివాకుచ్చుడున్ ॥

క॥ మాయాయావర్తనజనిసం ।
స్త్యాయమయిన దండుఁడామెఛందమెఱిఁగియా ।
రాయసని తలయూచుచు న్తని ।
తాయితమగు నెలుఁగునన్ సుదతికిట్లనియెన్ ॥

ఉ॥ చిల్కలకొల్కి యేటికివచించెదవిట్టి సకైతవోక్తులన్ ।
గుల్కుమిటారి యిట్టితసుకుంబలుకుల్ లొటతాటకత్తెవై ।
పల్కననేనునమ్ముదునె పంకరుహాయతపత్త్రనేత్రి నా ।
యల్కకు నీవుభాజనమవై చెడిపోకు మెఱుంగఁజెప్పితిన్ ॥

ఉ॥ చేడియ నీమటకుల్కిటఁజెల్లవు నన్నటుపాగనంపినీ ।
ప్రోడనిఁబాడఁజూచెదు త్వదూహయెఱింగితిఁ బెక్కులేటికీ ।
రేడుజగంబులున్ గలసి యుత్తఱినడ్డమువచ్చినన్ నినున్ ।
గూడకపోవనీనుసుమి క్రొన్ననవింటివజీరుసాక్షిగన్ ॥

మ॥ స్మరతీవ్రాశుగవృష్టిలోఁదడిసి సుస్నాతుండనైనాఁడనా ।
సరసీతోయమునందు నేమిటికికన్ స్నానంబొనర్పన్ వలెన్ ।
దరుణీచేయకతప్పదేని యిదెనీతారుణ్యలావణ్యని ।
ర్ఝరమందిప్పుడె యోలలాడెదను తృష్ణాశాంతియున్ జేకుఱున్ ॥

వ॥ అనిపలుకుచు ననుహృత్ప్రచండదండధరదండంబులునుఁ బ్రద ష్టజనతాతిభయదానశౌండంబులునునగు నిజబాహుదండంబులంబొడవి పట్టందమకిందిన నాక్రించుచు వారించుచుఁ బంచషపదంబులు వెనక్కరిగి నిలిచి నలుదెసలున్ గలయఁదిలకించి యెందునెవ్వరిఁగానక శుక్రతనయ తనయసహాయతకుఁ దూరవగచుచుఁ జేయునదిలేక తనమనుగడకదియ తీఱుగడయని నిశ్చయించుకొని యాపాపనిరతుఁ బొరిమాపులఁబరికించు చు మరలనిట్లనియె ॥

చ॥ అమలినమైన చిత్తమున నారసిచూడుము స్వల్పకాలసౌ ।
ఖ్యమునకు నాసఁజెంది పరకాంతలఁగూడి రమించియాపయిన్ ।
శమనునిచేతఁ దండనము చంద్రుఁడుఁదారలునుండునంతకా ।
లమనుభవించుటొప్పునె తలంపవుగాకిది దుర్మదాంధనన్ ॥

ఉ॥ కావరమెత్తినన్నుఁ గనుగానక గమ్యనుబట్టికొంటినీ ।
భావివిపత్తినారయవు బాపురె భార్గవదుర్నివారరు ।

ట్పావకకీలలన్దొరఁగి భస్మమవౌదుసుమీ వినాశకా ।
లేవిపరీతబుద్ధియనలేదె పురావిదులైన కోవిదుల్ ॥

గీ॥ ఇంచుకయెయిన్గలైనేని యీరేడుజగము ।
లోకుల్ వేల్మిడి సమయింపనోపుమహిమ ।
ఋనియయిన భార్గవునిప్రియతనయనన్ను ।
వనితరమ్మనిపిల్వ నెవ్వనితరమ్ము ॥

ఆ॥ నిజము బ్రతుకునంచునీకు రోంతజనించెఁ ।
గాకయిట్టితలఁపునీకొదవునె ।
మనఁదలంతువేని మద్ధితంబాలించి ।
పామరత్వబంచుఁబలుకు పొలఁతిఁగాంచి ॥

శా॥ ఓయష్టాపదగాత్రి భార్గవునికోపోపర్యుధజ్వాలలన్ ।
గాయంబూడిననూడనీ శమనుఁడాగ్రాతారముల్ దుర్గతిన్ ।
ద్రోయంజేసినఁజేయనీ యిపుడునీతోఁగూడకేళిఁగఁజు ।
మ్మీయంచున్ స్మరపారవశ్యమునఁబల్మింబట్టి యాయంగనన్ ॥

సీ॥ కడుఁజూడనింపైన కమలాకరమున నులూయుంబుసొచ్చి కలంచినట్లు ।
నవశాలలోదూఱి సామ్నాయ్యమును జేరి కాలేయుఁ డుముదానిఁగతికినట్లు ।
నవనవలాడు ప్రసన్నమాలతీవల్లిఁ దుష్టషండము బిట్టు త్రొక్కినట్లు ।
పాలుపైనవులుకాసిపులుఁగుపెంటిని క్రూరదక్షాయ్యము ద్రుతిఁ దన్నినట్లు
ప్రాంచితతపోనియతినతిప్రయతమైన ।
మృదులసూనమువంటి నెమ్మేనిదాని ।
గఠినధువనమొనరించి గాసిజేసెఁ ।
గజ్జలశిలోచ్చయోన్నతాకారుఁడతఁడు ॥

శా॥ ముక్తాహారయు సంగవర్జితయునై మోక్షార్థమైయొప్పి కా ।
సత్కుల్యిడితపించు నద్గురుతనూజన్ గ్రామ్యధర్మస్పృహా ।

ద్రిక్తభంగుఁడతండు బల్మినయిఁబొందెన్ మొఱ్ఱో మొఱ్ఱోయనన్ ।
యుక్తాయుక్తవివేకశూన్యులుగదా యూహింపఁగామార్థితుల్ ॥

చ॥ సరసవిలోకనంబులును సాధ్వమృదూక్తులు నవ్వులుస్ఫుర ।
త్స్మరముఖచుంబనాదులు విభావములెవ్వియులేక నేత్రపు ।
ష్కరములనుండి యశ్రువులుకాలువలై ప్రవహింపనేడ్చున ।
య్యరజనుగూడనేవపడడయ్యెను దండుఁడు దుర్మదాంధుఁడై ॥

ఉ॥ ఖండశశాంకమౌళికిఁ జగత్పతికిన్బదభక్తుఁడైన కా ।
వ్యుండిది విన్నచో నలుగునోయనినైననుఁబీతునొందకా ।
దండితవైరి దండుఁడను దండిమగండతిగర్హణీయమా ।
దుండగమిట్లుచేసి తనతోవినుబోయె హయాధిరూఢుఁడై ॥

వ॥ ఇటసౌరభేయజగ్ధోచ్ఛిష్టమైన బాలకాష్ఠీలపోలిక నాబాలికామణి పాలసుచేవిడువంబడి జనంగమస్పృష్టంబైన పురోడాశంబు తెఱంగున వానిచే నపవిత్రీకృతంబైనగాత్రంబుతో భూతధాత్రినుండనొల్లక పరలోకయాత్రకుఁ గృతనిశ్చయయై తదాత్వసమాగతయైనయొక నిజభుజిష్యచే దండుండు తనయెడంజేసిన వ్యతిక్రమంబంతయు నిజజనకునకుఁజెప్పిపుచ్చి యచ్చటివిమగులచే సౌదపేర్చికొని యందగ్నిరవులుకొల్పి జ్వలజ్జ్వలనజాజ్వల్యమానచిత్యాసమారోహణంబొనర్చి యూర్ధ్వగతికిఁ బోయె నటభృగునందనుండును సందేశహారిణిచేఁ దనయోదంతంబంతయు విని సటాసమాకర్షణామర్షణంబైన యేనుంగులగొంగ తెఱంగునఁ గ్రోధదుర్నిరీక్షుండై యచ్చటికివచ్చి వీతిహోత్రసాత్కృతగాత్రయై ప్రియపుత్రీలోకాంతరయాత్రచేయుటయెఱిఁగి యగ్గరితగుణంబులుగ్గడించి కొంత తడవు పనవిపనవితనకుఁడైనయుపశమించుకొని తనమృతసంజీవనీవిద్యచేఁ బునర్జీవితం జేయంగలిగియు నామును మానవతీవతంసంబగుటఁ జీవింపనొల్లదని నిశ్చయించి నివృత్తతద్వ్యవసాయుండై యాదండుని దుండ

గమున్దలంచి సంవర్తసమయచిత్రభానుండునుంబోలెమండిపడుచుఁదణ్డం
డరాజవంతంబగు మధుమతంబుచుట్టునుఁ ద్వాదశయోజనంబులపొడవు
గ నెడప యేడహోరాత్రంబులు మంటివానగురియునట్లును దండుండు
సబంధుభృత్యామాత్యపౌరవారంబుగా నేలపాలగునట్లును శపించి నిజే
చ్ఛంబోయిననాయవితథవచనుని వచనంబుచొప్పున సర్వంబును నట్లయ
య్యెనాటంగోలెనిది దూరీకృతజనసంచారంబగు కాంతారంబై యాదం
డుని పేరఁ దండకంబనంబరఁగుచున్నయది యిది ఫలభారవినమ్ర దధిఫలా
మ్రపనసాదిఫలితతరువరపరివృతంబును మధురపృధురసానేకసరఃప్రస్రవ
ణాది జలాశయసమృద్ధంబునగుట నస్మదుద్యమంబునకెంతయుఁ దగియు
న్నయదియని మత్స్వాంతంబునకుఁదోఁచుచున్నయది త్వదాశయంబెట్టి
దియొ తేటపరపుమన నత్తారకుండు ఘూరపమ్మంజూచి ॥

ఉ॥ అగ్రియనీకునెద్దిహితమయ్యదినాకును నిష్టమౌఁగదా।
వ్యగ్రత లేక దీక్షితులమై యఖిలద్రుహిణాండనిగ్రహా।
నుగ్రహదక్షుఁడున్మునిమనోజలజాతవికర్తనుండునౌ।
నుగ్రునిఁగూర్చి ఘోరతపమొప్పఁగఁజేయుదమివ్వనంబునన్॥

గీ॥ అనుచుఁదారకుఁడునుఁడనయభ్యుపగమ।
మునుదెలిపెనంత నప్పుణ్యజనవరేణ్యు।
లాదితాపసవర్తనులై తపంబు।
సేయఁదొరకొని రధికనైష్ఠికతదనర॥

గీ॥ ధారణీవనీచభూమిభృత్సముదితయయి।
వెలసియున్నతవంశజాతులకునైన।
నడుగుఁజేరిదర్శింపవీల్పడనిచక్ర।
వర్తినినొకానొకమహాస్రవంతిఁజేరి॥

శా॥ క్రవ్యాదాభిజనోరువారినిధిరాకాయామినీనాయకుల్।
భవ్యద్యోతటినీపయోమధురతాపాణింధమంబై సదా।

నావ్యంబై తనరారుతజ్జలమునన్ సంస్నాతులై యిర్వురున్ ।
నవ్యక్షౌమములంతరీయముగ మేనన్దాల్చి సోత్సాహులై ॥

శా॥ సద్యోజాతపురోగమంబులగు పంచబ్రహ్మమంత్రంబులన్ ।
ప్రద్యోతంబుగ శుద్ధభస్మమయతిర్యక్పుండ్రముల్మేనశో ।
భాఢ్యంబ్రమ్యుతముగాఁధరించి శశిదభ్రాసా ద్రక్షావృతిన్ ।
ఖద్యోతుండునుఁబోలెఁబొల్చిరిదివౌకశ్శత్రులయ్యిర్వురున్ ॥

గీ॥ ఉత్తమబ్రహ్మవర్చసముట్టిపడఁగఁ ।
బడగదాలుపుకోలము మేఁపరిహసమాయి ।
మాయివేలుపునకును విస్మయ మొదవఁగఁ ।
దవగతులువారొనర్చిరిద్దఱునుఁడవము ॥

క॥ ఫలపూరజామికంటక ।
ఫలసహకారామ్రపుష్పఫలపతితములో ।
ఫలములు మెసవుచుసల్పిరి ।
ఫలలిప్సన్దనుజపుణ్యఫలములుతపమున్ ॥

క॥ ఆకులత లేకయాసుర ।
సాకులతలునీప్రియాత్మజాతులువనలో ।
నాకులునమలుచునిల్చిరి ।
నాకులువిని మెచ్చఁగొన్నినాళ్ళునియతులై ॥

మ॥ ప్రమదంబొప్పఁబలాశరక్షమునకై ప్రాంచత్తపంబూనుటన్ ।
దమకావించుపలాశభక్షణమకృత్యంబంచు స్వీయాంతరం ।
గములందారసినిశ్చయించుకొనుటన్గాఁబోలుఁధీమంతుల ।
య్యమలాకుల్తినుటజ్జగించి జలమాత్రాహారులైరత్తఱిన్ ॥

మ॥ కినరోశ్క్రింతయులేక చిత్తములలోఁ గీలాలపానంబురా ।
తునకృత్యంబిదిసీతపశ్చరులకున్ శస్త్రంబుగాదంచుఁదా ।

వసులాకశ్యపపుత్రులిర్వురును సంభావించి యోయామే మొసం।
తస మెప్పన్దిగ్ద్రావిరయ్యె దనసర్ణఃపానముఁ గైతముఁ ॥

మ॥ అమలాంబుగ్రసనంబునున్విడిచి వాయ్వాహారులై కొన్నినా।
ళ్ళను గద్వేషణములుండి ముందుతమ సేయంబోవు మర్వారమై।
నమునన్ని హమెల్లచేతనులకుఁ వ్యక్తంబు గాఁదెల్పుచం।
దనుకఁ బొల్చిరి ఘోరమాతపముపోద్యన్నిష్ఠఁగావించుచోఁ ॥

మ॥ అవివ్యాని దినక్రమంబున విసృష్టాహారులై నిద్రిత।
క్షుధాదన్యాదికులై యెసంగుచుం బరంజ్యోతిస్స్వరూపుఁ శివుఁ
హృదయాబ్జ మునఁ గల్పి భక్త్యతిశయ చేపారం సేవింపుచుఁ।
నదివన్యంబున హస్త ఘన్మలు శుంభత్తన్మయావస్థులై ॥

గీ॥ దాంతులా కశ్యపాత్మజుల్ దగభజించు।
దైవతము వలెఁదామును స్థాణుభావ।
మందియానార సీతవాతాతపాది।
కమున నుఁజలింపకుండిరుగ్గాధవియతి ॥

శా॥ ప్రావృట్కాలములందు నాకుబయల న్బాంచత్తిరత్రిఁ నిల్చిన।
ద్భావఁబొప్పవిదాఘకాలముఁ జ్వలత్పంచాగ్నిమధ్యంబునం।
దావాసంబొనరించి సీతుగాలులందాకం దపూర్ణోదకం।
బౌవారాశయమందు నిల్చియుఁడపస్యఁ సల్పిరప్పూరుషుల్ ॥

గీ॥ ఇట్లతివ్యథకోర్చి పెక్కేండ్లు ఘోర।
తపము సల్పిన కశ్యపాత్మజులయందు।
ప్రయతనిజపాదపద్మనిర్వ్యాజభక్తి।
భరులయందనిదంపూర్వారుణుఁడగుచు ॥

సీ॥ వాఁడువీఁడనకయ న్వ్యాజభక్తిఁ భజించుపులకాసునై ననుబ్రోచువాఁడు
వాఁడు బుధకోటి మోవనొనర్చుచు సుప్రార్థనలకు నగపడని వాఁడు

వాఁడు చేరఁగలయావసరముం దైన లేనగవుచే నొప్పు నెమ్మొగమువాఁడు
వాఁడు కనత్ప్రతిద్వంద్వమౌ ముమ్మొనవాలు కరమ్మునఁ గ్రాలువాఁడు
నాఁడు నేఁడును నొక్కచందమగురూపు ।
వాఁడువీఁడుతిగనుగూల్చివైచినట్టి ।
వాఁడుతూఁడుదిండిహరుమాయి రేఁడునుసిరి ।
జోడుగూడుదొంయు మెచ్చుచొప్పువాఁడు ॥

సీ॥ పృథుతరవేధోండపిఠరసహస్రముల్ కుక్షిఁదాల్చిన జగద్రక్షకుఁడు ।
స్థావరజంగమాత్మకమైన జగమెల్లనిండియున్నట్టి యఖండమూర్తి ।
యచ్యుతబ్రహ్మాదులందఱికంటెను నాద్యుఁడై యొప్పు మహామహుండు
పుణ్యమహర్షి హృత్పుండరీకమ్ములందు వెలుఁగుచుండు నచ్ఛవిపుఁ
దైత్యులాదిత్యులనెడు భేదంబులేక । [జ్యోతి ।
నూనభక్తి భజించునెవ్వానినైన ।
సాఁకఁజేత్తువహించిన సర్వసముఁడు ।
త్రినయనుఁడు వారికప్పుడైంద్రియకుఁడయ్యె ॥
గీ॥ ఎదుటఁబ్రత్యక్షమైన సర్వేశ్వరునకు ।
నధికతరభక్తికంటకితాంగులగుచు ।
వడివడిననేకసాష్టాంగవందనంబు ।
లాచరించి యిట్లునుతించిరప్పరముని ॥

దండకము॥ వందే శ్రియా భాషయా చాపరాభిస్సమగ్రాంగనాభి
స్సదాసేవ్యమానాం పరాం దేవతామీశ్వరీమాదిశక్తిం ప్రభూతేన హార్ద్రే
నపాఙ్గే కృతాం లాలయంతం దయాధిక్యక్ష్ణే జపేన స్మితేనాదరప్రే
క్షితైర్భాషితైశ్చాపి శాపాయుధగ్రామణీభిర్వశిష్ఠాత్రివల్మీకభూగౌతమా
గస్త్యశాండిల్యమాండవ్యజాబాలికణ్వాదిభిస్స్తూయమానం త్రయీవాగ్భి
రుచ్చావచాభిర్హృషీకేశ లోకేశ నాకేశముఖ్యామరారాధనావిష్టేయమా

మాహాత్మ్యమీశం భవంతం పశూనాంపతే తత్వతో బోద్ధుమజ్ఞః కథం స్యాం సమర్థోహమధ్యాత్మవిద్యారహస్యార్థసంవేదిభి ర్యోగిభిర్యోపర్యుపస్పృగ్నా కాశసూర్యేందు యజ్వాత్మరూపాష్టమూర్తిం భవంతంవినా నేతరత్కించిదస్తీతి సర్వాత్మనాభావ్యసేవ్యం జగద్వర్గసర్గస్థితిధ్వంసకృత్యాని సంకల్పమాత్రైర్నిఘ్నాని తేభ్యో భవానీపతే బాలశీతాంశుమౌళే భవత్పాదపంకేరుహోపాసనైకాగ్రచిత్తం మృకండాత్మజం బాధమానే కృతాంతే తదాశాస్త్రిద్ధదేవాద్రిభేద్యద్యమాం రక్ష మాంబికానాయకేత్యుచ్చకైః ప్రార్థనాం కుర్వతష్షోడశాబ్దస్య బాలస్య తస్యాగ్రతస్సంప్రభూయాంఘ్రిప్రతాడనేనాంతకం తం పరాసుం విధాయానుకంపాతిరేకాదరక్షద్భవాంస్త్వం కుమారం పురాదైవతైర్దానవైర్మథ్యమానాత్పయోవారిధేరుత్థితేనాతిభీదాయినా కాలకూటేన సంవర్తకాలీన వైశ్వానరేణేవ సంపీడితానాం భవద్రక్షణం వాంఛతాం తన్మహాపక్రివాద్ధావతాం చక్రిహస్త్రాదికానాం పురస్సన్నిధాయాసురేభ్యోమరేభ్యో వితీర్యాభయంతం యథాజాంబవం పంచశాఖేన సంగృహ్య కింతేన్యథాస్త్వంఖలుత్వాన్సమోస్యో నకోపీశ్వరోహ్యస్తి దేవాదిదేవం జగన్నాటకే సూత్రధారిం శరచ్చంద్రకాకుందమందారమందాకినీహారనీహారహీరేందుపాటీరవాగ్భామినీకాశనీకాశ గాత్రిబలీవర్దపత్రిం సదాత్వాం ప్రపద్యేమ మాగాంసి విస్మృత్య మాంపాహి మాంపాహి సర్వేశ సంరక్షితావాపినాకిన్ పినాకిన్ నమద్భక్తవర్గైకపాలిన్ కపాలిన్ ద్విషల్లోకమర్దిన్ కపర్దిన్ నమస్తే నమస్తే నమః॥

క॥ వాహాయిత మాహాహిత ।
బాహాధృతవరపినాకభవ్యమహీభృ ।
ద్దేహాసితదేహాజిత ।
మోహాయతసూహాసకు మ్రొక్కెదనీశా ॥

న్నటితనమందె నిర్దయమనస్కులునై దుగపిల్లనాకులం।
గటకనికెన్ ప్రతీపమయి కర్కశదైవము నిన్నుఁదారకా॥

చ॥ బుధజనగర్హితంబయిన పుట్టువునన్ దగురోఁతపుట్టియా।
యధమశరీరమున్ దొలఁగనాస్థఁగడంగితి కాకవిష్టప।
క్రథనమె యాత్మకృత్యముగ రాజిలునప్రతివీరుఁడైనదం।
డధరునెఱింగియుండియు దృఢంబుగనింతకు సాహసింతువే॥

మ॥ శమితానేకమృగవ్రజంబగు మహాశార్దూలరాజంబువా।
నముగావించుచునున్న కొండగవినార్షభ్యంబుదాఁజొచ్చుచం।
దమునన్ జన్మిపరాసనంబె నిజకృత్యంబైన నాబారిక।
గ్గకువై వచ్చితి వెందుబోగలుగుదింకన్ దైత్యవంశాధమా॥

క॥ తిలకింపుము మదధిష్ఠిత।
ులాయమె తుపాకిమందులోఁగాలినయిం।
గలతువలె రూపుమాపుర।
బలలాశనకులజనీదు బలముల నెల్లన్॥

క॥ అనవుడు లేనగవానన।
ముననొలయగ యాతుధానముఖ్యుఁడుఁగుదెదా।
ల్పునకనియె వర్షుకఘనా।
ఘనరసితమును నిరసింపఁగలుగు నెలుఁగుతోన్॥

చ॥ నలినభవుండు నిర్ణయమొనర్చిన యాయువునెల్లినట్టిదే।
హులయసువుల్ హరించుటయె యొకమహత్తరవిక్రమంబుగాఁ।
బలుమఱునుగ్గడించెదవు బాఁదితిఁజచ్చిన పాము నేనుదో।
ర్బలమునననంచు మెచ్చుకొనుపౌరుషశాలిని బోలితంతకా॥

చ॥ తనువులునొవ్వఁ దండ్రియుఁనుఁ దల్లియునేడ్చుచునుండఁ బిడ్డలన్।
బెనువగగూరియాంధ్రుడు విలపించుచునుండఁగ భర్తలన్ బరా।

సనమొనరించి తెచ్చుటకుఁ జాలిమొకింతయు లేదుగానిభం ।
డనముననిన్ను మార్కొనఁగడంగిననాపయిఁ జాలివుట్టెనే ॥

క॥ ఓదుంతరవుతనీయు ।
దైవ్యదర్థ్యంబెట్టిదో విదితముగాకున్నన్ ।
నీదగునాత్మశ్లాఘా ।
వైదుష్యముమాత్ర మెఱుకపడె వాక్ప్రౌఢిన్ ॥

మ॥ ములుకుల్ విల్లొని నిల్చియుంటివిదెనీమ్రోలన్ మృషాభర్త్సనం ।
బులతున్ భీతిలిపోహటింతుననినీబుద్ధిన్ దలంతేమొనిన్ ।
గలనన్ మార్కొనకేగనికర్మముగ విక్రాంతుండనా దేనిర ।
జ్జులచేఁగాలముపుచ్చకాలమునవీ శూరత్వముల్ జూపుమీ ॥

గీ॥ నావుడు సమర్థమున మోము జేవురింపఁ ।
జుఱుకుచూపులఁ దారకాసురునిమీఁద ।
నొలయఁజేయుచు నొక మేటివిలుగయికొని ।
యతిదృఢంబగు నల్లియనటనిఁగూర్చి ॥

ఉ॥ నేఁడుడివోక నాయెదురనిల్చుటకోపుదువేని నామునే ।
వేఁడిమికొంతచూడుమని వేఁడివెలుంగు కొమారుఁడేత్తెఱన్ ।
వాఁడిలకోరులాదితిజవర్యుని కాంచనదంశనంబునన్ ।
గాఁడనడర్చి తారకుఁడకంపనుఁడై నిలుచుంటకుగ్రుఁడై ॥

మ॥ మగుడన్ దండధరుండు తారకుని నొంపన్ దీవ్రనారాచముల్
నిగుడన్ జేసిన శౌతభల్లముల నన్నింటిన్ దునెల్ సేసిలే ।
నగవాస్య బుననొప్ప నప్పులలభుజాన్ధుండు ఘోరంపుటా ।
శుగముల్ నాల్గడరింపవానినడుమన్ జూర్ణించెఁ గీనాశుఁడున్ ॥

క॥ ఇత రేతరప్రహితవిని ।
హతులన్ గొంతదనుకన్ గృతాంతసురద్వి ।

ట్పతులిరువురు బోరిరివి।
స్మితమై యుభయబలముఁ సమీక్షింపంగన్ ॥

క॥ ఆపగతునిఁ గనుఁగొనిహ్రాద।
యాపగతక్లాంతియు నధికామర్షుఁడునై।
యాపగలుతేని కొడుకొక।
యాపగమై నెత్రువాఱనాతని నేసెన్॥

ఉ॥ అశరవీరరత్నముగు నాబలియుండుడివోవకోర్చివం।
చాశదజిహ్మగంబులు వెసంబరగించిననొచ్చి దక్షిణా।
ధీశుఁడువానిపోటెద నుతింపుచుఁ గల్పవిభావసుప్రతీ।
కాశములైన క్రూరవిశిఖంబులఁ దాఁగకునొంచెఁ దానునున్॥

ఆ॥ దానఁగినిసి యాతుధానేశ్వరుండొక।
వెడఁదవాతియమ్ము వింటఁదొడిగి।
గుదియతాల్పువింటి గొనయంబునడిమికిఁ।
దునియనేసె దుర్గ్రహుండల్ కలంగ॥

ఉ॥ వేఱొకవిల్లువూను తెఱపిన్ రజనీచరనాథుఁడేసెనా।
మాఱుతుమీఁద నొకక్రూరశితమార్గణమయ్యది వారవాణముఁ।
దూఱియరుంతుదంబయిన నొచ్చి సుమాళము జెంది యంతలో।
దేఱియవాగ్గిగీశ్వరుఁడతిప్రతిఘాన్వితచిత్తవృత్తియై॥

ఉ॥ శంబసుదర్శనాది సదృశంబసుహారియునైన ఘోరరో।
పంబినసూనుఁడుగ్రుడయి పంబిన యేడ్తెఱఁజద్భితంచునే।
యంబరమర్నిరీక్షమయి యంబరమందు నిజస్ఫులింగవా।
రంబొలయంగ మీఁదికడరం బొలదిండులతేఁడ కంప్రుఁడై॥

క॥ నిండుతెగదీసి యొకక్రూరప్ర।
చండముగుప్తశరముఁ వెసంబరపుటయున్।

షండుచునదిచని ప్రతిశర ।
ఖండన మొనరించెఁ జము మొగము వెల్వెలఁబోన్ ॥

శా॥ త్వష్ట్రప్రాణులు ధర్మతారకులు గాంధర్వంబు యామ్యంబువా ।
యవ్యంబైంద్రము వైష్ణవంబజశిరం బాగ్నేయమున్ లోనుగా ।
దివ్యాస్త్రంబులఁబోరిరిద్దఱును మూర్తింగొన్న రౌద్రంబొనా ।
గవ్యాప్తిద్వయదూరమాకసమునన్ గ్రమ్మన్ స్ఫులింగచ్ఛటల్ ॥

చ॥ ఒడికమెలర్ప బత్తడికనుండి వెలార్చుటకార్ముకంబునన్ ।
దొడుగుట గోచరంబులుగ దుర్వారదనస్త్రములెల్లఁ ద్రుంచుచున్ ।
నడుమఁ బృథగ్విధప్రహరణమ్ములు పైనడరించి నొంచుచున్ ॥
గడునలయించె నప్పుడుగండడగు తారకుఁడాకృతాంతునిన్ ॥

చ॥ అనితరసాధ్యుఁడై తనరు నాశరవీరుని యంపపోటులన్ ।
దనువున నెల్లెడన్ రుధిరధారలు సారెకులై స్రవింపగా ।
వినతనయుండు కాపెసెలయేళ్ళఝరంబులతోడి యంజనా ।
వనిధరమోయనంబొలిచె వాహనమైన కటాదమాళ్ళిపైన్ ॥

ఉ॥ పటులచెననీకమున నెంతయు నొచ్చియు నప్పరేతరా ।
ట్పోటమునన్ బొసంగుసడి కోర్వగఁజాలక నొచ్చుకొంచుఁబో ।
రాటము పౌరుషంబునకునై యొనరింపుచునుంటఁజూచియ ।
మ్మేటిమగండు తారకుఁడు స్మేరముఖుండయి యప్పుడిట్లనెన్ ॥

ఉ॥ మిక్కిలి డస్సినాడవు సమీకము సేయుటమాని కొంతసే ।
పొక్కెడవిశ్రమించి మఱియొక్క బలాఢ్యునిఁ గయ్యమాడనా ।
దిక్కునకంపి నీయలఁతదీఱినపిమ్మటరమ్ము క్రమ్మఱన్ ।
నిక్కపుమాటవాకొనెద నిన్నిక నేయనచుమ్ము శాంతునిన్ ॥

చ॥ భువిపయి రాజవంశమునఁబుట్టినదోసమునన్ బ్రతిజ్ఞులై ।
నెవడినమిమ్ముబోంట్లనవినీతుఁడనన్లైదిరింప నుద్యమిం ।

పవలసివచ్చె నిన్నిటుశ్రమంపడఁజేయుటకుమ్మలింపకో ।
రవిసుతయింక నాయెడఁదిరంబగు సౌహృదముంచుమీఁదిన్ ॥

వ॥ అనుటయుఁ దారకునకు నరుణదారకుండిట్లనియె ॥

మ॥ చిరకాలార్జితమా తపస్సుకృతరాశిం బుత్రరూపంబుగా ।
నరవిందాసనునబ్బురంపరపుమాహాత్మ్యంబుచేనొప్పన ।
ప్పరమర్షీశ్వరుఁడమ్మరీచిసుతుఁడుత్పాదించెఁ దథ్యంబుగా ।
కరయన్ నీవొక దైత్యమాత్రుఁడవె లోకాతీతదోర్విక్రమా ॥

గీ॥ పుడమి నాలుగుచెఱఁగులు గడిమిఁ గెల్చి ।
యేలుసార్వభౌమునినైననీసడించి ।
పేదమెకమునువోలె దెప్పించునాకు ।
నళుకరితనమ్ము సంప్రాప్తమయ్యె నిపుడు ॥

శా॥ ఏనన్నింటఁ బ్రగల్భుఁడన్ మదధికుండెవ్వాఁడు లేడంచుమ ·
స్థానంబూనుట యెంతవానికి ననర్హంబంచు మాబోంట్లకున్ ।
జ్ఞానంబున్గలిగించు పొంటెఁదను భృత్సందోహసర్గాపరా ।
చేనుండా పరమేశ్వరుండు సృజియించెన్ నిన్ను శూరాగ్రణీ ॥

చ॥ దిశలమముంజయింపఁగలదిట్టలు లేరని విజ్ఞపీగుమా ।
దృశులకుఁ గర్వభంగమొనరింపగవచ్చిన బాహువీర్యక ।
రక్షుఁడవటంచెఱుంగకలుకన్ నినునొక్కవిభావరీచరా ।
పశదునిగా నెదందలఁచి పల్కితిఁగొన్నియనుత్తమోక్తులన్ ॥

క॥ నాయతివాదముమఱదిఘృ ।
ణాయత్తస్వాంతుఁడవయి యసురపదిబృథా ।
నాయర్పించుచునున్నయు ।
పాయసము గ్రహింపు మాప్తభావమెసంగన్ ॥

వ॥ అనిపలికి ॥

శా॥ ఇచ్చెన్ దారకుతోడుతన్ జెలిమి హాయిన్ గోరుచున్ విక్రమ।
స్వచ్ఛంబుండగు నాసురారికి మహావాచీన వారాశిజ।
స్వచ్ఛానల్పమహార్ఘమౌక్తికమయంబై యొప్పుచున్నట్టిదే।
వచ్ఛందంబొసఁగెన్ బ్రదేశనముగా వైవస్వతుండత్తఱిన్॥

వ॥ మఱియు మహాధనంబులగు రతనంబులును, నధికతరతారుణ్యలావణ్యచాతురీభాజనంబగు భుజిష్యాజనంబును, నుచ్చశిలోచ్చయోపమేయంబగు స్వాపతేయంబును నొసంగినం గైకొని చీఁకటిసూడుచూలిచే వీడుకోలువడసి గీర్వాణరిపుతల్లజుండెల్ల రాణువలతో నమరవల్లభజిగీషుండై సమరంబునకు నమరావతీపురాభిముఖుండై చనియె నప్పుడత్తారకాసురుని యసాధ్యత్వంబు నివేదించుటకై శ్రీదాదులు గోత్రభేదిపాలికి సందేశహరులననుపుటయు వారందఱు నైకకంఠ్యంబుగాఁ బురందరుతో నిట్లనిరి॥

ఉ॥ దైవతసార్వభౌమ వినుతారకుఁడంచొకరుండు మమ్ముజ।
న్యావనినోర్చి నిన్నుఁ జెనయన్ జనుదెంచుచునున్నవాఁడు చే।
లావును నేర్పునగ్గలమలంతులఁబోయెడువాఁడుకాఁడునా।
డీవును నోర్వఁజాలవనుమీ సురసేనలతోడఁగూడియున్॥

శా॥ బాహాశక్తిసమృద్ధినేరికెదిరింపన్ రానివారిన్ జగ।
ద్ద్రోహైకవ్రతులం మహాసురులమున్నున్మాడె నేఁడమ్మహా।
మాహాత్మ్యున్ వనమాలిఁ దోడ్పడుటకున్ బ్రార్థిందియప్పీరుఁద।
త్సాహోయ్యంబునఁ గెల్చినిల్పుకొనుమీ స్వారాజ్యమున్ వాసవా॥

చ॥ వలయునె దైత్యమాత్రుఁ గెలువన్ హరిసాయమటంచు నెక్కటిన్।
దలపడె దేనినొచ్చెదవు తథ్యముమానుడి నమ్మితప్పక।
బ్బలియునడంపనాశ్రితకృపాళుఁ జనార్దను నాశ్రయింపుమీ।
గెలుపొనగూడునట్లయినఁ గేశవదేవుననుగ్రహంబునన్॥

వ॥ మేము స్వానుభవంబున నతని యతిలోకబలపరాక్రమంబుల తెలుంగులెటింగియుండుట నింతయొత్తిచెప్పితిమి మీఁదనీచిత్తంబని తమ మాటలుగా నీతోడవిన్నవింపఁగిన్నరేశ్వర శ్రాద్ధదేవాదులు మమ్ముఁబుత్తెంచిరింకముదలయిచ్చెదేని పోయివచ్చెదమని వాక్రుచ్చి దూతలాతె అకంటిదొరచే ననుజ్ఞాతులై తమతమమనికిపట్లకుఁ బోయిరనంతరంబ॥

ద్రుతవిలంబితవృత్తం॥ ఉపనిషన్నిగమాఘపనాయితా।
కపటహృన్నిమిహికాతపనాయితా।
ద్విపమహాసుర వృత్రసుధాకరా।
యపరిమేయమహామహిమాకరా॥

ఇంద్రవజ్రావృత్తం॥ వారాశితూణా కరవల్లదేశా।
పారాశరీంద్రాశయపద్మహంసా।
హీరాభదేహా వృషభేంద్రవాహా।
వారాణశీపట్టణవల్లువాసా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకాపచయం
బునందు షష్ఠా
శ్వాసము.

---

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## సప్తమాశ్వాసము.

క॥ పవనాశన మణిభూషణ।
పవనాశన ప్రమథిత ప్రసవసాయకసం।
జవనాయిత లసదానం।
దవనా శివ నాగచర్మధర విశ్వేశా॥

వ॥ అవధరింపుము శౌనకాదులగు మహాత్ములకు రోమహర్షణసుతుండిట్లని చెప్పందొడంగె॥

శా॥ నాకిస్వామికడన్ విపన్నుఁడయి యానక్తంచరుండెంతవా।
డో కాకుండిన నేల తెల్పుదురు నెయ్యుర్వింతగానింతగా।
వైకుంఠంబునకేగి దిక్పరిబృఢుల్ వాక్రుచ్చినట్లంచిత।
శ్లోకున్ శ్రీహరినాశ్రయించెదనటంచున్ నిశ్చితస్వాంతుఁడై॥

శా॥ ప్రోడల్ విశ్వులు సిద్ధసాధ్యతుషితుల్ రుద్రుల్ మహారాజికుల్।
కూడన్ రానవిజేయునిర్జరవిపక్షున్ దారకున్ బోరఁము।
న్నాడన్ రమ్మని వేఁడుకొంటకయి దైత్యారిన్ రథాంగాయుధున్।
జూడన్ బోయెఁదదాలయంబునకు నాసుత్రాముఁడుద్విగ్నుఁడై॥

సీ॥ స్థిరనిగృహీత హృషీకులై యడవులందపములొనర్చిన ధన్యతములు।
విశ్వజిద్రాజసూయాశ్వమేధాదులౌ జన్నముల్ జేసిన సాధుశీలు।
రుద్రాధరాహిరణ్యాదనాద్యంహాతుల్ నిచ్చలునల్పిన నెఱవిడువరు।
లాదేహపాతమవ్యాజభక్తినధోక్షజుని నుపాసించిన సుప్రయతులు।
లోనుగాగల విష్ణుసాలోక్యముక్తి।
నొందిన మహాత్ములుండిన యుత్తమోత్త।
మంబులగు దివ్యరత్నహర్మ్యములవీధు।
లలరువైకుంఠమునఁజొచ్చె హరిహయుండు॥

శా॥ చావుల్ విస్రసలామయంబులు మనస్సంతాపముల్ శోకముల్।
లావాదేవులుపద్రవంబులు వ్యథల్ దారిద్ర్యముల్ కష్టముల్।
లేవాలోకమునందుఁ జేతనులకాలిత్తాల్పకీటంబుగా।
నావారాశితనూభవాధవుని పర్యంతంబు నెప్పట్టునన్॥

చ॥ అచటికుటీరముల్ వ్వనిలయమ్ములకంటెను రామణీయక।
ప్రచురములచ్చటంగల వరాకులునున్ దనకంటె వైభవో।
పచితులునై యొసంగుటకుఁబాకి విరోధియపత్రపిష్ణుఁడై।
సచివులఁగూడి యబ్బపడసాఁగెను శార్ఙ్గిమహత్త్వకాత్మలోన్॥

శా॥ ఆయుచ్చైఃపదమందుఁబ్రస్తరనికాయంబెల్లఁ జింతామణి।
ప్రాయంబచ్చటిప్రాఁకులన్నియునుఁ గల్పప్రాయముల్ సర్వమా।
హేయుల్ కామగవీసదృక్షులునునై యింపొందియుంటన్ గనుల్।
వేయున్ జాలనివయ్యెఁ దద్విభవమున్ వీక్షింపనవ్వజ్రికిన్॥

సీ॥ ఎవ్వాటఁగాంచిననిండ్లన్నియుమహాధనోపలమయములౌనుప్పరిగెలు।
వెటఁదృష్టిఁబరపిన వెల్లనిషద్యలు లక్ష్మీవినోదఖేలాగృహములు।
నెచటఁజూచిననింతులెల్లఁదత్తాదృశోత్తమదృష్టిపర్వసౌందర్యఖనులు
నేవంకఁబొడగన్న నిలుతేండ్లనన్యజ శతగుణమంజిమ సంహననులు।

నెదొటఁదిలకించినఁ గొలంకు లెల్లజలధి ।
వితతపరిణాహములు ప్రాద్వప్రాభృతరసాలి ।
శాయిమాధుర్యజలములునై యొసంగఁ ।
బరగుఁ వైకుంఠము నేఁడు నప్పరమపదము ॥

మ॥ వనమాలి ప్రియవాసమైన యల శ్రీవైకుంఠమం దెల్లవా ।
రును సర్వావయవానవద్యశుభమూర్తుల్ గల్గియొప్పారుచుం ।
డినపుణ్యాత్ములె కాని యేయెడల నన్వేషించినన్ లేరటన్ ।
గొనటుల్ స్విత్రవిచర్చికాది వికృతాంగుల్ లేరుపోగండులున్ ॥

ఉ॥ వీవధమందుఁ గన్పడిన వెన్నునివీటి మహాద్భుతంబులా ।
పోవనిచూడ్కిఁ జూచుచు బుభుక్షుఁడుమున్నగు నాసుధాశనుల్ ।
పోవఁగఁబోవఁగా నెమట లోచనగోచరమయ్యె నబ్ధిక ।
న్యావరుఁడున్న దివ్యభవనంబహిమాంశుసహస్రదీప్తితోన్ ॥

క॥ అన్నగరిపుఁడనుయాతులు ।
నెన్నండును నెచటఁ జూచియెఱుఁగనివింతల్ ।
కన్నులు తనియఁగఁ జూచుచు ।
నన్నగరున నరిగి యరిగి యతిమోదమునన్ ॥

ఉ॥ రుద్రులుమున్నుగా ననుచరుల్ తనవెంబడి నేగుదేరన ।
య్యద్రివిరోధిదూఁకొనియె నచ్యుతదేవుని దివ్యసర్వతో ।
భద్రము పద్మనాభ పదభక్తవశీక్రియమాణసచ్ఛ్రుతు ।
ర్భద్రముఖేయవిస్తృతి నిరస్తసమస్తమహాసముద్రమున్ ॥

వ॥ అట్లు ప్రవేశించి ॥

సీ॥ అరివేరఁపుఁజడదారిమున్నగు తపస్వులు కేలుమోడ్చి ప్రస్తుతులొనర్ప ।
మొనసి విష్వక్సేనముఖసన్నిధానవర్తులు మడిచేతులఁ గెలననిలువ ।
నెకిరింతయగు తార్క్ష్యుఁ డెప్పుడు తనపనిగలుగునోయని చెంతఁగాచి
[యుండ ।

జగములన్నింటికిఁ జనయిత్రియగుపాలకడలి నెయ్యంపుఁగూఁతురడుగు
మేలయిన రేవెలుంగుఱా మేడలోన । [లొత్త ।
మణిమయంబగు కేళిసద్మమున నంచ ।
దూదిచువ్వంపుఁబాన్పునందు నెఱచెల్వ ।
మొప్పమెయిఁ జేర్చి పన్నుండియున్నవాని ॥

సీ॥ దగదగద్యుతులీనుమగఱాలమొసలివాయొంట్లు జానుగుఁదోయినొప్పు
[వాని ।
ద్రప్ప్యద్భృగంధంకరణముమానికపుఁ బొమ్మిడికముశిరముపై మెఱయు
[వానిఁ ।
ద్విడ్విశేషాక్రాంతదిక్కంబులైనయంగదములంసస్థాయిఁబొదలువాని ।
మునిమాపుకెంజాయకెనయైనపచ్చవల్వపరిధానంబుగావఱలువానిఁ ।
బ్రామినుకులు చంద్రమామనసోజాత ।
యనినయట్లు హృదయమునఁ బొడమెనో ।
ధవళకిరణుఁడనుచుఁ దత్రత్యులూహింపఁ ।
గౌస్తుభంబురమునఁ గ్రాలువాని ॥

చ॥ పయిదెసఁజూచు చెయ్యదియొ భావమునందలపోయువానిశ్రీ ।
దయితునిఁ గాంచిరప్పుడు శతక్రతుముఖ్యులు ద్వారపాలురా ।
జయవిజయాహ్వయుల్ వెలిహజారమునుండియు వెంటనేగిత ।
చ్ఛయనని కేతనంబుఁగరసంజ్ఞలఁజూపి యుపక్రమింపఁగన్ ॥

గీ॥ ఆత్మభూశతమోహనమైనయతని ।
మూర్తిఁదిలకించి నెమ్మేనుపులకలెత్త ।
నేటికోళ్ళుఁబెక్కులొనర్చి యిట్టులనిరో ।
నిక్కువీనుల సామ్రాణి నెక్కుఱేఁడు ॥ [తాయ ।

సీ॥ విహిత దుష్టాస్రభుగ్విజయ నిర్వాహాయ వాహాయమాన నాగాహి
విధ్వస్తదాసౌఘవృజినకలంకాయ లంకాయతాక్షీవిలాపనాయ ।

వారిజాతాప్తతుషారపాదాక్షాయ దాక్షాయణీదయితప్రియాయ।
సకలవేదోండరత్నకమహాహార్యోగాయ దార్యోగాయ నోత్తమస్తుతక
నాకివతాతిసత్కృపాలోకనాయ। [ధాయ।
లోకనాయకశ్లాఘితాలోచనాయ।
లోచనాయతనిక్కృతవల్గునలినాయ।
తేనమో భార్గవీనాథ దేవదేవ॥

సీ॥ నిఖిలవిధాత్రండనివహస్థితినిదాన దానవావశ్యాయతరుణసూర్య।
సూర్యనవరతసంస్తుతదీప్యదనుభావభావజాయుతసుషమావిశేష।
శేషసమాహ్వయాశీవిషేంద్రశయానయానతోపాత్తవిహంగరాజ।
రాజమణ్యాది రత్నమయాకల్పకల్పవిభావనూగ్రప్రతాప।
తాపసోపాస్యమాన పాదజలజాత।
జాతరూపమయాంచత్పశస్తవాస।
వాసకేశ్వరశతతేజ వనజనాభ।
నాభయముతీర్చి ప్రోవవే నాథనాథ॥

చ॥ అరయవు మాసుఖాసుఖములచ్యుతయొప్పరికింప న్యాయమే।
యరియొకరుండు తారకసమాఖ్యుఁడు దిగ్విజిగీషుఁడైధనే।
శ్వరశమనాములం గెలిచి స్వర్గముమీఁదికి వచ్చుచున్నవాఁ।
డురుతరవీర్యునద్దితిజునోర్చుట శక్యముకాదు మాకనిన్॥

చ॥ జగడములందు నేరికిని సాధ్యులుకాని నిశాటబీజ్యులన్।
జగదపకారకర్మతుల సంగరరంగమునన్ మగంటిమిన్।
బొగరడఁగించి శత్రుభయమున్ దొలఁగించుచునుండుమాకునే।
దుగడవునీవెకావెయెపుడున్ శరణార్థిజనావనవ్రతా॥

క॥ శిక్షింపుముద్ధతుండగు।
రక్షఃకులనాథునాజిరంగమునన్ సం।
రక్షింపుమార్తునన్నుఁగ।
టాక్షింపుము లెమ్మువడిఁ దనుయకనిపనికిన్॥

గీ॥ అనినిజప్రపదాబ్జద్వయంబుమీఁద।
వ్రాలిమొలపెట్టుచున్న గీర్వాణనాథు।
కేలుకేలఁదెమల్చి యాస్ఫాలనంబు।
మెల్లనవొనర్చుచనియె లక్ష్మీధవుండు॥

క॥ మగవాడివిడిచి వేలను।
డుగులీవిట్లాడనెన్నఁడుఁగా వినియెఱుఁగఁగా।
జగదేకదుర్నివారం।
బగునీదంభోళికెదురె యరులుఁగా గిరులుఁగా॥

చ॥ అని మొనసెట్టిబల్లిమలనైనఁ జయించుటకీవెచాలుదై।
ననెపుడుఁజిన్నపామునయినన్ జమపఁగాదలేఁ బెద్దకల్లితో।
ననెడు నవోక్తి చిత్రమునయందుఁదలంచినను సహాయుఁగా।
గొనియభియాతిపై నడరఁగోరితిమందిది సస్మతించితిక॥

క॥ వచ్చెదఁద్రివిష్టపమునకు।
వచ్చెదనాశరులనాజిరంగమునన్ నీ।
కిచ్చెదవిజయము నడలుం।
జిచ్చెదనిడికొనక దిటవుజెందుము మఘవా॥

వ॥ పురందరానీవు ముందరుగు మేనునీపిఱుందనవచ్చెద నాస్యంందనంబున నాతుండపరిమృజులమ్రుందించి నీకుంమఁడిందుపరచెదనని యనిమిషపతిననిచి గోవిందుండు సాంగ్రామికనైపథ్యాలంకృతుండై కౌమోదకీ శార్ఙనందకసుదర్శనంబులను నాయోధనసాధనంబుల శయచతుష్టయంబునం ధరించి నిజవాహనంబగు వైనతేయునిపై నధిరోహించి యభిసంపాతకౌతుకంబునఁ దనతోనే తేరఁజూచు విష్వక్సేనాదులరావలదని నివారించి రాకాసులమూఁకలతో ననీకంబొనర్చుటకై నాకలోకంబున కుంబయనంబమ్యో నంతకుమున్న తారకుండు సురసరిత్పరిసరంబుననసుర

విసరంబుల విడియించి వేగన్నులమన్నె కానికి విన్నవింపుమని కొన్ని గ
అపి యంగుడుమడిపి నొకని ననిపిన నాతండాఖండలుచండకుజజని పా
లనుదిండికొలపుమండనంబగు తారకుండు ఖండితంబుగా నీతో నాడం
బంచిన దండిపలుకులు కొన్ని కలవు వినుపింతు వినుమని యిట్లనియె ॥

శా॥ అన్నా యింద్ర జగచ్చతుర్దశ కథన్యాశ్చర్యకృద్భాగ్యసం ।
పన్నా నేనునుఁ గశ్యపాత్మజుఁడ వైమాత్రేయుఁడన్నీకునీ ।
విన్నాళ్లేలితి దాయ లెవ్వరును లేకీస్వర్గసామ్రాజ్యమిం ।
కన్నాకిచ్చితొలంగు డొండెడకు వేగన్ నీవునీవారలున్ ॥

క॥ డాఁపక నీభుజవీర్యము ।
ప్రాఁపునఁజూపని దె యదనుపొసఁగినయదిన ।
న్నాఁపుము నీకమరావతిఁ ।
గాఁపురముండవలెనన్న కొంతుఁయెయున్నన్ ॥

ఉ॥ మేటిమగండవంచు నిను మెత్తురనారతమిజ్జగమ్ములన్ ।
మాటవసించు సర్వజనముల్ దివిషత్కులసార్వభౌమయా ॥
మాటయథార్థమేని రిపుమండలినివ్వొఅపాటుఁజెందసం ।
స్ఫోటముసల్పి నీకడిమిచూపుము గన్గొని మెత్తు నేనునున్ ॥

చ॥ క్రతుభుగధీశనీవిపుడు కయ్యము సేఁతకుఁ జాలవేనిరూ ।
డితనని చెప్పి నీమునుగడించిన యర్థము లెల్లఁ గ్రవ్యభు ।
క్పతియగు శూరపద్మునకు పారముగా వరిసించి తచ్చమూ ।
పతులయనుగ్రహంబునకుఁ బాత్రమనౌటకు నేగుదెమ్మిటన్ ॥

మ॥ మదమానంబులు డించినీదు ధనముల్ మాతేనికి మ్మొండెనీ ।
త్రిదశానీకిను లెల్లఁ దోడుపడవిద్విడ్వీరులన్ శూరతన్ ।
గదనక్షోణిఁ జయింపుమట్లుభయథా గాకుండినన్ నీకుఁద ।
కర్దుసామ్రాజ్యము నమ్మనానుడువు నికర్ంబేను వాక్రుచ్చితిన్ ॥

వ॥ అనితనపలుకులుగానీకుఁదెలిపి రానను ననిచెనని దనుజవార్తా
హారుండు వినిచినవిని నిలింపపతి శిరఃకంపంబొనర్చి విహసితవ్రగహాయా
భువదనతోయరుహుండై రాయబారికిట్లనియె॥

ఉ॥ ఆయసురుండహంయుఁడయి యంతరమారయకాముపట్టివా।
తాయువు కేసరీంద్రమును దండడిడీకొనినట్లరాత్యవ।
శ్యాయవిభాకరుండయిన శక్రుని నోర్వఁదలంచె నేఁటితో।
నాయువుమూఁడెఁగాక దితిజాధముఁడింతకు సాహసించునే॥

శా॥ ఆయారాతుప్రభుఁజేరి చెప్పుమిటులేనన్నట్టులోవార్త్రికా।
నీయార్జించిన స్వాపతేయములనన్నింటికి ద్వాదాముష్మిక।
శ్రేయఃప్రాప్తికిఁ దానపాత్రులకు సంప్రీతిని సమర్పింపుమా।
కాయాపాయమవశ్యభావియగుటన్ వ్యగ్రాదలోకాధమా॥

చ॥ విసముశిరోధిఁదాలిచిన వేలుపు నీకభయాపవర్జనం।
బొసఁగి సహాయుఁడై యభిమరోర్వరనిల్చినఁగాని నీకునీ।
యసురవరూథినీతతికి నంతకుఁదప్పదు చావు నేఁడుమీ।
రుసురలచేతఁబెట్టికొనియుండుడు వచ్చెదమాజిభూమికిన్॥

క॥ అనినీవువోయి చెప్పుము,
దనుజాపశమనకునని యతనిననిపిజనా।
ర్దనదేవుని యాగమనం।
బునకు నిరీక్షించి యాంబుభుప్రభుడుండెన్॥

సీ॥ విష్ణుగంటులతేని వీటిగేస్తులకన్దావలకుఁబున్నమవలి వెలుఁగుపొడుపు।
నెఱజెండిపోతుమానిసిదిండిరాణువ దువ్వాకదలికకుఁ దూరజల్లు।
అడుగుఁ దమ్ములుగొల్చునతనికి ముగితిమకుట వగుబ్బెతనొసంగు కూకు
[దుండు।
సువిశాలమ్మైన నలువగ్రుడ్డుపేరఁబన్నిన నవగోజకునిట్టరాడు।

జిడ్డుమున్నీటిదొరకూర్మి బిడ్డనోము।
పంటఁబ్రాఁబలుకు- పెనుదారి బాటసారి।
పరమపదరాజ్యమేలెడుబాదుసాహి।
వచ్చెనసురావతికిఁ గిరమావల్లభుండు॥

శా॥ గర్వాంధప్రతివీరసంహృతికలం కర్మిణుఁడౌవిష్ణుఁడా।
స్వర్వాసుల్ ముదమందవచ్చుడు ద్విషత్సంహారవీరక్రియా।
నిర్వాహంబికనిశ్చయంబని యసందేహంబుగాఁ బొంగుచున్।
సర్వౌఘంబొనరించెఁ దారకజిగీషన్ వాసవుండత్తఱిన్॥

శా॥ దంశీవారము సాంద్రధూమతతిచేతన్ జచ్చునట్లామిషా।
ధ్వంశంబంతయు నస్మదీయనిశితాస్త్రవ్రాతఘాతంబులన్।
భ్రంశంబందెడునంచుఁ దోర్మదమెలర్పన్ జెప్పికొంచున్ దయ।
స్త్రింశతోఁ-టిసుపర్వులున్ వెడలిరుద్రిక్తాహవోత్సాహులై॥

సీ॥ నిరుపమప్రధనపాండిత్యులాదిత్యులు వైరితమోవిభావసులు వసువు।
లహితలోకాకారణాస్వరుల్ భాస్వరులలఘువిక్రమ పుషితులుతుషితు
సత్యపరాక్రమాసాధ్యులుసాధ్యులుపలభుగ్బలాటవ్యనలులనిలులు। [లు।
రిపువీరపిచుమాతరిశ్వులువిశ్వులు ప్రగుణాజికులు మహారాజికులును।
ప్రాసతోమరకరవాలపట్టసస్రుగ।
పరిఘశక్తిశతఘ్నికాశరశరాస।
నాదికములైన దారుణాభ్యాగమోప।
కరణములుదాల్చి వెడలిరి కయ్యమునకు॥

సీ॥ ప్రౌఢతరాభిసంపాతోచితంబైన నైపథ్యమును నూతనముగఁబూని।
యాయుధంబులకభేద్యంబుగానతికర్క-శతనొప్పువజ్రదంశనముదొడిగి
చంచలాలతవోని కాంచనమయశరాసనమునవ్యప్రవేష్టమునఁ దాల్చి
రత్నమయాపసర-రమయి యాజానేయతురగముల్ పూన్చినయరద
[మెకిర-

త్రిదశసీమంతినీలోకదృక్చకోర।
అవితశీతకిరణమండలాయమాన।
సంహననుఁడు జయంతుండు సమరమునకు।
వెడలె సురసాంయుగీనులు వెంటనడువ॥ [నర్వ।

సీ॥ ఏకకంఠ్యంబుగా నస్వప్నులుచ్చైస్స్వరముతో జయజయధ్వను లొ
వేధోండభాండంబు విచ్చునోయనునట్లు వాదిత్రతారరావము సెలంగ।
వశులనైనమనోజవశులఁదప్పక చేయఁబ్రతిభువులచ్చరపడఁతులాడ।
ప్రాంశుహర్మ్యంబులపైనుండి పుణ్యసువాసినుల్ దీవనసేసలొలుక।
బొల్లినెమ్మొగంపుఁబులుఁగుచౌదంతుల।
నెక్కి రిపుజిఘాంసయెసకమెసఁగ।
విష్ణుజిష్ణులపుడు వెడలిరి మూర్తమై।
వీరరసము బయలు వెడలినట్లు॥

క॥ పడమటిప్రాయేలునుఁ దొలు।
కడలియు నొండొంటిఁదాఁకఁగదియఁబడినకై।
వడిసురసేనలు రక్కసి।
దడములు నొండొరులమీఁదఁ దలపడిరలుకన్॥

శా॥ కుత్కీలంబులతోడ మార్కొను కులక్షోణీధ్రముల్ నోలెదు।
ర్వారాఖండీరులమీఁది కొండొరులు బంహిష్ఠద్విషద్విప్రకా।
రోత్కంఠాతిశయంబునన్ గవిసి రుద్రోద్యోగులై వీరపా।
శౌత్కట్యంబునఁ గ్రిందుమీఁదరయక య్యాదిత్యరక్షోభటుల్॥

సీ॥ పాఱవాయమ్ములువరపి మార్తురతపారులు నేలపైఁబడఁదులుచువారు।
వెడఁదవాతిలకోరులడరించి దాయలసిడపుకాములఁ ద్రెవ్వనడఁచువారు
వాఁడిజోడమ్ములు గాఁడించిసూడుల తంపరజీరాలఁ జింపువారు।
నెలవంకకోలలు నిగుడించిపగఱకైదువులను కేలనె తునుమువారు।

నగుచుఁ గృతహస్తులగు దానవాదితేయ।
కాండపృష్ఠప్రవరులు సంగ్రామకుర్ద।
నంబు పశ్యత్స్వయాపాదనముగఁ గొంత।
కాల మొనరించిరా కన్నెకయ్యమందు॥

మ॥ విలుకేలం గొనియున్న జోదులను ధన్విప్రాగ్రియుల్ రిష్టిహ।
స్తులనైస్త్రింశికులీఁటియల్ కరముల౯ శోభిల్లుచున్నట్టియో।
ద్ధలఁ గుంతాయుధులున్ శతఘ్నులను చేతంబూనియున్నట్టిది।
ట్టల శౌతఘ్నికులున్ గడంగి నుఱుమాడన్ దాఁకిరొక్కమ్మడిన్॥

చ॥ తెగిపడుపూర్వకాయములు ద్రెస్సియధస్థలిఁ గూలుబాహువుల్।
పగిలి తొరంగుమస్తకకపాలము లూడుప్రకోష్ఠదండముల్।
నొగిలి రణోర్విఁ వ్రాలియు మనోజ్ఞతఁ దప్పని విగ్రహంబులున్।
బగతురమానసంబునె కృపావరతంత్రముఁ జేసె నత్తఱిన్॥

ఉ॥ మిత్తిమెఱుంగు కోఱలకు మిత్తులనందగియున్న వాఁడివా।
కత్తులపోటులన్ దెగిన కాల్వురమేనులనుండి కాఱుక్రొ।
న్నెత్తురు కంఠకఘ్నగతి నిర్ఝరనిర్ఝరిణీమతల్లిసం।
పత్తిదిసంతుకొబ్బు పెనుబట్టియుగాఁ బ్రవహించె నత్తఱిన్॥

సీ॥ ప్రతివీరనిహతులై పడుకాలరులఁ వెన్కఁ ద్రొక్కి ద్రోపులన్ గూలిరొల్లువారు।
ద్విషదస్త్రపాతితద్విపరాట్కళేబరములక్రిందఁ బడి బిట్టునలియువారు।
శత్రుశస్త్రాహతిశ్లథపాతుకరథకడ్యల యధస్థలి వ్రాలి యలయువారు।
పగఱకైదువుపోట్లఁ దెగికూలుకత్తలానులయడుగునఁ బడినొచ్చువారు।
నైతుములముగ నస్వప్నయాతుధాన।
పృతనలిరువాఁగునుం దాఁకి యతిభయాన।
కంబుగా నొనరించిరి క్రందుకయ్య।
మెల్లచూపఱయుల్లముల్ తల్లడిల్ల॥

గీ॥ అట్టిసంకులసమరంబునందు మేలు ।
చేయియై దేవతాభ్యమిత్రీయులసుర ।
సేనలఁదెరల్చుటయును సేనానులైన ।
దుర్జయపిచండశూన్యకేతుప్రభృతులు ॥

చ॥ మెకమెకపాటుమైఁబులులు మిక్కిలియుద్ధతినౌత్సుకంబుమీఁ ।
దికుటికినొంచుచాడుపునఁ దేవవరూధినిఁ బిట్టుతాఁకివా ।
రొకఁడొకఁడాద్విషద్భటుల నొక్కనినొక్కని నొవ్వనేసిరు ।
గ్రకులిశసంప్రహారనిభఘాతములైన పదేసి తూపులన్ ॥

క॥ తెఱగఁటిజోదులపుడునుఁ ।
బిఱుతివియక మోహరించి స్థిరశౌర్యమునన్ ।
నెఱకులునొవ్వఁగఱకుటం ।
పఱఁబరపిరి రక్కసీఁడు పడవాళ్ళపయిన్ ॥

క॥ చనిరి చమూపతులు విజయుఁ ।
డును ముసలియునుగ్రబాహుఁడును శుచివక్త్రుం ।
డునుఁగంటకుఁడును ఖరముఖుఁ ।
డునుఁదమవారలకుఁ దోడ్పడుటకురవడితోన్ ॥

శా॥ ఆరక్షోధ్వజినీశులట్లొకటియై జ్యారావఘోరంబుగాఁ ।
జేరంగన్గొని మోహటింప కలజేజేజోదులుగ్రాశుగా ।
సారంబున్ గురిపించి వారిరథముల్ సంఛన్నముల్ సేయుచున్ ।
వీరాశంసనమందునిల్చి రరులవ్విక్రాంతికగ్గింపగన్ ॥

ఉ॥ మీఁదికివచ్చు నమ్మలను మింటనె తున్ముచు సోఁకుఁజేర్వకాం ।
డ్రూఁదరవెట్టినట్లొకటనూపిరివీడువసీనియేడ్తెఱన్ ।
జీఁదఱవెట్టినొంచిరి ప్రశిద్ధములైన మహాయుధంబులన్ ।
మోఁదియధృష్యులన్ సురచమూభటులన్ దలవారి నెల్లగన్ ॥

మత్తకోకిల॥ దానవోచ్చియు నంతఁబోవక దండతాడితభూరికుం ।
భీనసంబులువోలె రోజుచు భీకరప్రతిఘంబునన్ ।
దానవారిభటుల్ యుగాంతధనంజయోద్ధతకీలలన్ ।
బోనిక్రూరతరాయుధంబుల మొత్తిరారిపువీరులన్ ॥

ఉ॥ కండలురాల్చియున్ భుజయుగంబులుగూల్చి యునుత్తమాంగముల్ ।
చెండియుఁగర్భగోళములుచించియుఁబకరులుప్రకరలించియున్ ।
గుండెలువ్రచ్చియున్ సిరలుగోసియుఁ జేరువకాంద్రనెల్లఁబో ।
గండులఁజేసిరబ్బలుమగల్ రజనీచరసైన్యనాయకుల్ ॥

* మేఘవిస్ఫూర్జితవృత్తం *

పరాభూతానేకప్రబలరిపుదిక్పాలుడౌ తారకుండా ।
సరాదైయుంటన్ మున్నమరులనినన్ సాధ్వసంబందుదైత్యుల్ ।
నిరాతంకోద్వృత్తిన్ నిలిచియపుడానిర్జరవ్రాతమున్ భీ ।
కరాభ్యామర్దక్షోణికిఁబోలఁచిరుగ్రంపుచేలావెలర్పన్ ॥

ఆ॥ పొలసుదిండ్లయంపపోట్ల మోలాకునఁ ।
దలకివారిమెదుర నిలువలేక ।
మోలమాసగొని స్వాయువరాజునరదము ।
వెనకనొదిఁ గిరమరవీరభటులు ॥

క॥ సిబ్బితిలేక సురులచేఁ ।
దెబ్బలుతిని పఱచితనదుతేరి పిఱుందన్ ।
గొబ్బునఁడాఁగినసురలకు ।
నబ్బురపడుచున్ బురందరాత్మజుఁడనియెన్ ॥

ఉ॥ మానిసిదిఁడ్లు నవ్వ నవమాననకోరిచి పాఱిపోకుడీ ।
యేనిటనుండమీకు వెఱపేటికిమిమ్ముఁదెరల్చినట్టిసే ।

నానులముస్ను నెల్ల మదనర్గళదివ్యశరోత్కరంబులన్ ।
లూనముసేసి మీకిదె విలోచనపర్వమొనర్తుఁ జూడుఁడీ ॥

చ॥ తొలకరినూడువాపురఁపుఁమంమడఁకీపలలాశ్యనీకినీ ।
తులయళికంబులందమరశూరులనెల్ల రణాంగణంబునన్ ।
గెలువుడటంచు వ్రాసినను ఖేచరులార మదీయబాహుకా ।
శలమున నాలిపింమడిచి చంపుమఁదైత్యులనెల్లఁ బ్రేల్మిడిన్ ॥

తరల॥ జరయుఁజావును లేనిదుస్సహశౌర్యులఁ మనవారలఁ ।
దురమునందు నిశాచరాపశదుల్ సజన్మజరావృతుల్ ।
పరిభవించి జయించిరన్నయప్రథఁ విని రేనిన
వ్వారె జగంబులనన్నిఁటంగలవారలెల్లఁ గికాగిఁ ॥

క॥ అనిపలుకుపురందరనం ।
దనునుడివిని పుచ్ఛడీకత్రనము కతనవం।
చినమొగము లెత్తకయయి ।
ట్లనిరి చదలు ద్రిద్మరుల్ జయంతునితోడన్ ॥

ఉ॥ త్రుంగుడు సావివైరవులతోరపుమంటలకన్న మిన్నలౌ ।
గొంగలయాయుధప్రతతి కోఁతలకగ్గములై శిరశ్కరా ।
ద్యంగములెల్లఁ గాయపడ యాతనపాలయి యేడ్చుచుంటకం ।
తెంగడుమేలెయా మృతిఘటిల్లమిగాని పులోమజాత్మజా ॥

క॥ మున్నసురులతోఁ బవరము ।
లెన్నియొచేసితిమికాని యిట్టితెఱఁగునన్ ।
బన్నముపడి యెఱుఁగమునుమి ।
యన్నాయువరాజ తొంటియాహవములలోన్ ॥

గీ॥ అనియనను భూతపూర్వమా నభిభవంపు ।
టలఁమరుననుస్మరించు నయ్యాది తేయ ।
వీరభటులఁ గలయఁజూచి వృషతనూజుఁ ।
డకఁసమునకఁసును హృదయమునఁబెనఁగ ॥

గీ॥ ఓయసురులార యక్తదైతేయరక్త।
సాయకంబులతోవచ్చి మీయొడళ్ళ।
గాయములనొక్క త్రుటిలోనమాయఁజేయు।
జాయువుగఁ దద్రుధిరమును బూయువాఁడ॥

క॥ పారకుఁడని శచినెయ్యఁపుఁ।
దారకుఁడనిమిషులమునికిత్రముమానిదియా।
శూరకులశిరోరత్నము।
తారకుని చమూపతులను దాఁకెనురవడిన్॥

ఉ॥ బాలకుఁడయ్యు శౌర్యమునఁ బ్రౌఢతరుండనువిప్పఁగంటిరా।
చూలిపురస్థితంబయిన పోఁకుఁడుఁజోదుల పిండునెల్లఁబై।
డాలపుఁజూపుఁదూపులనె డాకొని దగ్ధముసేయువాఁడునుం।
బోలెఁజరీలునంగపిసి పోతుడటంచదలించి పల్కుచున్॥

ఉ॥ నాలుకలుక్రోయుచిల్వలాయనందగిమార్తుశప్రాణమారుతం।
బుల్కబళింపఁజాలినయమోఘములైన వెడందవాతులా।
ములుకులు నాల్గునాలుగుగముందుగనేసెఁజయంకుఁడప్డుక।
ట్టలుకనజిహ్మగాగ్నికభియాతులనాహుతిసేయకాయ్యెనన్॥

క॥ ఆవెడఁదవాతియమ్ములు।
మేవడిఁ డప్పించుకొని గమిచరశస్త్రి।
జీవప్రష్టులయినయా।
ళీవక్త్రుఁడు లోనుగాఁగలిగినట్టిడిణులిన్॥

ఉ॥ పందలఁగొంపటిన్ గలనఁబాఱఁగఁదోలుటగొప్పకామసం।
క్రందననందనుండిదె దురంబునకై చనుదెంచినాఁడువీ।
నిందలఁకింపఁగల్గుటయొ నిక్కపుఁ బంటుతనంబటంచు వా।
రందఱుగూడబల్కికొనియాతనిఁ జుట్టునుముట్టి యేడ్తెన్॥

సీ॥ నీలపీనోదగ్రనిజసంహననములు ప్రావృషేణ్యాంభోధరములు గాఁగ।
హైమద్రఢిష్ఠబాణాసనప్రభలు క్షణప్రభావిస్ఫురణములుగాఁగ।
శృణ్వద్భయాపాది శింజినీటంకృతిధ్వానముల్ ఘనగర్జితములుగాఁగ।
జిత్తవేపథుకరక్ష్వేడానినాదముల్ తోరంబులగుస్ఫూర్జథువులుగాఁగ।
నతిరథోత్తముఁడైన జయంతునిపయి।
ఘోరముగ శాతసాయకాసారములను।
తెఱపియీకుండఁగురిసిరద్దితిజసైన్య।
నాథులత్తఱి నతిసమున్నద్ధులగుచు॥

వ॥ గడితంబౌ వడగండ్లవానకు నుదగ్రక్ష్మాధరంబోర్చునై।
వడివాలమ్ములవానకోర్చి సుపర్వస్వామిగారాబఁపుం।
గొడుకయ్యెందఱకన్నిరూపులయి రక్షోవీరునొక్కొక్కనిన్।
బిడుగుల్ నాఁదగుతూపులంబరపి నొప్పించెన్ భుజప్రౌఢిమన్॥

ఉ॥ అచ్చెరువాటుగొల్పెడు జయంతు నరుంతుదబాహుశక్తికిన్।
నొచ్చియు వీఁగక ప్రభుగనూకభవుల్ తుదిరేయినాటిపైన్।
జిచ్చునకుద్దయా కనడజిహ్మగముల్ పరఁగించియాత్మసం।
యచ్చతురత్వమంతయును వ్యక్తముసేసిరి సూడుకానికిన్॥

చ॥ నడుమనె వానినన్నిఁటిఁదునాతునకల్ పొనరించిమబ్బుత।
త్తడిదొరకూర్మిబిడ్డప్రహితంబులవాఁడలమేనినెత్తురుల్।
మడువులువాఱనేసి కరలాఘవమొప్పగ వైజయంతులున్।
గొడుగులు వింట్లు రథ్యములుఁగూల్చి యలంచెను వారినెల్లరన్॥

ద్రుతవిలంబితవృత్తం॥ విరథులైయరివీరుఁడు దైవతే।
శ్వరతనూజుఁడసాధ్యుఁడటంచువం।
దురుచులూమముద్రొక్కిన మేచక।
ధ్వాసనంబులతీరునఁ గ్రుద్ధులై॥

చ॥ ఒకఁడు పరశ్వధంబు గదయొక్కఁడు శక్తి యొకండు కుంతమిం
కొకరుఁడు మండలాగ్రము మఱొక్కఁడు నిష్ఠురతోమరంబు వే
ఱొకఁడునుగాఁగఁ గైకొనిమహోగ్రతనొక్కటఁ గోత్రభిత్కుమా
రకుఁ ద్విరదంబుపైఁబడిరి రాక్షసనాథుననీకినీపతుల్ ॥

శా॥ అల్లేఖర్షభసూనుఁడట్లడరు దైత్యస్తోమముం గాంచి శుం
భల్లక్ష్యస్థిరదృష్టిసౌష్ఠవము దోఃప్రావీణ్యముల్ శోభిలన్
భల్లంబొక్కఁడొకండుగాఁ బరపి తత్ప్రాసాసిశక్త్యాదికం
బెల్లన్ జక్కడచెన్ రిపుల్ నిజభుజాహేవాకముం గ్గింపఁగన్ ॥

క॥ మఱియున్ వెనువెంట నేచి
చ్చఱకోలలఁబోనినారసములన్ నొంపన్
బఱదిరెఱదిదిండులుతమ
తఱుసలితనములను డిగ్గఁద్రావిజళుకనన్ ॥

ఉ॥ వేఁటరినొంచు లేళ్ళవలె వేలుపుఱేనికొమారునేటులన్
దూఁటులు వడ్డయుంగములతోఁ బడవాళ్ళుడివోయి యాలకున్
దాఁటుచునుంట కేవపడి తారకుఁడందఱఁజేరఁబిల్చిమి
మ్మాఁటదియైన నవ్వుననహాహోయని యుల్లసమాడి దూఱుచున్ ॥

క॥ అంతకుని తెఱంగునన
త్యంతకుపితుఁడగుచుఁ దారకాసురుఁడంతన్
యంతకుఁబరపుమురరసముజ
యంతకుమారుకడకంచు నాజ్ఞయొసఁగితాన్ ॥

ఉ॥ రోఁజుచుఁ గొందఱాశ్వరథికుల్ మిసిమింతులు వెంబడిన్ జనన్
బౌఁజులుతీరియుండిన సపత్నులఁదన్న భయప్రదానమున్
గోఁజుతెఱంగునన్ జితుకఁగొట్టియలంచితొలంగఁదోలుచున్
డాఁజుకి కీదివింగవియుభాతిఁ జయంతునిఁదాఁకి యుట్లనేన్ ॥

శా॥ ఏదీయింతకుమున్ను మద్భటులపై నీవద్భుతంబౌ సమి।
ద్వైదగ్ధిన్ బ్రకటించినాఁడవుకదా దానింగనుంగొంటకై।
కోదండంబుధరించి కొన్నిదిఱుమున్ల్ కాన్నిమె తెంచితిన్।
నీదాక్ష్యంబును జూపుమిప్డు మగుడన్ వృద్ధశ్రివోనందనా॥

ఉ॥ బాసటలేక పెక్కు రుక్షపాచరవీరులతోఁ బెనంగుటన్।
వేసటనొందితేమొ యొకవెల్లడిచోటున విశ్రమించియా।
యాపము లెస్సఁదీర్చికొని యాహవమునాలము సేఁతకేగుదె।
మ్మో సురరాజపుత్ర యిటనుండెదనీవరుదెంచునంతకున్॥

మ॥ అనుచున్ బలికిన నవ్వి తారకునకయ్యాఖండలాత్మోద్భవుం।
డనునో తారక బెండుకోఁచలగు క్రవ్యాదయోధులేకామము।
మ్మనవాల్ దాల్చిన వేల్పుసత్ప్రమథుఁడై భూతాళితో వచ్చుమా।
రొకనిన్ వేనట లేశమాత్రమును నాకుంగల్గదాలించితే॥

మత్తకోకిల॥ ఈడఁబోవక చూడఁజాలుదు వేని చూపెదఁజక్కఁగాఁ।
జూడునా భుజశక్తి కొంతనుచున్ వచించి జయంతుఁడా।
మూడుకాని యురశ్ఛదంబునఁ జొన్పెఁ బెక్కు కడించిప్ప।
క్ష్వేడనంబులు వేల్పుజోదు లగెల్లునన్ దివి వ్రయ్యగన్॥

ఉ॥ భండనపండితుండ మరభర్తృతనూభవుఁడేయుపోఁ జ్వల।
త్కాండపరంపరల్ సరకుగాఁగొనకుత్తమసారమైనకో।
దండము నెక్కువెట్టి క్షణదాచరసైనికులుల్లసిల్లనా।
గండరగండఁడేసె విశిఖంబులు కల్పకృశానుకల్పముల్॥

* స్రగ్ధరావృత్తం *

మార్గీపగుర్వారవంబంబరము నఖిలమున్ మాఱుమ్రోయుఁగఁ జేయన్।
వార్వాహంబాంబుధారల్ వలెఁగురియుచుఁదీవ్రింపుఁగ్రొవ్వాడిరూపుల్।
పూర్వామర్త్యంము క్షుద్రువేల్పుదొరకొమరుఁదున్ బోరి రాత్రించరుంభ।
ద్గోర్వీర్యవ్యాపవిద్యాదులకు నచటిజోదుల్ సెబాసందు మెచ్చన్॥

చ॥ పిడివడి గర్జితంబులగు విక్రమువిక్రముఁదాఁకి పోరుచై ।
వడిసరికోడెకాండ్రు మఘువత్సుఁగతారకులుగ్రమూర్తులై ।
యెడపక యంపవానఁగురియింపుచు నెక్కటిఁబోరుచుండ నా ।
న్పడి తిలకించుచుండిరి సువాఁగునఁగల్గినజోదులందఱున్ ॥

చ॥ ప్రకృతిప్రపరాక్రముల్ పనికిరావు మహాబలశాలియైన తా ।
రకుని రణాంగణంబునఁ బరాజితుఁ జేయుటకంచుఁ దేవవ ।
ర్ధకివరనిర్మితంబయిన దారుణశక్తికరంబునందమ ।
ర్చి కులిశభృత్సుతుండు వయిచెన్ రజనీచరవీరమూర్ధ్నిపైన్ ॥

క॥ మిత్తివలె మీఁదికడరెడు ।
సత్తిన్ గుఱిచూచి యర్ధచంద్రశరమునన్ ।
ముత్తునెలు సేసెఁ దారకుఁ ।
డత్తెఱఁగంటివోరచూలి యలరుటపడఁగన్ ॥

శా॥ జన్యాభిజ్ఞుఁడు శక్రసూనుఁడు విపత్తుధ్వంసకంబైనప ।
ర్జన్యాస్త్రంబు శరాసనోత్తమమునన్ సంధించి శబ్దగ్రహం ।
తన్యస్తాశ్లథముష్టిగాఁదిగిచి యాతం డేసెఁ దారాపథా ।
ధ్వన్యుల్ తారకుఁడీల్గెఁ దీననని సాంద్రధ్వానులై యార్వఁగన్ ॥

క॥ పొనలుచుఁ జగములనన్నిఁటిఁ ।
బొనుఁగుపరుపఁ జాలుపిడుగు మొగులుగములతోఁ ।
జనుదెంచు నక్కమహాస్త్రం ।
బునుగనుఁగొని సోఁకుడులపబువకంప్రిండై ॥

చ॥ క్రవ్యభుగాయుధీయులలరన్ బలుసింగిణియందమర్చి వా ।
యవ్యమునన్ బ్రసిద్ధమునట్టి ప్రభంజనదేవతాకమా ।
దివ్యశరంబు నిండుతెగదీసి యలాకునఁ బూన్చ దేవమా ।
ణవ్యవతంసమాప్రహరణమ్మునపయిన్ నిగుడించెఁ జయ్యనన్ ॥

క॥ ఆయస్త్రమునుండి మహా।
వాయూత్కరముప్పతిల్లి వాసవిపర్జ।
న్యాయుధమునడఁగఁద్రొక్కఁద।
వీయముగాఁబాఱవైచె వేలుపులడలన్॥

శా॥ భగ్నానేకవిపక్షవీరుఁడగు నాప్రావేల్పుఁ గన్నాకును।
ద్విగ్నుంజేసి వధింపఁ గౌతుకితుఁడై వేగంటి గారాపుఁగో।
డాగ్నేయాస్త్రము వింటఁదొడ్గివిడిచెన్ యాత్వన్వయుల్ కాతరుల్
నగ్నత్వంబు పొసంగియున్ తెలిసికొంటల్లేక పర్వెత్తఁగన్॥

క॥ జగముల మఁగియుక యప్పటి।
దుగమొగముల వేల్పుదాని తొలుకందనఁగాఁ।
దగిన మహాజ్వాలా వళి।
నెగడెఁ దదస్త్రంబునుండి నీరంధ్రంబై॥

శా॥ స్వస్స్త్రీలభ్రపథంబునన్ నిలిచి త్రస్తస్వాంతలై చూడర।
క్షుస్త్రైకపరాయణుండుయున యాక్రవ్యాదనాథుండుదా।
నిస్త్రింసుండును దృక్శరవ్యముగఁ దానిన్ బెట్టి బిట్టేసెఁబ్ర।
హ్మాస్త్రంబున్ బలుసింగిణీన్ దొడిగిగాఢాకృష్టమౌర్వీకుఁడై॥

గీ॥ ఓతువాఖువుపైఁబడి యొడిసిపట్టి।
హతమున వధించి మెసవునట్లగ్నిమహాస్త్ర।
మడరి యప్పావకాస్త్రంబు నడఁచె వేల్పు।
దొరకొడుకు గెల్పుటడియాసతోడఁగూడ॥

ఉ॥ ఆవెనువెంట వింటిగొనయంబున భల్లమొకండమర్చి చే।
మేవడికెల్ల రచ్చటియ మిత్రులు నివ్వెఱజెందఁ జాపవి।
ద్యావిదురాగ్రగణ్యుఁడగు తారకుఁ డంచితవిక్రమోర్జితుం।
డా వృషసూనునల్లెగనయంబునకున్ దెగనేసె నేర్తెఱన్॥

ఉ॥ ఊటియశచీసుతుండు వఱియొక్క శరాసన మెత్తు నంతలో।
దుటుతోకయింత లేక పలుతూపుల నాతని దేహమంతయున్।
దొఱటలు సేసె రణదోహలితారకుఁ డజ్జయంతునిన్।
బిలుటిపుచున్ జయంతుఁడని పెద్దయెలుంగున మార్తురార్వఁగన్॥

చ॥ దివిష దధీశనందనుఁడు దీననెసోఁ కుడుతేనిచావుని।
కుక్కవమని యెంచుచున్ మగుడఁగొన్న శరాసన రాజమందునై।
ప్లవమను నుత్తమ ప్రహరణమ్మరివోసి సమంత్రకంబుగాఁ।
దివిచి సురారిపైఁ బరపెఁ దేవవరూథినులుల్లసిల్లఁగన్॥

మ॥ సముదాయాజిరమెల్లఁ దానయి జగత్సంహారమున్ జేయనే।
గుమహోన్మృత్యువుపోలికఁ బైనడరునా ఘోరాస్త్రముంజూచి ప్రా।
ణసహాయాగ్రుండగు తారకాసురుఁడు దానారాయణాస్త్రప్రయో।
గము గావించెఁ బరస్పరాహతములై కాడ్బోవ నారెండునున్॥

క॥ వెండియుఁ జండశరములు।
చ్చండతనడరించి పోఁకుసామి జయంతున్।
గండడఁగించె నతిశ్రాం।
తుండై యాతండు మిగులఁ దూఁకలిజెందన్॥

ఉ॥ సూదికినైన నంతరము జొప్పడకుండఁగ నజ్జయంతునా।
పాద శిరోరుహాంతముగఁ బాణమయాత్ముని జేసినొంచెఁగ।
వ్వాదకు లేంద్రుఁ డప్పుడు తదాహతులన్ మిసిమింతుఁడై నయా।
గాదిలిచూలిఁజూచి వెయిగన్నులఁ గెంపొదవించు నల్కచేన్॥

చ॥ మదకలమైన యూథపమ మర్దనమై నిలుచున్న సింగపుం।
గొదమనుదాఁ కినట్లసుర గోత్రజులన్ దమవారిపెక్కురన్।
గదిసి వధించె నన్నయలుకన్ దనమీఁద నె కన్నువై దియు।
న్నదితిజ నాథునిన్ దివిజనాథుఁ డుమారొకనై స్యందనస్థుఁడై॥

మ॥ అమృతాంధఃకులసార్వభౌముఁడు నిలింపారాతిమీఁ దన్ విపా ।
తములయ్యెన్ శ్రుతిసారదృశ్య లగుకాండంబుల్ దురాధర్షశౌ
ర్యమునన్ గోలుమసంగి యుద్ధవిధి నేయన్ శూరపద్మానుజుం ।
డుముఖాబ్జంబునఁ గ్రోధసంవలితమానాత్మస్మితం బొప్పఁగన్ ॥

చ॥ ఒడికమెలర్పఁ బత్త్రికనుండి వెలార్చుట కార్ముకంబునన్ ।
దొడుగుటనింక మోపు తెగదూయుట లెప్పుడునంద దర్పుటే ।
ర్పడఁదిలకింపరాక కరపాటవమద్భుతమైయె సంగసోఁ ।
కుడుదొర వజ్రిపైఁ బరపె ఘోర పరశ్శతకంక పత్త్రముల్ ॥

క॥ కిరి కరియున్ గిరి గిరియున్ ।
హరి హరియున్ గపిసిపోరు నట్టి పగిదినా ।
శరపతియును సురపతియును ।
సరిపోరఁ దొడంగి రుభయసైన్యము మెచ్చన్ ॥

చ॥ పగగొని యొండొరుల్ రథుల పైరథయంతలపైఁ గుఱ్ఱాలపై ।
నిగుడుచు దూవు మొత్తముల నిండునఁ జేసియుఁగ్రవ్యజద్ధికై ।
తెగతిరుగాడు పుల్గు పెనుతిట్టలఁ జేసియు నభ్రమంతయున్ ।
ఖగమయమయ్యెఁ బోఁకుతెలి గంటులరాయల జంటపోరునన్ ॥

ఉ॥ తారకవీరువోః పటిమదార్ఢ్యమదెట్టిదొ తానునేరుచే ।
పారనడక్కె సంబక సహస్రమునుండి యకాకయల్లసా ।
కారికినున్న యంబక సహస్రమునుండియు నస్రబిందువుల్ ।
సారణియై స్రవింపసురసాసుతుఁ డేసెను వేయియమ్ములన్ ॥

ఉ॥ బ్రహ్మము ఖామరౌఘసము పాసితమంగళి పాదపద్ముఁ డా ।
జిహ్మగభుక్తురంగుదయచేఁ జయమబ్బునమంచుఁ గోరుచున్ ।
బ్రహ్మశిరోస్త్రముం బరపెఁ బ్రాకట కుబీశ్వరుఁ డన్యశాత్రవా ।
జిహ్మగదుర్నివారమగు దేవనెసంగెను దానినేడ్తెఱన్ ॥

శా॥ ప్రత్యాదిష్ట పరేతరాట్ప్రభృతికప్రత్యర్థివీరుండు సం।
స్తుత్య ప్రాణుడు తారకుండసురయోధుల్ నిల్చి జేజేయనన్।
బ్రత్యాలీఢపదస్థుడై తదభిధానంబైన దివ్యాస్త్రమున్।
బ్రత్యస్త్రంబుపయిన్ నిగుడ్చి ప్రశమింపన్ జేసె నయ్యస్త్రమున్॥
శిఖరిణీవృత్తము॥ నితాంతంబున్ రుష్టాత్ముడయి దివిషన్నేభృశరూతా।
క్షుతామత్తంబై యాక్షణములసహస్రంబు దనరన్।
గృతాంతాగారప్రాపణికుడవుగమ్మ్రానుచుడో।
శ్శతారంబున్ వైచెన్ సరభసతరక్షిప్రభునిపైన్॥
మ॥ అమరుల్ ముక్కలమీద వ్రేల్లునిది హాహంతాభవల్లుప్తము।
ధ్యమవర్ణం తృణమీశితుః కులిశమంచాశ్చర్యమందన్ శచీ।
రమణుండేసిన ప్రోజ్వలద్భిమ రమాక్రవ్యాశనాధీశు కం।
రమునన్ ఘోరపుటుర్వడిన్ దగిలి కుంఠంబై రణోర్విన్ బడెన్॥
వ॥ అంతలోన॥
మ॥ మగుడన్ దెప్పిరిపోరుహూతియభిసంపాతంబునన్ దారకున్।
దెగటార్పన్ సమవేతులై యడర నాదేశించుచున్ వేల్పుజో।
దుగముల్ నద్దెసవారలొక్కటయి యుద్యోగించి యొక్కమ్మడిన్।
నగరాడ్ధీరుని జుట్టుముట్టికొనిరా నక్తంచరగ్రామణిన్॥
ఉ॥ ఇట్టలమైన రోసమున నిట్టలదేవబలంబశేషమున్।
జుట్టునుముట్టిపైబడుటచూచి ముదంబున నుబ్బెగానియా।
కట్టుపరాముఖీతుడయి కాడ్పడడయ్యె రవంతయేనియున్।
గట్టలుపైబడన్ బెరుగుగాని జ్వలచ్ఛిఖియారిపోవునే॥
ఉ॥ వేసగివేడివేల్పువలె వెన్గెడునీరువుదిండితేవిపై।
నాసురవీరులందఱొక్కటై బెడిదంపుముపానువట్టిన।
త్లైసిరిసుంతయున్ దెలిపియాక నిరర్గళదోఃపరాక్రమో।
ల్లాసమునన్ సహస్రములు లక్షలు కోటులు పోటుముట్టులన్॥

ఉ॥ దానికిసిళ్ళుచూపిన మదద్విరదేంద్రముపోల్కి నల్గియా।
దానవలోకనాథుఁడు మృధస్థలమేదెసఁ బారఁజూచినన్।
దానయి యొక్కఁడేనియునుఁ దప్పకయుండఁగ మృత్యుజిహ్వలన్।
బోనిఖురాలకౌఘములపోటులచే నొగిలించె నెల్లరన్॥

సీ॥ సంఖ్యాతిగాటవీసత్త్వమధ్యమ్మునఁ గ్రుమ్మరునాఖేటకునివిధమునఁ।
ద్రచ్చునప్పుడుజిడ్డుప్రాయేటినీటిలోఁదిరుగుమందరధరాధరమువగిదిఁ।
గండ్రచీమలుమెండుగలముంజ్లపొదరులోదరికొన్నకారుపైదారకరణి।
వితతవృక్షకమైన విపినదేశంబున విహరించుగంభీరవేదిమాడ్కి।
నల్లకల్లోలమొనరించె నమ్మహోధ।
నుద్ధరుండొక్కరుండె జిష్ణునితుటుముల।
నెల్లనోచెల్లయివ్వీరుడల్లగిబ్బ।
రావుతేమొకొయనివారు బ్రాంతిజెంద॥

ఉ॥ మూఁగినసూడుకాండ్రపెనుమొత్తముపై నలతారకాసురుం।
డాఁగకడర్పుచున్న నిశితాశుగకోటులు సాంద్రమైనతూ।
నీఁగలపిండువోలెఁ దివినెక్కొని సూచనచేసె నత్తఱిన్।
గాఁగలయాదితేయకులకాంతలలోచనవారివర్షమున్॥

గీ॥ పొలసుదిండులయును నిర్జరులయునంత।
రమునఁ దత్తారకప్రవేశమునఁజేసి।
సకలదైతేయసైన్యంబు సాంఖ్యమయ్యె।
నాకిబలమంతయును నమనస్కమయ్యె॥

ఉ॥ లావరులైన కోటులకొలంది యరాతులతోఁ బెనంగుర।
క్ష్మావిభుఁడొక్కఁడయ్యు భుజశుష్మవిశేషమునన్ శరాసవి।
ద్యావిభవోన్నతిన్ బ్రధనదక్షతనందఱికన్నిరూపులై।
హావళినొందఁజేసె నభియాతులఁగాటపుటంపమేటులన్॥

ఆ॥ అసురవిభునిచేతి యాణిపోటులనొచ్చి।
మానవానిమాట మఱచిపోయి।
మఱచి సురలు చక్రిమఱువుసొచ్చిరి నిశా।
చరులు కేలుగవలు చప్పటింప॥

మ॥ సకలామర్త్యులపాటుగన్గొని మదిన్ జాలొంది జేజేలకో।
డకుఁడీయంగఁజభయంబొసంగి ఖగరాడ్వాహుండు త్రైలోక్యర।
క్షకమై శోభిలుదోశ్చతుష్టయమునన్ గౌమోదకీశార్ఙ్గనం।
దకముల్ స్ఫారసుదర్శనంబు నిరువొందన్ దాల్చి తా వెల్వడెన్॥

చ॥ త్వరితగమంబునన్ నడచివచ్చుచునున్న సురాలయత్నమా।
ధరమొకొయంచు నెంచదగుతార్క్ష్యుని విస్తృతమైన మూఁపుపై।
స్థిరముగఁ గూరుచుండి చనుదెంచుచునుండిన విష్టరశ్రవున్।
దరణిసహస్రదీప్తిఁగని దగ్గఱనిల్చి సురారియిట్లనెన్॥

చ॥ తనజనయిత్రి దాస్యముకతమ్మునఁ జక్రులనెల్లశైశవ।
మ్మునఁగడుమోచిమోచి యిరుమూఁపులు కాయలుకాచె నేఁటికై।
నను భరమైనచక్రివహనంబిది తప్పకపోయెనీసుప।
ర్ణునకరయు యెంతవారలకునున్ విధిదప్పనెయంచు నవ్వుచున్॥

చ॥ జలనిధికన్యకాహృదయ సారసతిగ్మమయూఖబింబమా।
దళితవిపక్ష నేఁటికిఁగదా విలువట్టుట నేర్చికొంటకున్।
ఫలమ్మొకగూడె నింతసులభంబుగనిన్ను విరాట్స్వరూపునిన్।
గలనిక[illegible]నర్పఁగల గౌరవలాభము సంఘటిల్లుటన్॥

ఉ॥ స్థామమునన్ ననుంగెలిచి తమ్ముభరింతనినమ్మియున్నను।
త్రాముఁడు లోనుగాఁగల సుధాభుజులెల్లరుతల్లడిల్లనం।
గ్రామమునందు నీదుభుజగర్వము సర్వమడంచిమున్ననీ।
చేష్టితులైన తొంటిభృగుశిష్యులయోటమి యప్పుడీ ర్చెదన్॥

ఉ॥ నావుడు నవ్వుచవ్వనజనాభుఁడు తాననునోరితూరప।
ద్మావరజుండ మున్నుచనినట్టి త్వదన్వయజాతయాతుధా।

నావనుకోటియం డెడఁదనంతటికూరిమి నీవునుండినన్ ।
నీవును వాంఛ్రుచన్నసరణిన్ జనియుండుము వాంఛ్రపొత్తునన్ ॥
మ॥ ఇదెనీపోకకు మార్గదర్శకముగా నేతెంచివారున్నయ్యా ।
స్పదమున్ జూపునటంచుఁబలికి యులవిష్వక్సేనుఁడన్యగ్రుఁడై ।
వదలెన్ రకకసిబంట్లుచూచి గతజీవప్రాయులై మూర్ఛిలన్ ।
గదనక్షౌణ్యాసకృన్నికృత్తబహురక్షశ్చక్రమున్ జక్రమున్ ॥

* స్రగ్ధరావృత్తం *

స్వర్ణాద్రిన్ దొట్టికొండల్ వడవడవడఁకెన్ వ్రక్కలైదిక్కులెల్లన్ ।
ఘూర్ణిల్లెన్ దిర్దిరన్ దిగ్గడువడెనఖిలక్షోణిచక్రంబునున్ స ।
ప్తార్ణోరాసుల్ కలంగెన్ హాళహాళివడె లోకాళి త్రాసాకులంబై ।
దీర్ణంబై తూఁటువోయెన్ దివియుడుతతి నిస్తేజమై రాలెనుర్విన్ ॥

వ॥ అయ్యమోఘాస్త్రంబు కల్పాంతసమయ విజృంభమాణ ప్రద్యోతనద్వాదశకంబు నల్పఖద్యోతమాత్రదీప్తిపాటియదిగఁబాటింపంజాలు ననిర్వచనీయంబగు నర్చిఃపుంజంబుతో నంతరాంతరంబున ననేక దివ్యాయుధసహస్రంబులు ప్రజ్వరిల్ల ననిసంపూర్వంబగు నతిభయానకాకారంబుచే నఖండబ్రహ్మాండభాండంబు నెల్ల మెండుకొని దుండగఁపునంజుఢు దిడిటంబులెల్లఁదారకుండొట్టి తమకండలకు నిదియతీటుదల యని యర్ధప్రమీతులై నిలువంబడియుండ నరుదెంచుచుండుటయుఁదండి మగలమిండండగు నత్తారకుండు నింటారుబత్తినత్తిగకంటిని చిత్తంబున హత్తుకొల్పి దండంబులోసంగి బాహుదండంబులాస్ఫాలించి దారక్షాని పిలిచినిలిచిన ॥

శా॥ ఆవైకుంఠునిచుట్టుకైదువవిషహ్యాటోపమై విద్విష ।
త్క్రోవల్ దాటలచాద్వనన్ దనుమకుఁదేకించి యేతెంచియున్ ।
దేవఛందములెల్ల నిర్భరభయాధీనంబులై చెద్వదన్ ।
దేవఛందముపోల్కిఁదారకుశిరోధిన్ దాలెనిర్వ్యాజమై ॥

వ॥ అప్పుడు తారకుండు నారాయణుంజూచి ॥

గీ॥ నను మునిట్లనియె సుదర్శనంబుకంత ।
దేశమున్నఁదాల్చిన యతండె ధీరుఁడట్లు ।
కాకయుండుట ధీరలక్షణముగామి ।
యెఱుఁగ వేడిల్లవడిచూచె దేలయిట్లు ॥

ఉ॥ కేశవదిననన్నుఁ దలకింపగఁజాలకపోణిలేశమున్ ।
నాశరవిద్యయించుకగనంబరతున్ దిజకించెదేయటం ।
చాశరసార్వభౌముఁడలికాక్షునిఁజిత్తమునన్ దలంచుచున్ ।
బాశుపతాస్త్రమేసెను త్రపావివశుండయియున్న శార్ఙ్గిపైన్ ॥

సీ॥ అమరేంద్రుననిఁగెల్చి యమృతంబుఁగొనిపోయి జననిదాసిసము మా
[ప్పినతరసిఁ ।
త్స్మాధరంబులఁబోనిగజకచ్ఛపముల నంఘ్రినఖరాగ్రములనెత్తిన బలి
[యుఁడు ।
కడలిఁదాఁగిన యసంఖ్యనిషాదకులములఁ గబళీకరించిన ఘస్మరుండు ।
విశ్వంభరుండైన వెన్నునివెన్నునఁదాలిచి మోచు జితశ్రముండు ।
వెనుకొనినపాశుపతశస్త్రమునకు వెఱచి ।
సత్తువకోలందిగా నాకసమునకెగసి ।
పసిఁడిపల్వదాలుపునకు వసముగాక ।
వఱవఁజొచ్చెఁగరుడి చట్టుపల్ విదిర్చి ॥

శా॥ ఆదివ్యాయుధచక్రవర్తియు నవార్యాటోపమై సర్వతః ।
ప్రాదుర్భూతమహాగ్నికీలలఖిలబ్రహ్మాండముల్ ముట్టపెన్ ।
బాదన్ బెట్టుచు వెంటనంటి వనుడున్ వారింపశక్తుండుగా ।
కాష్ఠ[illegible]విరోధిచిత్తముభయాయత్తంబుగానార్తుఁడై ॥

ఉ॥ శక్యమశక్యమన్నయుపజాపము లేక యవధ్యుడైన వా ।
ర్థక్యామమీఁదిదౌడశరుఁదారుచు నాఘునహాలికుత్తమో ।

దక్ష్యమహాకులీనునకుఁ దారిదొలంగుగతిం దొలంగుచా।
త్సుక్యముదక్కి యస్మధునిషూదనుఁడంజలిజేసి మొక్కుచున్ ॥

చ॥ భు క్తహాలాహలాఖ్యవిషపూరణ నీలశిరోధిదేశయా।
ము క్తభుజంగరాజమయభూషణయోశివ నీకునిక్కపుం।
భక్తుఁడనేని యీభయదపాశుపతా స్త్రముబారినుండినన్।
ముక్తునిఁజేయ వేయనుచు మ్రొక్కులు పెక్కులొనర్చె శూలికిన్ ॥

క॥ అత్తఱి నాపాశుపతా।
స్త్రోత్తమ ముపసంహార ణంబునొందె శివాజ్ఞన్।
బుత్తడి పుట్టము తాల్పును।
నుత్తులపాటెడఁద నెంతయును నలమకొనన్॥

చ॥ అఱుసుర లేక రాతినివహంబులనాజిఁజయించునంచున।
న్నఱి మురి నేల పిల్చెన మరాధిపుఁ డక్కట లేనిపోనిపె।
ద్దఱికముమీఁదఁబెట్టికొని తారకుమీఁ దికినేలపోతినే।
నఱ గొరయెన్నఁడున్ గలుగనట్టిది నాకుబొసంగెని త్తఱిన్ ॥

చ॥ విబుతునిశూర పద్మని యవీయసుఁ ద్రుంచి యసంశయంబుగా।
దముకుఁ జయంబొసంగి ప్రమదంబొన గూరుతునుంచు నమ్మియు।
న్న మఘవదాది నిర్జరుల నమ్మిక వమ్మయి ప్రోచుదిక్కులే।
కమనికితంబు గూరి యొమరన్ వలసెన్ నిసిద్రిమ్మరిండ్లకున్ ॥

మ॥ మిపులన్ బత్తిమయిన్ దపించి గిరిశున్ మెప్పించి యీచుట్టుకై।
దువుఁగైకొన్నది యాదిగా నసురులన్ దుర్వారగర్వారభ।
ట్యావలిప్తాత్ములఁ బెక్కురన్ నుటుముసేయన్ జాలితింగానియా।
ప్రసవమున్ జెంది పరాభవంబునకుఁ బాత్రంబౌట లేదెన్నడున్ ॥

శా॥ నానాదుర్జయదైత్యులన్ సమితిలోనన్ లీలమైఁ గెల్చినే।
నీన క్తంచరరాజబాలకునితో నీటాడియిట్టి టను।
త్తావల్ పెక్కుప్రసవంతులీఁదియొకయీఁతంగీరితింగన్ననా।
ధానుండుగ్రనుఁజొచ్చియీలిగిన చందంబయ్యెఁగాయక్కటా ॥

చ॥ పవియును జక్రముగా దృణని భంబులగుగా దృణమాకడింద్రికై।
దువులగుc ధన్వమబ్ధియగుc దోయధిధన్వమగుగా రజఃకణం।
బవనిధరంబగుగా గిరిరజోంశముగుగా హిమబిందు వగ్నియా।
నివమగుc దారుణజ్వల నమీశ్వరశక్తికసాధ్య మున్నదే॥

క॥ త్రిదశులిది ఖండపరశు।
ప్రదత్త వరమహిమ మగుటభావింపకయె।
ల్లి దముగc దలcతురు తారకు।
మదమడcపంజాలc డయ్యోమాధవుc డనుచున్॥

క॥ అనితనకు నెన్నcడునుcగలు।
గని పగతునివలని విప్రకారంబునకుగా।
వనరుచు నంతహీనతుcడై।
చనియె నధోక్షజుcడు నిజనిశాంతంబునకుగా॥

మంజుభాషిణీవృత్తం॥ వరతాపసాంచదపవర్గదాయకా।
పురుపాలవహ్న్యుషిత పుష్పసాయకా।
ఉరగేంద్రభూషణ మహాబ్జాతధోరణా।
హరిణాంకచూడ జగదాదికారణా॥

భద్రకవృత్తం॥ కాశమండనభాసురా। నాశితోద్యదిభాసురా।
కేశవార్చితసత్పదా। కాశికానగరాస్పదా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవసూ
రిజనవిధేయ సూర్యప్రకాశ నామధే
యప్రణీతంబగు తారకావచయం
బునందు సప్తమా
శ్వాసము.

శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# తారకాపచయము.

## పూర్వభాగము.

### అష్టమాశ్వాసము.

క॥ ఉక్షేంద్రవాహనవిశా।
లాక్షీనాయక యనూన కాబ్జభవాండా।
ధ్యక్ష పరాత్పర యవిము।
క్త క్షేత్రనికేతనస్థితా విశ్వేశా॥

వ॥ అవధరింపుము శౌనకాది తాపసోత్తములకయ్యైతిహాసికోత్త ముండిట్లని చెప్పందొడంగె॥

ఉ॥ రక్కసిఱేని చేననిఁ బరాభవ మొందిము కుందుమనంతవాఁ।
దుక్కరిఁ బ్రగ్గ వించెనయయో యిఁక దిక్కెవరంచుఁ గుందుచున్।
బిక్కల బల్మియప్పటికిఁ బెద్దయుఁ దిక్కయిపోదు సూపగా।
దిక్కు మొగంబులై పరువుదీసిరి జన్నపుఁదిండు లెల్లరున్॥

మ॥ చరణద్వంద్వము పారెకుంగ దివిజుల్ క్రాంతాత్ములై యేగుచుం।
దరులంబట్టి సురారిసైనికులు మోఁదంబోవ నాసోఁకుము।
కరులం దాటి భయంబు నొందక యసృచ్ఛంబొంకుమీరంచుఁగా।
తరులంబీకు దోలంది పీడాలిపెఁ దైత్యస్వామి నవ్వీలుఁడై॥

చ॥ పకపకనవ్వుచుం గృతులు పాడుచునాడుచునున్ దలంచిమా ।
నికము సురాఘ్న నాకరమణీ తతిమున్నగువానిఁ జారగాం ।
అకెలది దిండ్లు ప్రోల్చార బడంగ మకించు తెలంగెటింగితా ।
రకుఁ డునయానయజ్ఞుఁడు సురద్విషులన్ మరలించి యిట్లనెన్ ॥

చ॥ భషకములట్లు భీతులయి పాఱిరి వేలుపుజోదు లెల్లఁబూ ।
రుషులిటులిండ్లలేనితఱిఁ గ్రొత్తడులంబ తిదుర్గ శార్త్తలన్ ।
ద్విషుద వరోధనాంగనలఁ దెచ్చుట గర్హ్యతరంబు గాదెపా ।
రుషమగునే పరార్థములు ప్రుచ్చిలి తెచ్చుట పోటుబంట్లకున్ ।

క॥ ఇతరులు మనలయెడలనే ।
గతిమెలఁగన్ వలయుననుచుఁ గాంక్షింతుమొయా ।
వితముననె నడచు కొనవలె ।
నితరులయెడ మనమునుఁ బరమేశహితముగన్ ॥

క॥ మనసొత్తన్యులు కడతే ।
ర్చి ననేద్వమె మనముపరుల రిక్థముగొనినన్ ।
మనకై వారేడ్చెదరని ।
మనమునఁ దలపోయవలదె మతిమంతునకున్ ॥

శా॥ జన్యోర్విం బరి పంథులంగడి మిమైసాధించుటల్ జాతరా ।
జన్యానూకు నకర్మధర్మ మనుచున్ శాస్త్రంబు శాసించుచుం ।
టన్యార్థంబద యంబుగాఁ జలిపినాఁ డంగాని నిష్కారణం ।
బన్యార్థంబుల కర్త్ర సంశ్రవముగా నాశింపఁ గైకొంటకున్ ॥

శా॥ సంకల్పించిన యీకడింది పని నిర్ప్రత్యూహమై తీరెనా ।
హంకారామరనాయ కావ్య సకృదభ్యాసాదనాసాదితా ।
తంకస్వాంతము దైత్య వార్ధకము తత్తాదృక్ప్ర మోదంబునన్ ।
జంకల్ గొట్టుకొనంగఁ బోవునమిఁకన్ నైశంబుగా నిండ్లకున్ ॥

చ॥ అనియిటులానతిచ్చుటయు నయ్యమరావతిఁ జూరవెట్టకా।
త్మన గరికేగు దేరనసమాహితులయ్యు నలంఘ్య చండశా।
సనుఁ డగుతారకాసురుని శాసనముల్ జవదాఁటనోడి చ।
య్యనసురుల్ ప్రయాణమున కంతయు సిద్ధముచేసి తెల్పుడుల్॥
చ॥ ప్రతిభయమైన యాప్రధన రంగమునన్ దనచేసినట్టియ।
చ్యుత విజయాదులన్ వెఱఁగు చొప్పడవాకొనుకొంచు మెచ్చుచున్।
దితిజబలంబు వెంటనరుదేరగఁ దారకుఁ డేగిదూఁ కొనెన్।
గతిపయఘు ప్రయానములఁ గానన రాజముఁ బూర్వలిప్తముల్॥
ఉ॥ ఆవనిఁబద్మినీ ప్రియకరాం చదదక్షిణ బాహుభాస్వదో।
జోవిరతారి తారకుఁడు సుస్ఫురభంగని మగ్నయాతుధా।
నావన నజ్జతారకుఁడు సాగ్రహచాలనమాత్రవిద్రవ।
ద్దైవతరూత్తుతారకుఁడు తారకుఁ డాప్తులఁ గాంచి యిట్లనెన్॥
చ॥ నలువయితొప్పు నీశుభవనంబున నీశునిఁగాంచుటెన్నఁగా।
సులభమె యాకతంబుననొ సుస్థిరభక్తిఁ దపించు కావిగో।
చులజడదారి కేనిబోడసూపని నీలశిరోధిను జ్వలా।
నలమయ గోధినీశుభవనంబునఁ గాంచితిమేను నన్నయున్॥
చ॥ వనమిది శారదాంచి తనివాసము కావుటఁగాననత్వముల్।
ఘనవరుణాస్పదంబగుచుఁ గ్రాలుటచే వనరాశిభావముల్।
దనరగ భూరి యాపకలితంబయి యొప్పుట సత్రసంజ్ఞయున్।
జనములెఱుంగ సార్థత నెసంగర సంగడు హృద్యమయ్యెడున్॥
క॥ తమకిసలయంబులెసురా।
గములుగఁదనరారు నిచటిత్త్వారుహానమువా।
యమునకు సురాగములతో।
సమతవచించుట సమంజసము గాదరయన్॥
వ॥ అనిపలికి॥

సీ॥ రాచదిన్నెలుదిగ్గ్రదావివానప్రస్థచిహ్నముల్ పొసఁగఁ దాల్చినప్రదేశ।
మనుధారణంబున కైకాయగ నవులాకలము లేరుచువచ్చినట్టియెడలు।
నిఖలబాహ్యాంతరింద్రియవృత్తులడఁచి పెంపొప్పఁ గాఢసమాధినున్న [నెలవు।
తగ వేలుపులకు మీఁదిదియైన పరతత్త్వమైంద్రియకంబైన యట్టిచోటు।
తనదు సాహస్రులకుఁ బ్రమోదంబెసంగఁ।
జూపుచురుదయాశాలి నే శూలి నేక।
పాలి నే దుష్కృతతమోంశుమాలి నేన।
మోయటంచిందువాళికి మ్రొక్కి యతఁడు॥
క॥ ఇంచుకసేపవ్వనివిహ।
రించి మరలమరల హరుపరి వందినతులుగా।
వించుచుఁ దారకుఁడాన।
క్తంచరసైనికులతోఁ గదలె నిలుసేరన్॥
శా॥ సాంద్రారణ్యములాయతప్రహ్రదములుచ్చత్క్ష్మాధ్రముల్ దాఁటియ।
య్యింద్రారివ్రజమెల్లఁ బ్రీత్యతిశయోపేతాత్మకంబై చనన్।
జంద్రాహాసకరవర్త్మరోధకమహాసౌధాళియౌ వీరమా।
హేంద్రాఖ్యంబగు పట్టణంబుగననయ్యెన్ లోచనోద్ధర్షమై॥
చ॥ అరడములంచుఁ బొల్చువిజయధ్వజముల్ మనరక్కసీండ్లగె।
ల్చిరరులనంచుఁ జెప్పకయ చెప్పఁ జవంబునవచ్చు తారకా।
సురునిబలంబు దవ్వులనె చూచి సురార్యపసర్పులాశరే।
శ్వరుఁడగు శూరపద్మవిభుసన్నిధి కేగి కృతప్రణాములై॥
సీ॥ తోలుగొంగడివాని మేలుసంగడికాని జక్కులతోఁగూడనుక్కమడది।
వింతగర్వంపుఁబోతుమంతవార్వపురౌతునోడించి కేల్దోయి మోడిపించి
మగమానికపువాలుదగఁబూనిదివమేలుమగనిదేవళ్లతోఁ బొగరడంచి।
గ్రుడ్డుకానువుతేని దొడ్డతానువువానిఁ బగదీరమాడవిఁ జాడఁజేసి।

వచ్చుచున్నాఁడు జగదేకవర్ణనీయ ।
విక్రముఁడు నీదుకూర్మియవీయసుండు ।
పాఁజుగమితోడనో శూరపద్మనామ ।
సకలరాత్రించరాన్వయసార్వభౌమ ॥

క॥ అనిప్రణిధులు విజ్ఞాపిం ।
చిననుడువా శూరపద్ము చెలియంమనునా ।
తనిమనము ప్రమోదార్ణవ ।
మునయుందుననొక్కమాఱె మునిఁగినవయ్యెన్ ॥

ఆ॥ అనుజవిహిత విధుజయాకర్ణనానంద ।
పరవశుఁడయి దైత్యపరిబృఢుండు ।
మంజులముగ వీరమాహేంద్రపురముఁ గై ।
సేయ నైగములకు సెలవొసంగి ॥

ఉ॥ హెగ్గడికాండ్రచే స్వజనయిత్రికి నాశుభవార్తఁ బంపితా ।
డిగ్గనశింహవిష్టరముడిగ్గి సభాసమలక్షుదర్శకుల్ ।
ప్రెగ్గడలప్పురింగలుగు పెద్దలుచుట్టలు పాదచారులై ।
వగ్గసురేంద్రుఁడుచ్చకరివాహుఁడునై తనవెంబడిన్ జనన్ ॥

ఉ॥ తానునుఁ బాదచారియయి దానవనాథుఁడు శూరపద్ముఁడా ।
దీనవముల్ తొలంగెఁ బొలదిండులకంచవుడైకకంత్యని ।
ధ్వానముతోననుప్లవులు తారకువిక్రమమున్ నుతింపుచున్ ।
దోనరుదేరఁదమ్మునకుఁ దూరముగానెదురేగెఁ బ్రీతితోన్ ॥

చ॥ ఎదురుగవచ్చు తాతయసురేంద్రుఁడు జ్యేష్ఠుఁడు శూరపద్ముఁడున్
మొదలగు దైత్యముఖ్యులను ముందటఁదవ్వులఁగాంచి ప్రాంచిత ।
స్యదమునఁ దేరుడిగ్గి సురసాసుతమధ్యముఁడంఘ్రిచారియై ।
ముదమున వారిచెంగటికిఁ [illegible]యెను ప్రాంజలియై వినీతితోన్ ॥

శా॥ దృష్టిప్రీణనమూర్తిఁదన్నుఁగని హస్తిండిగ్గి జ్యాయసచే।
యష్టింగైకొనియున్న తాతకిది మీయాశీఃఫలంబంచుసం।
శ్లిష్టశ్లాఘితల్పాఖిలాపఘనుఁడై క్షేపిష్ఠపాతంబుగా।
సాష్టాంగప్రణతుల్ పొనర్చెఁ బ్రగుణుండత్తారకుండత్తఱిన్॥

క॥ నిటలతటీఘటితాంజలి।
పుటుఁడై యత్తారకుండు భువిఁజాఁగిలియు।
తటుటమదునకగ్రజునకుమ।
కుటమణిఘృణులంఘ్రులలముకొనఁబ్రణమిల్లెన్॥

క॥ పదపడి రాతిరిద్రిమ్మరి।
ముదుసళ్ళులందఱకుఁ గేలుమోడ్చె నతండా।
హృదయాళు నెలమినాశీ।
ర్వదించి వారలని రేకవాక్యత నొప్పన్॥

ఉ॥ ఘోరతపస్కులౌ ఋషులకుం దరిసింపగరాని యీశ్వరున్।
దోరపుఁబత్తిపెంపుమయిఁ దోషితుఁజేసిన యోమహాత్మయుం।
ద్దారులకెల్లఁ బుణ్యజనులంటకు నర్హతగల్గె నేఁటికో।
తారకయీసురద్విడవతారమునన్ ధరనీవుబుట్టుటన్॥

క॥ చేనెతుగాకయుండర।
మానేతృప్రభృతులగు నమర్త్యులనెల్లన్।
జానేసి విజయమందిత।
హానేర్చునె నినునుతింప నహిపతియైనన్॥

గీ॥ అనుచుఁ గొండాడుటకు నొప్పకాఁగియసుర।
దశములను దేరిచూచి యత్తారకుండు।
మొలకనగవాననంబున నొలయనని యోఁ।
దనదగు నహంతలేమి వ్యక్తంబుగాగ॥

చ॥ ఇటువలె మీ స్తవించుటకు నెంతటివాఁడ నదంభభక్తిని।
ఘుటఘటగతకల్పశాఖయగుచున్ దనరారుపినాకపాణియు।
కటికము పెంపుగాక యలకైటభజిన్మఘువాద్యులంజయిం।
చుటమదిఁ జకటగా నరసిచూచిన నామప్రయోజకత్వమే॥

క॥ ఆతరసాశనకులమిహి।
కాతరణీభూతచక్రకరునిఁద్రిజగతీ।
నేతరమాపతినోర్చ్పుట।
నాతరమాశంకరుకరుణగలుగకున్నన్॥

క॥ తలఁచినపని చేకూఁకుట।
గలిగిననది తనప్రయోజకత్వమనియుని।
ష్ఫలమైనఁ దైవికమనియుఁ।
బలుకఁదగునె యొఱుకగలుగు ప్రాజ్ఞనకెంచున్॥

మ॥ వసమీఅన్ గమలాసనాండమను శుంభన్నాట్యరంగంబునన్।
బసపుంజాయమదుంగుదాల్పు మొదలౌ పాత్రంబులన్ శంకరుం।
డసమానుండగు సూత్రధారుఁడయి తానాడించునేకానిలే।
దసుడీతుందుభబీజమంతయును స్వాతంత్ర్యంబు మేదారికిన్॥

క॥ పశువులు శరీరధారులు।
మశకము మొదలుగ రమాకమునివరకునున్।
బశుపతిశివుండు నగుటన్।
వశగతులాతనికి ధాతృవైకుంఠామల్॥

ఉ॥ సృష్టిఘొనర్పవాదిని విరించనునిన్ నియమించివిష్ణుఁద।
ద్విష్టపముల్ భరించుటకుఁ దీరిచి నంహృతిసేయరుద్రునా।
దిష్టునిఁజేసియున్ జగదధీశ్వరుఁడీశ్వరుఁడా త్రిమూర్తులున్।
శిష్టివిధేయులై పనుబుసేయఁగనుంగొనుచుండు సాక్షియై॥

సీ॥ హాలహలాద్రి త్రస్త హరిహయాద్యోకుజాద్యభయ ప్రదాయి యేప్రభు
[నిచేయు।
యాపదుల్లోలఘోరాజవం జవవార్ధితరణియే పరమునిచరణ సరణి।
యపునరావృత్తి నిత్యాపవర్గానంద ఘటనైకచణయే జగత్పేక్షణ
మనకారిప్రవరులామ్నాయోపనిషదర్థవిందులేయొకమీనివందులెపుడు।
నట్టిపరమేశ్వరునిదైన యకటకటికము।
తప్పినప్పుడు శ్రీపతీంద్రప్రభృతికు।
లేనియును నకించిత్కరులై నిహీను।
లగుటయనివార్యముసుడీ నిశాటుభార॥

శా॥ అంచున్ దైత్యులకున్ త్రిలోచనుని మాహాత్మ్యంబు వాకొంచుఁరో।
మాంచాక్రాంతశరీరులై వినుచునమ్మాంసాశనుల్ బెబ్బులుల్।
పంచాస్యంబును వెంటనంటిచనులీలన్ వెంటనేగన్ బ్రవే।
శించెన్ దారకుఁడాత్మపత్తనమునన్ సేనాసమేతంబుగాన్॥

సీ॥ అలవివస్వత్తేజమపవారితముగఁజేసిన శరోన్నతినొప్పు ఘనుఁడితండె।
మొనసి దారుణరణంబున వృషాములఁ బారఁదోలిన పురుష శార్దూల
[మితఁడె।
పూర్వదైవతమనోంబుజములు వికసించిశ్లోభిలఁజేసిన శూరుఁడితఁడె।
సముపాత్తశర్వరీచరరాజ్యలక్ష్మిప్రభవుఁడైన వాహినీపతియితండె।
యనుచు వీరమాహేంద్రపత్తననివాను।
లందఱుసుఁ గూటువులుగట్టి యన్నిశాచ।
రోత్తమునిఁ దారకునుతించునులివుదకట।
నన్యశబ్దమెయ్యదియు లేదయ్యో నవుడు॥

సీ॥ పయార్యతమిందీఆనీకళానిధిమాళిపరిరంభసుఖమును బడయఁగలదో।
యేపద్మిని యజస్రమీపురుషోత్తము నెదహత్తిసుఖలీలఁబొదలఁగలదో।

యెలమి నే శుభ వాణి యాచతురాస్యుని మోవి తేనియలాని మురియఁ [గలదో।
సతతంబు నేపుణ్యరతిగారవమున నీయనమాంబకున్నిఁగూడి యలరఁగ [లదో।

యని యనిర్వచనీయ గాఢానురాగ।
లైతలిరు బ్రాయమునమున్న యలరుబోండ్ల।
నూఢలుప్పరిగలమీఁదనుండి యతనిఁ।
జూచుచుండిరి మోహంబు సోడుముట్ట॥

మ॥ రణసుంధుర బరిపంథ్యసుగ్రసనసర్వాన్నినదా తార్క్ష్యథో।
రణు వేయంచులవాలుకోమలతరప్రాలంబ మెట్లట్లురోం।
గణమందూనియపూర్వమా జయరమన్ గైకొన్న తేజోధనా।
గ్రణికిన్ మంగళమంచు నెత్తిరువిదల్ కప్రంపునివ్వాళికల్॥

శా॥ స్థానీయస్థలానర్చు నాత్మవిషయశ్లాఘావచోనల్పని।
స్వానంబబ్జరిపూదయావసరశశ్వద్ఘూర్ణమానార్ణవ।
ధ్వానంబున్ బురుణింపఁదారకుఁడు రథ్యంబోయిచేరెఁ సురా।
స్థానిన్ మించిన శూరపద్మునిసముజ్యంబౌరవారంబుతోన్॥

మ॥ కొలవుంబెద్దలతోడ నచ్చమురునంగొల్వుండి యవ్వీటిగే।
స్తులసేనుంబులు వేలు వేలరసి యామర్త్యారశౌర్యాఢ్యుఁడ।
వ్వలనప్పారుల నెల్లఁగీములకుఁ బోవంబంచిద్దై తేయము।
ఖ్యులతోడన్ దగుముచ్చటల్ నెరపి వీడ్కొల్పెన్ సభాస్తారులన్॥

వ॥ తదనంతరంబున॥

శా॥ ఆదైతేయకులైకమండనునిచే నాజ్ఞాతులై చేటకుల్।
శ్రీదాబీశ్వరనైరుతాంతకులచేఁ జేకొన్న గాంగేయర।
త్నాదుల్ క్రిందికిడించి రాసులుగఁబోయంజూచి యత్యంతమున్।
మోదంబందెరి శూరపద్ముఁడసురేంద్రుండాదిగా బంధుగుల్॥

చ॥ తమకు నసాధ్యశత్రువగు దైవతనాథుని ద్రుళ్ళడంచెన ।
న్నముదమునన్ సురద్విడధినాథునిఁ దారకవీరునాప్తభా ।
వమలరఁ జూచి పోవుటకువచ్చిన మాల్యవదాదులౌ నహా ।
ర్యములోకొ నాగనుల్లసిలె నమ్మణిరాసులు హేమరాసులున్ ॥

మ॥ సభ చాలించి సవిత్రిఁ జూడఁ జనియాచండప్రతాపుండశా ।
శ్వభయప్రశ్రయభక్తియుక్తుఁడయి సాష్టాంగంబుగా మ్రొక్కెనా ।
శుభచారిత్రయుఁ బ్రీతినిర్గళితచక్షుర్వారివర్షంబుచే ।
నభిషేకించి చిరఁసుఖీభవయటం చాశీర్వదించెన్ సుతున్ ॥

శా॥ మాయాసూనుఁడు తారకాసురుఁడు భీమంబైన సంగ్రామమం ।
దేయడ్డంకియు లేక చక్రధరదేవేంద్రాదులం గెల్చి తాఁ ।
బోయెన్ సేనలతోడ నింటికని యాప్తుల్ సెప్ప నాలించి దై ।
తేయానీకభవుండు నైరుతుఁడు హృద్వార్ధికానందుఁడై ॥

క॥ వ్యపురంధ్రీనిభవనితము ।
త్రిపురంగాదిపదసహహిరణ్యపదముశ్రీం ।
ద్రపురంబు వీరమాహేం ।
ద్రపురంబాతండు సొచ్చెఁ దగుబలఁగముతోన్ ॥

చ॥ కొమరితఁ దారకాసురునకున్ సహధర్మిణిగా నొసంగుత ।
ర్షమునఁ బ్రభూతసంఖ్యపరిచారకవర్గసమేతుఁడై స్వగే ।
హమునకు వచ్చియున్న నికషాత్మజునిన్ సురసాత్మజాగ్రజుం ।
డు మిగులఁగౌరవించెఁ డకటాఁకుతనఁబెనలేని యాదృతిన్ ॥

వ॥ అంతలోన ॥

ఉ॥ చెలువపుటెల్లయీమెయని చెప్పఁబడున్ దగియున్నపద్మకో ।
మలయను సుందరిన్ దనకొమారిత నాత్రిజగత్యజేయుఁడై ।
యలరెడు శూరపద్మునకు నాశరనేతకు రాణిగాగనీఁ ।
దలఁచి తదాలయంబునకుఁ దిష్టజనన్ బొమ్మాదనంబునన్ ॥

మ॥ అసురేంద్రుండలత్వష్ట రాకడ ప్రతీహారుల్ నివేదింపనా ।
ప్తసమేతంబెదురేగి యాతనిఁ బ్రమోదంబొప్పఁ దోడ్తెచ్చియ ।
ర్ఘ్యసపర్యల్ కడుఁ బ్రీతిఁ గూరిచి మహారాజోపభోగార్హవ ।
స్తుసమృద్ధంబగు గొప్పయుప్పరిగలోఁ దూఁకొల్పె నాశ్రీలునిన్ ॥

ఉ॥ త్వష్టయు మూలయేలికయు దైత్యకులేశ్వరునింటఁ గొన్నినా ।
ళ్ళిష్టవినోదమోదముల నింపుగఁ గాలముపుచ్చి హృద్గతా ।
భీష్టము విన్నవింప నసురేంద్రుని పాలికి నొయ్యనేగియ ।
క్లిష్టముగాఁ గుటుంబదశమీస్థునకిట్లని రాసురారికిన్ ॥

మ॥ కటి వేల్పంతటి వానినోర్చె నొకఁడొక్కండంచితన్యాయమే ।
మఱి కేలున్ ద్రిజగంబులీదృశులు మన్మల్ గల్గునీతోడిచు ।
ట్టటికంబున్ మదిఁ గోరివచ్చితిమి గాఢప్రేమకారుణ్యముల్ ।
నెఱయన్ మా మొఱయాలకించి నెఱబాళిన్ మమ్ము మన్నింపవే ॥

మ॥ త్రిజగద్వందితుఁడైన కశ్యపునకున్ దేవేరివై నీప్రియా ।
త్మజ త్రైలోక్యమునందుఁ గల్గు కులకాంతాజాతిలో నెల్లన ।
కగ్రజమా వాసికినెక్కె నమ్మునికిఁ దోకంబౌటచే నిమ్మహా ।
భుజులన్ బుణ్యులు తత్ప్రపోదితమహాబోధుల్ యథార్థంబుగన్ ॥

గీ॥ అర్ఘ్యసత్పాత్రములకుఁ గన్యలనొసఁగి ।
యమలవర్తనములఁ బితృణములుదీర్చి ।
కూకుములుదూఁకొనెడు పుణ్యలోకములకుఁ ।
దగినవారలఁ జేయవే తండ్రి మమ్ము ॥

ఉ॥ ఈశ్వరసాక్షికంబుగనె యుద్ధిముఖస్తుతికామ దైత్యలో ।
కేశ్వర యీమహోన్నతికి నీవనిమిత్తము నీకతంబునన్ ।
శాశ్వతకీర్తిఁ గాంచరి నిశాచరులీటు సేయకున్నల ।
క్ష్మీశ్వరుఁ డిమ్మహాన్వయము నింతకుమున్నె యడంపకుండునే ॥

మ॥ అనుడుఁ మందహాసోపలక్షితముఖుండై దైత్యవర్యుండు సం।
డనునో పావన వృత్తులార ఘనమాహాత్మ్యాపరాంభోరుహా।
సనుఁడై విశ్రుతుఁడైన భార్గవుని పాద్రసన్న్యంబునం జేసియీ।
యనిదంపూర్వముభావుకాతిశయమిట్లబ్బెన్ యథార్థంబుగన్॥

ఉ॥ ఆమహనీయుఁ డేమిపని యానతియిచ్చిన నాదరంబునన్।
మానుదికాని దేశమునమాహితమయ్యెను నియ్యకొంటయున్।
మీ మొనరింపఁబూనినపనిన్ వలదంచునతండుమాన్పినన్।
బూనియ లేకమానుటయుఁబోలు బతంబులు మాకజస్రమున్॥

క॥ అయ్యుశనున కెఱిఁగింపక।
యెయ్యదియునుఁ జేయఁబూవ మెన్నండునునా।
జయ్యయధీనములుసుడీ।
యియ్యసురులు నీతనువులు నీసంపదలున్॥

ఉ॥ కావునమీయభీప్సితము కావ్యునకున్ దగవిన్నవించియా।
కోవిదమౌళిరత్నము భృగుప్రవరుండెదనిశ్చయించియే।
త్రోవఁజరింపనాదరముతో సెలవిచ్చునో యాపథంబునన్।
బోవుదమంచు నద్దితిజపుంగవుఁడాత్మఁదలంచె భార్గవున్॥

సీ॥ తనప్రయాణప్రయత్న మెఱింగిక్రొత్తడిమిన్నయాశతపర్వచిన్నఁబోవ।
వేద్యమానాధ్యాత్మవిద్యారహస్యులు బోధవిఘ్నమునకు నాధిఁజెందఁ।
దడయకే తెండని యడఁకువమై వేఁడి ఛాత్రులు కొంతదౌసాగనంప।
వెటనుండివచ్చునో భృగుఁడంచుఁదలెత్తి సోఁకులభ్రమువంకఁజూచు [చుండఁ।
దనతనూదీధితులచేతఁ దచ్చికడలు।
వెల్లవేసినగోడల విత్తముగాఁగఁ।
దెల్లనై యుల్లసిల్లనద్దితిజగురుఁడు।
వీరమాహేంద్రమునడిగ్గె వింటనరిగి॥

ఉ॥ గద్దియడిగ్గి తా నెదురుగా నరగన్ జని యర్ఘ్యపాద్యముల్ ।
తద్దయుభక్తిమైనొసఁగి దానవనాథుఁడు వింత తేజునన్ ।
బ్రొష్టునకద్దియైన భృగుముఖ్యుని పాదపయోరుహద్వయిన్ ।
బెద్దయునేపుప్రాలిచలిపెన్ బహువారముగాఁ బ్రణామముల్ ॥

క॥ నైరుతుఁడు నుఁద్వష్టయుతే ।
చీరవనేత్రమహీణతేజ సేనమయనుచున్ ।
భూరితరభక్తి నెరగిరి ।
తారునసురదేశికుని పదద్వయమునకున్ ॥

ఉ॥ రక్రసితేనికిం గురునిరాక భుజిష్యులు విన్నవించినన్ ।
గ్రక్కునఁగొల్వుమాని తనగాదిలితమ్ములు వెంటనేగనా ।
సుక్కురుచెంతకున్ జని యన్యోథమఁడాతఁడు తమ్ముదోయితో ।
మొక్కె నిజాఖిలాఘనముల్ మహిబిగ్గకవుంగిలింపగన్ ॥

క॥ అడుగడుగకు మడుఁగులొగ్గుచు ।
నడఁకువతోఁ దారకాగ్రజాములు వెంటన్ ।
నడవగనయ్యెను రాచా ।
ర్యుఁడు మోసలకరిగె నొయ్యనొయ్యనడచుచున్ ॥

చ॥ చదురునకేగియున్న తలసన్మణిపీఠమొకండు సూపివా ।
రెదుటనె నిల్వనందు వసియించుచు వారికిఁగూరుచుంటకున్ ॥
ముదలయొనంగె భార్గవుఁడు మ్రోలనె వారునుఁగూరుచుండిర ।
ప్పుదితిజవృద్ధుతోడఁ భృగుపుంగవుఁడిట్లనె సస్మితాస్యుఁడై ॥

మ॥ ననురప్పించుటకున్ గతన్మైఁటుగుమున్ దైత్యేంద్రనీపెద్దను ।
న్మదికిన్ బట్టముఁగట్టిసప్పుడవచింపన్ లేదెయిత్తారకుం ।
డనివిష్ణ్వామలనోర్వఁజాలుటయుఁ దాష్ట్రాఖ్యుండున్ నైరుతుం ।
డునొగిన్ గన్నెలక్ష్మీకుమారులకు రాఁబల్ గాగ నీనుంటయున్ ॥

మ॥ తగుఁదథ్యంబుగమీకునీ గృహులబాంధవ్యంబువీరున్ బ్రశ।
స్తగుణుల్ వీరితనూజులోపనితసౌందర్యాలవాలంబులి।
చ్చగురుంబోదులేసుమ్ము నీమనుమలన్ జేపట్టనర్హుల్ తలం।
పగనీకన్నెలెతెక్కు - వీరికనురూపల్ లేరులోకత్రయిన్॥

గీ॥ అనుచుఁ దొలివేలుపులయొజ్జయవ్విధంబు।
నన్ వచించుటయునుఁద్వష్ట్రనైరుతులును।
శూరపద్మతారకులు నత్రుల్లకప్రి।
మదమెదలఁజెంది మేనులెమఁ బదిరపుడు॥

చ॥ స్వకటమునుండిలేచి దితిజస్థవిరుండసురేంద్రుఁడప్పుము।
ద్వికసితలోచనుండయి కపిన్ బొడగాంచియనున్ గళత్రికా।
రకుఁడనిజ్ఞానులెల్లరు నిరంతరమున్ మిముఁజెప్పుకొంచునుం।
టకుఁదగురీతిఁబలిక్కు-తిరిటన్ గలవారలకెల్లఁబ్రీతిగన్॥

ఉ॥ వమ్మగునయ్య యొప్పును భవద్వచనంబులు మాకుమీరిదే।
శమ్మె మహాప్రసాదమిది సత్యముకాదొ మహాత్మదివ్యది।
త్రమ్మనకున్ సుబోధమెకదా తడవేటికికన్ శుభస్యశీ।
ఘ్రమ్మని నిశ్చయింపుడు జగన్నుతపెండిలిమూరుతంబులన్॥

ఉ॥ కాలముసెల్లినట్టి ముదుకండనుకన్నులవిందుగాఁగనీ।
బాలురపాణిపీడనశుభంబులు చూచుటకున్ మనంబునన్।
లాలసచాలయున్నయదిలాతివిలాతులు చాలదవ్వుపో।
జాలనుగాన నిచ్చటనె సల్పఁగఁగోరెద నీవివాహముల్॥

చ॥ ఇదియనుదాశయాభిమతమింతకు నీయుచితజ్ఞులైన కూ।
కుదులయభీప్సితంబులునుఁగూడఁ గనుంగొని వారియిష్టమె।
ట్టిదొ యటుసేయఁగాఁదగుఁజుఁడీ యనియొజ్జకు విన్నవింపన।
స్మదభిమతంబునట్టిదపరిసవ్యమువల్కు దుమే త్వదిష్టికిన్॥

క॥ ఇంతగౌతుక నేటికి యిది ।
యంతయునీ చలువగాదె యసురేంద్రభవ ।
చ్చింతితములు కావనికృత ।
మంతులమగునంత తుచ్ఛమతులమె చెపుమా ॥

క॥ జగదీడ్యుండగు భార్గవ ।
భగవానుని యానతియును భవదభిమతముఁ ।
మిగులముసుమిత్రకరణశు ।
ద్ధగ నమ్మగదయ్య నెమ్మదిఁ మానుడువుల్ ॥

ఆ॥ మీరునాజ్ఞయును విచారించియేమిశా ।
సింతురల్పె మేముసేయనున్న ।
వారమనుచుఁద్వష్ట్రనైరుతులత్యంత ।
వినయమెనయవిన్నవించుటయును ॥

క॥ ఆదైత్యస్థవిరుఁడుసం ।
మోదాతిశయాపదేశభూరితరక్షీ ।
రోదమునఁ మునిఁగెనుర ।
క్షోదేశికముఖ్యుఁడును వికుర్వాణుండై ॥

సీ॥ సాదుగాములు జీవసౌమ్యాదికులు కోణధనకేంద్రములయందుఁదనరు [నదియు ।
బాపగ్రహములర్కభౌమాదులాటిటమూట నేకాదశంబునఁగలదియు ।
గ్రహములెవ్వియును లగ్నాత్సప్తమంబైన జామిత్రమందు నెసంగ [నిదియు ।
సమ్యగస్త్యైకవింశతిమహాదోషమై యూనదోషము లేనిలేనిదియునుఁ ।
జంద్రతారాబలాది ప్రశస్తమైన ।
యదియునగు మేలిలగనమయ్యా సురగురుఁడు ।

సుకుమారుఁడు నిర్ణయించెను శూరపద్మ।
తారకులయాపయామికోద్ధర్షమునకు ॥
వ॥ అటుపిమ్మట ॥
ఉ॥ శూహృదయాళుఁడా దితిజవృద్ధునకుంగల దోహదంబుసం।
దేహములేకవశ్యమును దీర్చ నెయుక్తముగాన సర్వస।
న్నాహముతోడఁ బాంధవజనంబులు మీరును నేగుదెంచియు।
ద్వాహము లిప్పురంబుననె వైభవమొప్ప నొనర్పు టొప్పగుఁన్ ॥
తరల॥ అనుచుఁ ద్వష్టకు మూలతేనికి నాభృగూత్తముఁడానతి।
చ్చినహసాదని యమ్మహాత్ముని శిష్టినాదలమోదిత్వ।
ష్ట్రనికపాత్మజులచ్చటంగలచిన్నపెద్దలనెల్ల వీ।
డ్కొని ముదంబుననిండ్లకేగిరి గోష్యరుల్ తమవెంటరాఁ ॥
క॥ నగరునగరంబుశాఖా।
నగరములును వింతచెల్వొనరఁ విలసిలున।
ట్లుగఁగ్రై సేయుటకతికృతు।
లగు శిల్పులను నియమించె నసురేంద్రుఁడుదాఁ ॥

* సీసమాలిక *

ద్వారకుడ్యవితర్దులపరంజిమడికాసులజలపోఁతలచే మొలాముచేసి।
యెల్లవీధులయందు నిరుగెలంకులఁ జాలుగాదృఢోన్నతగువాకములు [నాటి।
యొఱనిగ్గువల్వలునింపైనసరిగపేటులను ఘంటాస్తంభములకుఁ జుట్టి।
లఘులయంబున శ్రీవిలాసరంగాయమానములుగాఁగా యమానములు [వైచి।
పలువింతవన్నెలపట్టుపుట్టములచేఁ బొలుపుగా నుల్లోచములను గట్టి।
నియుతాయుతాద్యవక్రయముల్లైనసుపాణిము త్తెంపు తోరనమ్ములొన [గూర్చి।
పందిళ్ళనెల్లెడఁ బల్లుతెఁబంగుల లసత్కాచప్రదీపపాత్రములు నించి।

యందంద పృథులంబులగుచోట్లఁ బలువన్నియలదోమ తెర సరాతులు [ఘటించి।
ద్యోసతుల్ డిగివచ్చుచుండిరోయనఁదగు మేలికీల్బొమ్మలు గీలుకొల్పి।
పాటీరవారిశృంగాటకంబుల సంసరణముల రథ్యావిపణులఁజల్లి।
యెల్లచూపఱులును నిదియభూలోకవైకుంఠమనఁగసంమగొందు లేని।
కిడమువడకయుండఁగ సేసిరప్పుడుఁ జేయిదీరినట్టి శిల్పివరులు॥

క॥ చల్లెడువారు కలాపుల్।
చల్లఁబడు నవియునుంగలాపుల్గనుచుభూ।
షోల్లసితులగుచుఁ జానపి।
జల్లెడు డింగరులఁ గేలిసల్పిరి పౌరుల్॥

మ॥ అరవిందోదరుఁ వొట్టిబెట్టికులనయ్యాదిత్యులన్ ఘోరసం।
గరరంగంబునఁ బాఱఁదోలి హరిలోకంబైన వైకుంఠమిం।
దిరతోఁగూడనె తారకుండవనికిన్ దెప్పించెఁబోయంచుమె।
చ్చిరిచిత్రంబులఁ జూపఱెల్లరునుఁ దచ్ఛృంగారవైచిత్రికిన్॥

శా॥ అంతంగోణపుఁడొపయామికశుభాహంబుల్సమీపించుడున్।
సంతోషాతిశయోల్లసద్హృదయులై జాయాతనూజాదిశు।
ద్ధాంతైణాక్షులు యాప్యయానములమీఁదన్ వెంటనే తేరఁగా।
వ్యాంతేవాసులరాజధానికరిగెన్ సామాత్యబంధ్వాదియై॥

క॥ ప్రమదమునఁద్వష్టకొమిరెలఁ।
గుమారికాదులను వెంటఁగొనిసహాసుహృదు।
త్తమబంధుచేటకస్తో।
మముగఁబ్రవేశించె వీరమాహేంద్రమునన్॥

ఉ॥ తారకశూరపద్మలకుదారులు నోకుడుతేఁడుఁద్వష్టయుఁన్।
గారియుఁబద్మకోమలయునాఁబడుకన్నెలఁబెండ్లిసేయుటల్।
చేరువపల్లెలందు నివసించుపజల్ వినితత్పురంబునన్।
జేరిరి తన్మహాద్భుతవివేషములన్ గనులారఁజూడగన్॥

శా॥ పాంచాలాంగకళింగవంగకురునేపాళాంధ్రకాశ్మీరలా ।
టాంచత్కోసలసింధుఘూర్జరవిదర్భావంతిచోళాదిష ।
ట్పంచాశద్ద్వీపరియాధినాథులు మహోపగ్రాహ్యముల్ చాలగాఁ ।
గొంచే తెంచిరి తన్మహంబునకురక్షోనాయకాహూతులై ॥

సీ॥ అరిగినఁదద్మ్నానరాశనుల్ పెండిలిచుట్టంబులకు విందుబెట్టుమరోకో ।
పోకున్నదితిజాధిపుఁడుతమ్ముఁబెనుకిన్కచిచ్చునకాహుతిసేయునొక్కొ ।
యేగినఁబోకపోయిన నన్నిశాచరావములచేఁ దమచావవశ్యభావి ।
యనినిశ్చయించి యర్హవయస్కులగు నాత్మజన్ములకెలమిరాజ్యంబొ [సఁగి ।
గ్రామదేవతగుడికి నిర్దయహృదయులు ।
జాతరకుఁదోలుకొనిపోవు ఛగలకముల ।
పగిదిన సుగదూతులవెంటఁబ్రసభమునను ।
హింసులకిగిరి వీరమాహేంద్రపురికి ॥

చ॥ తమరెదలన్ దలంచినవిధంబునఁగాక నిశాచరాన్వయో ।
త్తములగు శూరపద్మఁడును దారకుఁడున్ దనుకెప్డు నెందులో ।
ప మొకఁడుగల్గకుండఁ దగుభంగులనారయుచుండభృత్యవ ।
ర్గమునియమించి మంచియుపకార్యములలోవిడియింపఁజేయుదున్ ॥

శా॥ ప్రత్యక్షాత్ములనిష్టదేవతలనారాధించునట్లాదరా ।
న్నిత్యంబొప్పనెడెప్డు గావలయునన్నన్ జేయుచున్ గ్రవ్యభు ।
గ్భృత్యుల్ సల్పునపర్యలన్ దనిసి సంకీర్తించిరాతేంద్రునా ।
సత్యాకారులఁ గశ్యపాత్మజులఁదత్సౌశీల్యసంపత్తికిన్ ॥

క॥ ఎపుడెపుడటంచు స్థానీ ।
యపుటిలుతేంద్రల్ల నుత్సుకాత్మకులై వే ।
డఁబడుచునుండఁగ నొడయుల ।
యుపయమవాసరమువచ్చెనుద్ధగగన్మై

వ॥ అప్పుడు శుక్రునాదేశంబున

క॥ వడకాడఁ గాళ్లు జెతులు।
నొడలంతయు నిట్టగ్రమ్మ నొప్పఁగ ముత్తో।
పడఁతుక లప్పుడు పెండిలి।
కొడుకుం జేసిరల తారకుఁ దదగ్రజునిన్॥

ఉ॥ యాతుఁ గురుండు లగ్నసమయం బెడలేదని యానతిచ్చుడున్।
గాతుకపారవశ్యమునఁ గ్రక్కునఁ గొండలశిక్కు లేగి మా।
యాతనుజాతున్ సవినయంబుగఁ డగ్గరినిల్చి మాంగళ।
స్నాతులఁ జేయ నాతియొసంగె గురుండని విన్నవించుడున్॥

ఉ॥ కంగిస నేలలన్ బగలగోరులఁ గాల్చిన రక్కసీఁడురా।
సింగములా సహావరులు శీర్షము లెత్తి నభస్స్థితర్క్షురా।
శింగని యానుమూరుతము చేరువయయ్యెనటంచు మంగళా।
భ్యంగములాచరింపఁ జని రాప్లవశాలకు హర్షమాణులై॥

చ॥ పొలఁతుక లప్డు రత్నమయభూషలు వుచ్చి జిలుంగుక్రొత్తను।
స్తులు విడిపించి క్రొందడుపుదోవతులన్ ధరియింపనిచ్చియుం।
పులుగుపులుంగులా వెడఁదముక్కలిపీటలపై సుఖోపవి।
ష్టులనొనరించి యాసురససూనులమున్ దలలంటి రర్మిలిన్॥

సీ॥ సుషమంబులగు నుదుస్సూన్నకేశకల్ పీవరస్తనములమీఁద నర్తనము సల్పఁ।
దమ్ముల పైపట్పుదముల మొత్తమ్ములవలె నాననముల పైనలకలోలలయ।
శ్రమసంజనితఘర్మజకణంబులు ముత్తియము లట్లు మేనులనందగింపఁ।
బలువన్నె రతనంపుఁ దళుకుఁ గాజులజతల్ చెవులపండువగు శింజిత
బసిఁడిడబ్బరలోని సంపంగినూనె। [మొనర్పఁ।
కమ్మతావుల నగరెల్లఁ గమ్మునఁగ।
నక్కుమారకులకుఁ దలలంటిరపుడు।
చకితసారంగపృథుకలోచన లిగురుపురు॥

సీ॥ ఘమఘమఁ బరిమళించు మృగమదంబున నలుగు వెట్టిరి కొందఱలరుఁ [బోండ్లు।
ఫేనిలరసముగుబ్బేతలుకొందఱువంపఁదలలురుద్దిరి కొందఱళికురలు।
నిర్హారిమైనపన్నీటిచేఁ జలకమాడించిరి కొందఱు కాంచనాంగు।
లధివాసితములైనయంశుకంబులచేతఁ దడి దీరొప్పఁగఁ గొందఱొత్తఁ [గురులు।
తిమితవస్త్రముల్ విడిపించి యమితవన్న।
ములగుబృందిష్టకౌశేయములనుగట్టి।
కొననొసంగిరు విడలడంకువయొసంగ।
దారకునకును శూరపద్మవిభునకును॥

క॥ మృగధూపంబులచేఁ గై।
శికములఁ బడియార్చిరయ్యశిశ్నల్ భువన।
ప్రకటభుజావిక్రములకు।
నెకిమీండ్లకు సంతసంబు లెసక మెసంగన్॥

క॥ ఫాలములఁ దిలకములునుఁగ।
పోలంబులఁ జుక్కలుఁ బ్రమోదం బెసఁగన్।
వాలుఁగనులఁ గాటుకయునుఁ।
గీలించిరి రాచవోయిలుకిఁ వ్యాగనయనల్॥ [బెట్టె।

సీ॥ తీరైన యాణిముత్తియఁపుఁ జౌకట్లొకరు హారిమధ్యజానుగులంబుఁ
బ్రాలంబికలమూల్యరత్నహారములును నొక్క ప్రసాధిక యుంచె నలుత।
నంగుళీయమువాపకాంచలోరవణమ్ము లొకనితంబిని చేతులకును మర్చె।
నొకతె యుష్ణీషకేయూరముల్ గైసేసె శిరములందును భుజశిరము
సంప్రహారవిజితులైన చక్రధరశ। [లందు।
చీథవామలప్రతికృతుల్ చెఱివియున్న।
గండపెండేరములనొర్తు కాళ్ళఁదొడిగెఁ।
బెండ్లికొడుకులకు సురపాప్రియసుతులకు॥

చ॥ ప్రకృతిమనోజ్ఞులన్ వరశుభప్రతికర్మనితాంతభావితా।
ధికతరమంజిమాతిశయదీపితమూర్తుల శూరపద్మతా।
రకులఁబురోధసుల్ సురుచిరంబుగ నొప్పువివాహమంటపో।
ర్వికిఁదోడితెచ్చి వారినుపవిష్టులఁజేసిరి పెండ్లిపీటలన్॥

ఉ॥ నాయులఁగూడఁగాఢనుదనవ్యథఁబాల్పడఁజేయఁజ్వాలుబృం।
దారకలౌచుమల్లసిలుద్వష్ట్రుతనూభవబద్మకోమలన్।
గౌరిని నైరుతాత్మజనుఁ గారమునన్ దోడితెచ్చి తత్పరి।
ష్కారములెల్లఁబుచ్చి యరుసంబెసఁగన్ దలలంటిరైదువల్॥

గీ॥ నీలిరెంటముచే నిండుమేలుముసుఁగు।
వెట్టుకొన్నట్లు మే నెల్లఁదట్టముగను।
గప్పఁజాలిన ఘనకైశికములుమడిచి।
పొవలువైచిరి వృకధూపమునను విదలు॥

క॥ పెట్టిరితగఁగల్యాణఁపు।
బొట్టులు నెన్నుదుట నేత్రములఁగాటుకయున్।
బెట్టిరి పెండ్లిపడుచులకుఁ।
గట్టించిరనర్ఘచిత్రకౌశేయంబుల్॥

క॥ కొమరొప్పారనలందిరి।
గమగమగమవలచు యక్షకర్దమమునుపో।
కుమడంతుకలా పెండిలి।
కొమరితలతనూలతికలకున్ బ్రమదమ్మునన్॥

క॥ మణిహేమమయములైపర।
ణములనియుతాయుతాద్యవకయములనై।
పుణమునఁగైసేసిరిశుభ।
గుణలగునారాచపెండ్లికూఁతుల నతివల్॥

క॥ విలసద్రమచిరాకృతులా ।
చెలువలుపయసుమునకట్లు శృంగారితలై ।
పొలిచిరి పులుగడిగినశన ।
విలుకునరాజీలయట్లు వింతసొబగునన్ ॥

క॥ కొండికకండోలంబులు ।
రెండిఁటిలోఁగొంతదనుక ప్రీహులునుచిక్కా ।
ర్చుండం జేసెరియంమన్ ।
బెండిలికొమరితలఁగర్పేశలులొజ్జల్ ॥

శా॥ శ్రౌతస్మార్తవిధిజ్ఞుఁడున్ సకలతంత్రజ్ఞుండు నైనట్టిని ।
ష్ణాతుండైనపురోహితుండు సభికుల్ శ్లాఘింపఁగల్పోక్తమా ।
రీతిన్ షోడశసూపచారములఁగారీపూజఁ జేయించెన ।
ష్ణాతన్వంగుల చే ననేకవిధతూర్యారావముల్ మ్రోయగన్ ॥

క॥ సకలాతుపట్టుగింటెము ।
లకలంకాత్ములగు వరులకడ్డముగాఁబ ।
ట్టుకొనసువిదలాసందిక ।
డకుఁదెచ్చిరి పున్నెఁపుం బడఁతులువధువులన్ ॥

గీ॥ వరులకడ్డమువట్టిన తెరలకివలఁ ।
బెండ్లిపీఁటలచెంగటఁబిటమాలందు ।
స్తంబకరిసామిపూర్ణోదరంబులందుఁ ।
బెండ్లికూఁతుండ్రఁగూర్చుండఁబెట్టిరపుడు ॥

క॥ కన్నియవిశుపరులిరువురు ।
నన్నులతో క్షౌమధారణాంచితులై యం ।
దున్నపసిఁడిపీఁటలమీఁద ।
దన్నెఱిఁగూర్చుండి రాత్మతనయలప్రకరన్ ॥

శా॥ సంకీర్ణంబుగ తేంట్లఁ జైత్యాలు సమజ్యన్ నిండియూర్పుండఁజ।
త్పాంకేజాసనులౌ పురోధలు వచింపన్ మంత్రముల్ దష్టధీ।
న్యంకుద్వీపులు త్వష్టృనైరుతులు కన్యాదాతలయ్యిర్వురున్।
సంకల్పించిరి కన్నెదారకు మహాసంకల్పపూర్వంబుగన్॥

ఉ॥ బజ్జలుమంత్రముల్ చదువుచుండఁగఁ బంగరుగిండ్లలోని మే।
ల్గాజ్జగినీరు దేవెరులుకొంచెముకొంచెము వంపఁ బంధుగుల్।
పజ్జలనుండఁ గ్రొంబసిడిపళ్లెములందువరోల్లసత్పదో।
ద్యజ్జలజంబులంగడిగిరప్పుడు త్వష్టయుమూలతేఁడునున్॥

ఆ॥ కాళ్ళుకడిగి యిట్లుకన్నెదారలువోసి।
వివిధతూర్యముల్ రవింపఁ బ్రమద।
మెసక మెసఁగవరులకిచ్చిరి మధుపర్క।
ములునుఁ గ్రొత్తసరిగపుట్టములును॥

ఉ॥ శంకరభక్తులైన సురసాతనుజాతులకున్ మహాధనం।
బుంకువయిచ్చి బంగరఁపుటుత్తరజందెముతో నవోపపీ।
తాంబులఁ జేసిరఘ్ని కసాత్మభవుండును ద్వష్టయున్ గురుల్।
కంకణముల్ కరంబులకుఁ గట్టిరి భవ్యవివాహదీక్షకున్॥

క॥ లగనముతటియిడెయనుచున్।
గగనంబుననున్న తారకాగణమున్నుజ।
కగఁగజాదిలబ్ధవర్ణుం।
డగుకార్తాంతికుఁడు త్వరితుఁడై చెప్పుటయున్॥

శా॥ పౌరోహిత్యవిచక్షణుల్ గురులు చెప్పన్ పెండ్లికూఁతుల్ వరుల్।
తారన్యోన్యమజాజియున్ గుడమునుఱ్ లజ్జాప్రమోదంబులే।
పారఱ్ మస్తములందునుందిరపసవ్యంబైన కేలఱ్ ధ్రువం।
తేరాజావరుణో ధ్రువమ్మనుమనూక్తిఱ్ శ్రోత్రియుల్ వాకొనఱ్॥

గీ॥ తుములముగఁ బణవపటహాదితూర్యముల్ ధ్వ।
నింపమాంగళ్యతంతునా నేనయనెడు।
శ్లోకముఁ బురోధసులు చెవిలోనఁ జెప్పి।
యనుడుమీఁగని తెల్పఁ దాముడు నొడువుచు॥

క॥ లలనామణులగువధువుల।
గళసీమలయందువరులు గట్టిరెలమిమెం।
గళసూత్రంబులు బందుగు।
తలిరుంబోండ్లుల్లసన్మదంబునఁ జూడన్॥

శా॥ ముత్తోచానలు పైఁడిపుట్టికలతో ముందుండియంకీయుడున్।
జిత్వావేష్టితమైన గాటమగుహ్రీఁ జేఁ బెండ్లికూతుంద్రుమో।
మెత్తంజాలమినొద్దిస్త్రీలు చేయిదోయింబట్టి పోయింపఁగా।
ముత్యంబుల్ తలఁబ్రాలువోసికొని రామోదంబునన్ దంపతుల్॥

క॥ ఆదంపతులకప్రకుస।
ట్వాదవిమల్ సఖికులుకురు తేతస్వాత్త।
స్వాదహరు రామలాశీ।
ర్వాదములొనరించిరుచ్చరవములు చెలఁగన్॥

క॥ ఆర్యాగ్రగణులకుయాజ్ఞఫలి।
నీర్యాయను మంత్రముఁ మనీషిపనితులా।
చార్యులునొడువనొనర్చిరి।
భార్యాసహితులయి వరులు ఫలదానంబుల్॥

ఉ॥ గోఁజెసలారసిల్పి తమకోమలగీతులు నన్నుకాఁడ్రకున్।
మాఁటాడవింపహో చెలులు మంగళహారతులిచ్చిరాఁ ద్రక్రోం।
బైఁటచెలంగులన్ వరులపైవలువల్ ముడివైచిరొజ్జలా।
పీఁటలమీఁదనుండిమఱి పెంబున లేచిరి యాంశనూనుల్॥

ఉ॥ పున్నెఁపుటింతులయ్యలరుఁబోఁడుల నొయ్యనలేవఁదీయుచున్ ।
మన్ననఁజెప్పఁబెండిలికొమార్తల దక్షిణదోఃకనిష్ఠలన్ ।
గ్రన్ననఁబట్టిరవ్వరులు కామవికారజమైనసూనచే ।
స్విన్నములౌటఁజేసితమచేతులుసారెకుఁజాఱనొయ్యనన్ ॥

ఉ॥ ఆకనకాంగులిర్వురు నస్యజకర్మకుపూనికిన్ ద్వితీ ।
యాకృతలౌటఁదత్తనులయందులఁజల్లినరాగబీజముల్ ।
మొలకలువెట్టెనోయనఁగఁబొల్చినవయ్యె వరుల్ కరాంగుళుల్ ।
చేకొనినప్పుడాసతులచెల్వపు మేనులఁబుల్కలెల్లెడన్ ॥

గీ॥ పెండ్లికొమరులు కృతపాణిపీడనులయి ।
తెలుపుదగ్గిరపాటలు తలిరుబోండ్లు ।
వాడిపేరులుసెప్పించి పంపఁజనిరి ।
వ్రేల్మికై యగ్నులుంచిన వేశ్మములకు ॥

క॥ అంచితములైనయగ్నుల ।
నుంచిప్రవేశప్రధానహోమంబులు సే ।
యించిరి సప్తపదిన్ ద్రో ।
కించిరి జంపతులచే నకిల్బిషులాజ్ఞల్ ॥

క॥ ఆతోద్వారావముక్రం ।
బైతారాపథముముట్టనాఖ్యాతార్థా ।
శ్రౌతవచనులై యారం ।
జోతినిజూపిరి పురోధసుల్ వారలకున్ ॥

క॥ అమరారులు స్థాలీపా ।
కమునిర్వర్తించిపిదపఁగావించిరినై ।
గములయు హితులయు బంధుజ ।
నములయుతోఁగూడి జేమానంబులు వేడ్కన్ ॥

శా॥ ఆయుద్వాహములందు నొక్కనిముసంబైనన్ విరామంబు లే।
కాయాతాఖిలజేమనార్థులకు నాప్యాయంబుగా నన్నపా।
నీయంబుల్ పలుపించి వంటలును బిండీండ్లెల్ల నజ్జారెవ।
హ్వాయంచున్ గడు మెచ్చుచున్ గుడిపి పోవం బెట్టిరే నాళ్ళనున్॥

చ॥ మొనటనె నేక వాద్యములు మ్రోతలు పిమ్మట నాట మేళముల్।
పదపడి చిత్రభూషితులు బంధువులొప్పయి జాణసంచు మే।
టిదినుసులొప్పు వార్కి యవడిన్ జనఁ గన్నులు చాల వేమిచే।
యుదుమని కొండిరప్పటి మహోత్సవమున్ దిలకించు నైగముల్॥

సీ॥ తూలలు గొల్లదొండులు వాలుగలు రాతిగొరకలు మేవలుకొజ్జమీలు।
పాలసలు పులిమెకంబులు బొందపకేరులు పుల్లలమట్టలు చారమీలు మట్ట।
గిడుసులు మోరపకేరులు మునదొన్నలొల్లెంకెలు బొచ్చెలిల్లెములు [కొరద।
లసజులు ముచ్చంగులల్లెదమ్మలు బేడిసలును మున్నెనవైన పారిశములఁ।
బట్టి తెప్పించి పెండిలి చుట్టములకు।
విందు వెట్టిరున్నన్నాళ్ళు వేడుకలర।
మీకెపుడుఁ జేటుగంటుల మీఁదనింత।
ప్రతిఘమేమనుచుబాదాగుల్ త్రస్తరింప॥

గీ॥ చిచ్చుబుడ్లు మతాబులు చిన్నెలుబిల్లు।
సులునులోనైన బాణసంచులనేకములఁ।
వెలుఁగుచేనాకసంబెల్ల వింతచెలువు।
పూనెనారేల్పగల్లయ్యెనేను నాళ్ళు॥

చ॥ నృగవయ వాదిహీనులగుదీనులనాదర మొప్పఁ జిక్చెశ్ర।
ప్తిభుజి లెప్పఁ బెట్టుటకుఁ బెక్కకిలింబని వాఖిమించెలె।

స్నగఁబచ చేసిపోసినపసాదపురాసులుఁ గూరలున్ మహా ।
నగములునొద్దిగుట్టలు ననందగి రాజిలె నైదునాళ్ళనున్ ॥

గీ॥ రవిపొడుపు మొదలర్ధరాత్రంబుదాఁక ।
వేయువిస్తళ్ళనున్ దీసి వేయుపల్లె ।
యాకులునుఁ గాఁగ వేన వేలారగించి ।
రరనిముసన్నైనఁ దెఱపి లేకైదునాళ్ళు ॥

సీ॥ పవీక్షిగన్న నాపృథుకంబు గాఁ గృహుల్ బహుచిత్ర నైపథ్యపిహితగాత్రు ।
లే పేటలో కేఁబోయిన మనఃపారవశ్యవదాన్యపీణాది సంక్వాణనము ।
లే వాడ కేగినమృగనాభిజోంగక సాంకవామ్యుత్తమసౌరభములు ।
నగరి నెందరిగినఁ బగటివేసములు మొదలుగా వినోదపాత్రములయాట ।
లే బయటి కేగిచూచిన నిలుకటముగ ।
సమరిచినయన్యనీవృత్సచూఁగ తార్థి ।
జనములువసించు పెనుగొల్లియనలునొప్ప ।
నానగర మొకర్రుక్రొత్తపోలయ్యె నపుడు ।

వ॥ ఇట్లుపరిణయంబులు నెఱపి యహైమ్యవానరంబుల నుచితసమయంబుల సనస్యంబును శేషహోమంబును నాకబలియులోనగు విధివిహితకృత్యంబులునుఁ జదురుతగవుచుఁ గ్రంతయు నెమరుకోలుసంబరంబును దొంగ్రవేలిమియు నలకపాన్పును మిథునఁపు పిడియంబులునుఁ జ్యోత్స్నవంబును లోనుగాఁగల వేడుకచెయిదంబులును నిర్వర్తించి చూపఱకునుస్వాపలేపామలను మఱపించు నృత్తగీతవ్యంజకాది వినోదంబులచే మహోత్సవంబుగా నాశుభాహంబులైదునుఁ గడపి యనంతరంబున ॥

క॥ అకార్యశ్యపులను వధువుల ।
పౌకప్రశస్తనుగు శుభముహూర్తంబునఁదుం ।

దోఁకఁటిగఁగూర్చిరప్పుడు।
సుకుఁరునియనుజ్ఞచే నసురకులవృద్ధుల్ ॥

సీ॥ సిల్లికన్ రతనంపుఁభిత్తికల్ పవడంపుటందంపుఁబనిదారఖండములును।
బులుదిండిరతనంపుఁ దలుపులుఁగుజ్జాతి జగాచోకాటంపుటిన్నియ
[లును।
గోమరైనరాజిత కుట్టిమస్థలములు మేలితామరజాతి దూలములును
బలుఁగుజాతిమెఱుంగుబల్లసరంబులు మేలిపెంకులమీఁదికప్పు।
కడుదిటములైన నగజాతికంబములునుఁ।
జౌప్యరాగప్రశస్తగోపానసులును।
గలిగి నిధ్యాత్మమానసాకర్షకమయి।
తనరునాకరమ్యకేళిసౌధంబునందు॥

సీ॥ ద్రష్టలకనిమిషత్వముఁగల్గఁజేయు వింతరకంబులైన చిత్తరుపటములు।
నుడులుమాత్రమె లేక కడమకర్జములు చేతనులట్లు నెఱపు జంత్రఁపుబతి
[మలు।
బహుచరిష్ణుస్థితిభ్రాంతినూతనులకుఁదలకొల్పునిల్వుటద్దములబారు।
సకలతదాత్వశాస్త్రగ్రంధములునున్న పెక్కులైనకడానిబీరువలును।
గందఁపుఁగుడకలత్తరుమందసలును।
మేలిమిపసిండికురిచీలుజాలవల్లి।
కలునులోనగువస్తువుల్ కలిగియున్న।
లలితమణిమయకేళినిలయములందు॥

క॥ సెజ్జకుఁదారుతురనుపెను।
లజ్జన్ ముందుకడుగిడని లలనామణులన్।
బుజ్జనముసేయుచైనవ।
లజ్జాయూపతులఁజేర్చిరరుసముతెసఁగన్॥

సీ॥ దొడ్డశాణురకెంపుటుడ్డపట్టియలు మేల్తరఁపుఁబన్నికప్రవాళంపుఁగోళ్లు
కప్పుఱాపందిరికంబముల్ నిద్దంపుఁటలువవెలుంగు ఱాచప్పరములు।
దట్టంపుమాతాబిపట్టెడల్ చొప్పుఁబట్టుపరుపులు మొకమాలుబాలిశ
[ములు।
జిగిబతినీదిండ్లుసొగసైనదసిలీనిచోళములుబురుసావేలుకట్లు।
పల్లపొత్తినూలిబటువుబిళ్ళలుమంచి।
పన్నముత్తియంపుఁజాలరులును।
జానుమీఱుకాయమానపర్యంకంబు।
లందుఁగూరుచుండిరాకొమరులు॥

సీ॥ కడపకవ్వాలకడఁగిడకగట్టిగదారబందముల్ గొని నిలబడ్డవారి।
శిబ్బితిఁజేసివంచినమోములెత్తక యొత్తుచెక్కిఁ లనానియున్నవారి।
బనిమరియొంతగాబతిమాలినను ముందంజనక నెచ్చెలులపైఁ గినియు
[వారిఁ।
జేపట్టువదలించుకేడియనెఱవారి చూచిచేయివిదల్చి వైచువారి।
నానవోఢలను వ్వేత్తుగానివలకు।
దొలఁచిరమణులపజ్జకుఁద్రోచిపుచ్చి।
తలుపులుబిగించిదిలుకువెల్పలఁదగిల్చి।
గుసగుసలువోవుచరిగిరికొమిరెల్ల॥

చ॥ వదనమువింతచెన్నొందవవంచియొదర్ గమరర్ భయత్రపల్।
మెదలకగోడఁజేరఁబడిమేలిమిబంగరుబొమ్మపోలికను।
న్నదయితఁజేరినాథుఁడెలనవ్వొలయర్ వదనాంబుజంబునర్।
బొదమనికేలుకేలఁగొనిపూవులసెజ్జకుఁదార్చె నాయవర్॥

సీ॥ మాటు సేయఁగనీనిమందాత్మ మెడయనొయ్యనఁ గళాస్థానంబులంటి [యంటి।
యిరుగురి మేనులు పరవశత్వమునొందఁ బిగియారుకవుగిళ్ళఁ బెనఁగి [పెనఁగి।
యలరువిల్తునిమేల్మి యాటబంతులబోని యుదుటుగుబ్బలువట్టి యదిమి [యదిమి।
బంధూకకుసుమప్రభాపశ్యతోహరంబగు మోవియామూలమానియాని
వలపుకసిదీరఁదట్టుగాఁ జెక్కిళ్ళు ముద్దు।
వెట్టికొనిపెట్టికొనికమ్మవింటివాని।
సాదనలఁదేలెనాథుండుచతురశీతి।
బంధములనూత్నమైనయప్పడఁతిఁగూఁడి॥

ఉ॥ రత్యధిపాకృతుల్ దితిజరాజకుమారకులిష్టలీల దాం।
పత్యసుఖంబులన్ బహుసమాశతముల్ కుసుమాస్త్రశాస్త్రసం।
విత్యసమానులై యనుభవించిసుఖస్థితినుండిరుత్తమా।
పత్యముఁగాంచియాప్తపరిపంథిమనోనిశ్చింత్యమానులై॥

వ॥ ఇట్లు సూతుండు శూరపద్మాదులచారిత్రంబుసెప్పి॥

పంచచామరం॥ చరాచరాదికారణా వృషప్రబర్హధోరణా।
ధరాధరాత్మజామనోరథప్రపూరణా శివం।
కరాకరాళరత్నసానుకార్ముకా మురద్విష।
చ్ఛరాశరారుపూర్వదేవశాసనా విషాశనా॥

* మంగళమహాశ్రీవృత్తం *

శ్రీపతి విరించన శచీపరిబృఢప్రభృతి సేవితపవిత్రతమపాదా।
తాపసపరార్ధ్యసముదాయ వనబర్హిణవితానన వవార్షికపయోదా।

క్రోపవశనిర్గళితగోధిదహనార్చిరవకుంఠితరతీశ్వరవిలాసా।
పాపశమనార్థి నిజభక్తజనరక్షణకృతభవ్యతరకాశిపురవాసా ॥

శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీపుదిపటూరి
సోమనాథశాస్త్రితనూభవ సూరిజనవిధేయ
సూర్యప్రకాశ నామధేయప్రణీతంబగు
తారకాపచయంబునందు
అష్టమాశ్వాసము
పూర్వభాగము
సంపూర్ణము.

---



శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# తారకాపచయము.

## ఉత్తరభాగము.

### ప్రథమాశ్వాసము.

క॥ ఆశీవిషమంజీరా।
గోశీర్షాయితమనోజకోష్ణత్విషారా।
కాశీపురసదనాకచ।
పాశీకృతగగనయప్రభవ విశ్వేశా॥

వ॥ అవధరింపుము శౌనకాదిమహర్షులకు రౌమహర్షణియిట్లనియె॥

ఉ॥ ఇంకనుకన్ సమీకముల నెన్నఁడు సేయరివీరు చేతనున్।
బొందిరెయుంగనట్టియభిభూతిపొసంగుటఁ జేసిహీనుఁడై।
డెందమునందునింకశివుఁడేశరణంబని నిశ్చయించెఁగో।
విందుఁడు తంత్రతంత్రకకవిందుఁడువిందుఁడు వైరశుద్ధికిన్॥

మ॥ తలఁకష్టప్పుడుసూడుబెబ్బులులచేఁదాఁగాచునాగోవృషా:
దులకుంజొప్పడుచుంట నయ్యులజడిన్ ద్రోపాడఁగోవిందుఁడు।
త్పలసచ్ఛాయమనోజ్ఞదేహుఁడు మహోభద్రాస్పదంబై విరా।
జిలుశ్వేతాగమునొద్దకన్ గొనిచనెన్ శ్లేషిష్ఠయానంబునన్॥

ఉ॥ వాసవుఁడాదిగాఁగలదివౌకసులెల్లరుఁ దారకాసురో।
ద్వాసనమెప్పుడౌనోయని వందుచు వెంబడి నేగఁజొచ్చెఁ గై।
లాసముగోటిభాస్కరవిలాసము మోచితసంస్మరద్భవ।
త్రాసముశ్రౌవ్యపారిషదరాసముదాసముదగ్రశక్తిదాన్ ॥

సీ॥ మారాపితాన్యోన్యవైరాటవీసత్వ వారాస్పదోరుకాంతారభూక।
మేలాలతానల్పడోలాతలాజస్రఖేలారతార్యాస్యబాలకంబు।
నానాపతద్గీయమానాళికాక్షాపదానావనీరుడ్వితానకంబు।
భాషాకృతేడావిశేషాత్తరాకీర్ణపాషాణరేఖావిభూషణంబు।
కనులపండువమైయొప్పె ఖండపరశు।
విషయకామ్నాయనుతివచోంచితశబ్ద।
నానుగ్రహిగ్రహనిహితగృహ్యకనయార।
శుకపరభృతాది ఖగము ఖర్జూరనగము ॥

సీ॥ స్థిరతరభక్తినాస్తాంతముగ నీశ్వరునిసపర్యయొనర్చిచనినవారు।
కృతసర్వసంగపరిత్యాగులై విరక్తిగరిష్ఠతఁ మేదొరఁగినవారు।
బ్రదికినన్నాళ్ళు ధర్మపథంబుదప్పక జగముమెప్పించియాలిగినవారు।
విభులైహికాశేషవిషయులై ఘోరతపములుచేశిపొనుంగువడినవారు।
సాంతపనము కృచ్ఛ్రచాంద్రాయణములునుఁ।
దనియఁజేసి గంతుగొనినవారు।
కాఁపురమ్ములున్నకమనీయమణిసౌధ।
వీథికునికిపట్టు వెండిగట్టు ॥

చ॥ ఒకగృహమేధియింటిదరినుండినబానిసనోర్తుఁజూచిక।
ల్కికలికివచ్చెఁబోయని భ్రమించి పదంపడియంను నంతటన్।
సకలగృహస్థగేహపరిచారికలట్టులెయుంటరెప్పవా।
ప్చకలికిందియబ్బనిముఁలజ్జయుఁజెందె ముకుందుఁడెంతయున్ ॥

మ॥ ప్రగుణస్వాంతులకాసుపర్వులకు నబ్రంబయ్యె వ్యాప్తప్రథం
బగుచింతామణియుల్ నభోగవియుఁగల్పాగంబులుల్ గూడిశ్యా
గగుణంబంతయువీనియొద్దఁగలచెన్ గాఁబోలునిక్కంబనన్
దగిమొప్పారుతదీయసర్వదృషదఘ్నాశాఖులంగాంచినన్ ॥ [దిసె
సీ॥ ఎటనున్నయిండ్లచెంగట వైజయంతాది సురమందిరంబులు చుట్టుగు
లెందుఁగాఁపురమున్న యిలుకేండ్లముందట భార్గవీపతి గోచిపాఁత
[రాయఁ
డొలయు నెచ్చటివనంబుల చెంతనందనచైత్రరథంబులు చవిటిపోడు
లరయగా నెచ్చోటిసరసుల మ్రోలనంభోధులన్నియుఁ బందిబురద
లట్టిసర్వాతిశాయిమహత్త్వరజిత [గుంట
భూధరాధిత్యకం గాంచి శ్రీధవాదు
లధికవిస్మయపారవశ్యంబునొంది
మోడ్పుకేల్గొనరించిరి భూతపతికి ॥
శా॥ ఆవహాతేతరదేశవిస్తరములై యధ్యాత్మవిద్యారహో
వ్యాహారంబులు బోధసేయుపతిగవ్రాతంబులంబోల్పురా
హ్యావాహోత్తమముంగనుంగొని ముకుందాదుల్ సురల్ షాలస్య
జ్ఞావాత్త్వంబునకబ్బురంపడిరసామాన్యంబుగానత్తఱిన్ ॥
సీ॥ కృషివణిజ్యామలౌవృత్తులెవ్వియులేకధనవంతులచ్చటిమనికిఱేండ్లు
నిసివెల్గుప్రొద్దులేనిదియయ్యునచ్చోటురవికోటిదీప్తినై ప్రస్ఫురించు
ముదిరమండలికిమీఁదిదిగానతద్వ్యవ్యతమ పెఱుంగకయసాంతతికఫలిన
తిండియొన్నఁడులేకయుండియునచ్చటికిఖిలజంతుచయంబునిత్యతృప్తి
కడుపుకానుపుపెంపులేకయునునచట
గ్రిక్కిరిసియుండుఁదివ్యశరీరివితతు
లనవలోకితపూర్వంబులైనసొద్ది
యములఁగనుఁగొనివెఱఁగందె నచ్యుతుఁడును ॥

మ॥ తనువుర్వింబడిపోవుదాఁక శివునాస్థంగొల్చి సారూప్యముం।
దినితాంతంబును నెల్లెడందిరుగునుద్దీప్తాత్ములౌ వారిద।
ర్శ్వనముంజెంతనుఁగాంచి స్వామినుకు సర్గోష్టిహ్యాషరుద్రోయనన్।
వినమేయంచువచించి మెచ్చుకొనిరావిష్ణ్వాదులీశానునిన్॥

ఉ॥ జంతుచయంబులన్నియును సంభృతముక్తులు పల్కులెల్ల వే।
దాంతరహస్యముల్ పడఁతులందఱుఁగల్మి మెఱుంగుబోండ్లును।
న్నంతయుఁజొక్కవెండియహహాతరమే పరమేశుశక్తియా।
వంతయునన్ స్తవించుటకునంచుఁదలంచుచునుండిరెల్లరున్॥

శా॥ క్షీరాంభోధిసుతాధవప్రభృతులాజేజేలు సీకారులె।
వ్వారుంగంటికిఁగానరాకవినుత్రోనందోఁచుప్రాంచత్సుధా।
ధారన్ జీయనిపింపఁజాలుమధురధ్వానంబులౌ గానముల్।
దారింబోవుచునాలకించి వివశత్వంబందిరత్యంతమున్॥

చ॥ సుగముగనెప్డుమూరుకొనిచూచిమెఱుంగనితావులెప్డు వే।
ఱుగమును పెన్నఁడున్ వినిమెఱుంగనిమోహనగీతులెప్డుజ।
కక్కగమంటిమెందునుందనియుఁగాంచిమెఱుంగనియద్భుతంబులున్।
సొగయికలన్ నితాంతమునుజొప్పడఁజేసినవయ్యె వారికిన్॥

ఉ॥ అట్టివియుండునంచువినిమైనమెఱుంగని వేనవేలుపెన్।
జిట్టలుసూచుచున్ సొగవుజెందిన నిలింపులుకాలుమంనుకుం।
జెట్టకనిల్చియుండఁగని భృంగిరిటాదులు విష్టరశ్రవుం।
డట్టిదుకూడమోహవశుఁడయ్యెనటంచు హసించిరత్తఱిన్॥

క॥ అనిమిషులనుగుటకున్ ఫల।
మొనగూడెన్ నేటికనుచు నొకటఁదలఁచుచున్।
దనివిసనని చూపుల్తోఁ।
గనుగొనిరిసుపర్వులచటఁగలచోద్యంబుల్॥

క॥ ఆయిన తేజోమూర్తులు।
పోయినచోటుసూచుచుండునప్పుడె చటికిన్।
బోయినచో వార్థిపెతతము।
పోయినకర్జంబెమఱచిపోయిరి వారల్॥

శా॥ నిందాచారతమఃప్రభాకరులు శ్రీనేత్రాదులీశున్ జగ।
ద్వంద్యున్ జిత్తములందలంచుకొనుచున్ వాచంయమాగ్రీయచి।
ద్బృందాన్తముంగూతయామబహువేధశ్శార్జిసంవర్తమున్।
నంద్యావర్తముజేరిరైశమును సానందాతిరేకాత్ములై॥

శా॥ ఏవైధేయులువెట్టిరో యనుదితంబీపేరు సామాన్యరా।
జావాసంబులకుండఁగూడదిటఁబ్రత్యేకుంబుగానంతియే।
యావర్తించుచునుంటనీశివున వస్త్యాంచేయవశ్యంబునం।
ద్యావర్తంబను పేరఁబిల్వఁదగుఁగాకం చెంచిరవ్వేలుపుల్॥

ఉ॥ కోటిదివాకరద్యుతినికొద్దిమెఱుంగుడుబుర్వువెల్గుతో।
పాటిదిగానొనర్పఁదగు భర్గునగారముగాంచినంతన।
మ్మేటులచూపులెల్లమిఱుమిట్లుగొనన్ మునురెప్పపాటులే।
పాటియులేనికన్నులకుఁబ్రాప్తములయ్యెను నిండుమోదుపుల్॥

మ॥ త్రిదశుల్ శాంభవగేహదర్శనవశాంధీభూతచక్షుష్కులై।
పదముల్ తొట్రిలనాశ్రితాదిమునివిద్వద్వారమున్ ద్వారమున్।
గదియన్ బోయి యెదురుండులోనికరుగంగాదంచుదౌవారికుల్।
తమపాంతస్థితులాగినన్ నిలిచివంతంగూరుచున్నంతటన్॥

ఉ॥ లోపలనుండివచ్చి యమలుండు శిలాదతనూజుఁడింద్రని।
లోపలమూర్తియైన పురుషోత్తముఁగన్గొని యీామహోమహుం।
డోపనికర్జమేమి యెదియోపనిగల్గియెవచ్చెనంచతం।
డోపనితస్వరూపయిటులుండుటకున్ గతమేమినావుడున్॥

ఉ॥ ఏమనివిన్నవింతుఁ బరమేశ్వరపారిషదాగ్రగణ్యమా।
భామలు చెప్పకొంటకెయుక్రమపయుయ్యేడు మాకుమొన్నసం।
గ్రామమునందుఁ బొసంగినపరాభవముల్ వినవిక్షితేంద్రియ।
గ్రాములు మానుసైనసుఁగికాగికనవ్వుదురేమి చెప్పదుర్॥

ఉ॥ శూరుఁడు శూరపద్మునఁడను షోఁకులరాయనిశానసంబునన్।
దారకుఁడన్ మగంతతనితమ్ముఁడు సర్వజగజ్జగీషుఁడై।
తేరకుఁజేరఁదిక్పతులఁటలడంచి త్రివిష్టపంబునన్।
జేరికడంగి నన్నెగలిచెన్ దుదకున్ బలుపల్కులేటికిన్॥

చ॥ లవమునుఁజీరిగింగొనకలాకుననప్పటువిక్రముండని।
హ్నవమగుబాహువీర్యమున నన్ననిఁనోరిచె నన్నసేటికిన్।
మివిలినవానిఁజెప్పఁ గుడిత్రుమింగెడువానికి లోనిలింగము।
ట్రవడియమన్న సామెతధరన్ విదితంబెగదా మహామహా॥

శా॥ తండూహూచితె శైవపారిషదరత్నంబాబృహద్భానుఁజే।
తండూయర్ మనసొప్పమిన్ గరము నాత్తస్నిగ్ధశింహాణమై।
తండూనిప్రభమైనశక్తియను నస్త్రంబెట్లుచేఁబూనియా।
తండూర్ధ్వంబునకుత్తమాంగములెడొత్తన్ లేక డొల్లుండెనో॥

మ॥ దినకృత్తేజుఁడశక్తిగల్గియును శక్తిన్ గోల్పడెన్ జెంతఁజే।
రినవారిన్ దపియింపఁజేయుటయొయుర్విన్ వృత్తిగాఁగల్గునా।
తనికేనాటికినైన ఘోరమగు సంతాపంబు ప్రాపింపకుం।
డు నెయంచున్ బరిహాసమాడుదురు బోటుల్ పైతమిప్పావకున్॥

ఆ॥ నికషకూర్మిపట్టినిర్ఋతియనువాఁడి।
తండు మూలతోఁడుతండు దేవ।
తారకుండు చెనకఁదారకుండునసుంగు॥
మతనొసంగి నందుకతననితని॥

క॥ వాయవ్యంబున స్త్రీము
పాయనమిచ్చి వినుచూలిబతిమాలుటచే।
నీయనిల్పుఁడింతక్కం టెను।
తేయదియిచ్చునని దాయయీతని విడిచెన్॥

ఉ॥ లోకము లెల్లనొక్కరుఁగడేలెడి గడపందగుశక్తిమత్తుకై।
చేకొనినట్టి యీగుదియజీలుగు బెందునకుద్ధియయ్యెనా।
నాకచరాభియాతికిఁ గృతాంతునకున్ దలకొన్న దారుణా।
నీకమునందు వింటి వెమునిస్తుత యీసమవర్తిదుర్దశన్॥

శా॥ ఆజిన్ వమ్మగు చెప్పలేకయునుఁ దైత్యాధీశునిందాఁకిని।
స్తేజంబై పసతగ్గిపోయిననరాజీక్రిందమిత్రించుచున్।
బీజావాపముపొంతఁగుద్దలికొనన్ బృధ్వీస్థలిన్ గ్రొచ్చుతే।
త్రాజీవున్ దలఁపించుచుండెడిమహాత్మాకంటెయీశ్రీదునిన్॥

మ॥ కలపొమ్మంతయుఁదాయద్రవ్వుకొని చక్రంబోవుటన్ వట్టిగుం।
టలె శేషించి తదాది స్వర్ణచటకన్యాయంబుగానున్నజ।
కులరేరాయనిపొమ్ము పాఁతలలచెంకుల్ సూచిదుఃఖంబురా।
నిలుపన్ జాలక యక్షగుహ్యకులు వానిన్ నింతురస్త్రంబులన్॥

మ॥ మొకమోటన్ దనయస్తికారుణికుఁడౌ భూతేశునింగూర్చికుం।
దకబత్తిన్ దపియించిశూలిమదలన్ దచ్చిహ్నముల్ నాగచ।
ర్మకపర్దాదులు దాల్చియున్నకతనన్ మన్నించియీశామజో।
లికిఁబోడయ్యెను తారకాసురుఁడు కాళీనాథభృత్యాగ్రణీ॥

చ॥ అసదృశవిస్తృతుల్ శరధులక్షయకాండములుండియున్ బ్రశే।
తనుఁడనికోర్వడయ్యెనని తారకసైన్యులొనర్చునారుపున్।
పొనఁగఁగడిష్టకున్ రతనపుంగనులన్ బ్రథనేతిబీరశా।
యనవతుగానమూల్యమణులన్నియుఁగానుకవెట్టెఁదాయకున్॥

చ॥ కటకటవజ్రికైన్నఁడునుఁగల్లనికయ్యపుటోటుపాటునం
ఘటిలుటకన్నులారఁజూడఁగాంచితిఁగావున నోరురాదు దే।
వ్వటకటువంటి ఘోరతరపుంబెడఁదల్ ఘగవాన్నికైన నె।
న్నటికినిఁగల్గఁగూడదని నామదికప్పుడుతోఁచెఁజూడుమీ॥

మ॥ ఆకటా శూరిమితంద్రికిన్ విజయమీయంబూనిఁ దోడంజయం।
తకుమారాగ్రణివడ్డపాట్లు తలఁపన్ దధ్యంబుగాఁజూడు కా।
నికినైనన్ గడితంపుజాలిమొదవున్ నేనుండియున్ దీర్పఁజా।
లకపోతిన్ గదవారికొందలము శైలాదిమహాత్మ్యాంబుధీ॥

సీ॥ తారకుఁడొందుఁగాతాళమంచుఁగృతాంతు డసురులయసురులకరుగఁ [దలఁకు।
శూరపద్ముండు రుష్టుండౌనోయంచుఁ బర్జన్యుఁడఖుర్చునె వర్షంబు [గురియుఁ।
దారకాసురునిచిత్తమునొచ్చునోయని వెఱచుచు వెఱచుచు వీచుఁగాలి
శూరపద్మాసురుండోరువకలుగునోయనిభీతిలుచుఁగాయునరుఁ డెండ।
యత్తలోఁ చెంగుతొలఁగినదని తెలుపు టె।
తప్పు తెలుపకయుండు టె తప్పయనిన।
యట్లు రాగుండె చెనఁటిగయ్యాళియత్త।
చెంతఁగోటరమయ్యెఁ జేజేల బ్రతుకు॥

చ॥ క్షయతఁజికీయవస్థపాసఁగెన్ ముదిముప్పునఁ బాలపావచి।
న్నెయనినపోలికన్ నంచలఁత నెకొన్న వేలుపుఁ బెద్దకుందకుం।
దియవిధిలేక సోఁకులకుఁ దిథ్యుకు వారములున్ జికీర్షిత।
క్రియలకుమంచి వేళలునుఁ గీములకున్ జని చెప్పునిత్యమున్॥ [చుందు।

సీ॥ తెఱగంటిగాణల్ ప్రతిదినంబరిగి నిలింపజయముల్ కృతులుగాఁ బాడు
రచ్చరమచ్చెకంట్లటఁబోయి మేజువాణీలు ప్రత్యహమును నెరపుచుందు।

రసలుండువారింట నారాళికుఁడయి పలుపిండివంటలొనఁగూర్చు ।
నిలఁగల్గుపున్నెంపుటేళ్లనీ గాన్లావపానామలకుఁ దెచ్చిపోశియిచ్చు ।
ద్రవిషములలోనఁ బేర్చు ప్రతిష్ఠలుగల ।
వారెశూరపద్మాసురతారకులకు ।
జీతములు లేనిబంట్లైరి శివనియోజ్య ।
సన్నగాంద్రబ్రమకు వేఱె యెన్న నేల ॥

క॥ అనఘా తమమగలరిచే ।
ఘనఘాతములొందుటవిని గాటఁపుఁదలబీ ।
కనకాయతనములొందిరి ।
కనకాయతనములనుండు ఖచరపురంధ్రుల్ ॥

క॥ కడగానక తమయొడయులు ।
కుడుచునిషమ లెటేఁగి బెంగగొని వేలుపుఁగ్రొ ।
త్తడిమిన్న లెల్లనుంచపుఁ ।
దొడుగరలై రేమిచెప్పుదున్ శైలాదీ ।

ఉ॥ లోనికి నేగినీవళికలోచనునిన్ దరిసించి యస్మదా ।
యానము దెల్పుమొండెఁ గరుణాకరతత్పరమేశ్వరాంఘ్రిని ।
ధ్యానము సేయుపొంటెమము నచ్చటికిన్ గొనిపోవుమొండెనఁ ।
చాననవిల్లుతండ్రివినయంబునఁ బలుకుడునంది యిట్లనున్ ॥

శా॥ ఏమేమీవినమైతిమింతవరకీవృత్తాంతమున్ జెల్లబో ।
హేమాహేములనాజిమస్సహులఁ బహ్వింద్రారిజీవాద్మర ।
స్థామాధిక్యులమిమ్మెయొకఁడయసురాధ్యక్షుండనిం గెల్చెనే ।
యేమైయుండునొ హేతువాతనికిఁ దాదృక్షక్తిసంపత్తికిన్ ॥

ఉ॥ ఎంతటిమాటపుట్టెనయొ యెన్నఁడులేనిది యోమహాత్మదై ।
త్యాంతకుఁడంచుఁ రూఢమయినట్టి యభిఖ్యను దాల్చియున్నసీ ।

యంతటివానినొక్కఁ యసురాధముఁ డాహవభూమినోర్చెఁగా ।
యింతటినుండిపుట్టునొకొ యట్టిమహాద్భుతవైపరీత్యముల్ ॥

ఉ॥ నిన్నొకరాక్షసాధముఁడనీకతలంబుననోర్వఁగల్గినా ।
డన్నఁగృశానునిన్ శలభమల్పతమం బెదిరించియార్పదే ।
యన్నవమన్నఖాదితవనాటనికాయముఁ జిత్రకాయమున్ ।
దన్నదె దందశూకమును దర్దురశాకము బిట్టునొంపదే ॥

మ॥ చటులాజాండములన్నియున్ జటికెలో సంకల్పమాత్రంబునన్ ।
నటుమాయంబుగఁ జేయఁజాలినమహామాహాత్మ్యాఢ్యుఁడైపొల్పుధూ ।
ర్జటిచేఁగొన్నవరప్రభావమున నారక్షోవిభుండంతదు ।
ర్ఘటకృత్యంబునకోపెఁగావలయునిక్కం బాత్మనూహించినన్ ॥

ఉ॥ నిక్కవమంతెకానియెడ నిష్ఠురదుర్జయవైరివీరులన్ ।
జక్కడపన్ శివుండిడినచక్రముఁ గేలధరించియున్ననీ ।
వెక్కడ నొక్కరాత్రిచరుఁ డెక్కడ నెంతటిదవ్వొ పేరవం ।
బెక్కడదేవతాభువనమెక్కడనన్నటులిందిరేశ్వరా ॥

మ॥ భవుఁడార్తాభయదానశౌండుఁడిపుడీప్రాంతంబునన్ లేడతం ।
డివపుంగుబ్బలిమీద రుంద్రతరమై యొప్పారుచున్నట్టిభ ।
ద్రవటాఖ్యంబగు పుణ్యపాదపముక్రిందన్ దక్షిణామూర్తినా ।
నవతారంబుధరించియుండె వినలేదానీవు నారాయణా ॥

గీ॥ అబ్జయోనిమానసపుత్రులగు సనకస ।
నందనసనత్కుమారసనత్సుజాతు ।
లను మహర్షులధ్యాత్మరహస్యావబోధ ।
మునకునై మఱిమఱి వేఁడుకొనుటఁ జేసి ॥

గీ॥ నోటఁబలుకొక్కఁడేనియు నుడువకతన ।
యాభిముఖ్యోపవేశంబె యాతపసుల ।

సంశయములన్నియుఁ దొలఁగ విజ్ఞానసార।
బోధ మొనరింపుచున్నవిరిశు శరణము॥

క॥ ఓహారిప్రియ దేమిస్వేదూ యోరి
దోహద మేమియును లేని దొరయయ్యాను।
న్మోహనయువమైగోరా।
డ్వాహనుఁడిపుడున్నవాఁడటఁ మునివృత్తిన్॥

చ॥ మృడునిద్వితీయతద్ధితసమీరితది త్తసతీసమాఖ్యయె।
కుఁడు ప్రతిఘంబుపుట్టిజనకుండగుదక్షునియజ్ఞవేళమే।
నెడయుటకు రెటింగినదియేకద యప్పటినుండియమ్మహా।
త్ముఁడిచటనుంటమాని హిమభూధరమందు వసించుచుండెడిన్॥

చ॥ సతియు శివాజ్ఞచే నొకవిశంకటమూ కొలనన్ జగత్త్రియా।
సుతముగనొక్క తమ్మివిరినుండి యయోనిజమై జనించిపా।
ర్వతియను పేరనొప్పి హిమవంతుఁడు నాతనిపత్నియున్ గొమా।
రితయని తెచ్చి యబ్బురపుప్రేముడిఁ బెంపఁ బెరుఁగుచుండెడిన్॥

ఆ॥ ప్రకృతియాదిశక్తి పరమేశ్వరియుఁగాని।
యువతిమాత్రగామి యవివికిత్స।
మా మెటొప్పిదము సహస్రాంశ మేనివ।
ర్ణింపఁదరమె మనకు నిక్కువముగ॥

ఉ॥ శ్రీతరుణీమనోహరశిరింధ్రమొనర్చిన సృష్టిలోనిమే।
ఖ్యాతమహాభిరూప్యలయి క్రాలు నెలంతల నేనియున్ స్వయం।
జాతకు సర్వతోనుపమచారిమసంపముపేతకాజగ।
న్మాతకుఁ బోల్పఁజూచుటయు మాదముగాదె యసంశయంబుగన్॥

ఉ॥ యోషిదమూల్యరత్నమయి యొప్పెడు నయ్యుమయందుఁ గూఢపా
ద్భావమనుదివ్య తేజమునఁబుట్టిన శూరుఁడె కానియాసుర।

ద్వేషణుఁడాఁకి ఘోరసమితిఁ బరిమారుపలేఁడు గానఁబు ।
ప్రేషునిఁబంపుఁడీ శివులనిద్దఱిఁగూర్చుటకున్ హిమాద్రికిన్ ॥

క॥ ఆనందియిట్లుపలుకుడు ।
నానందితులై జనార్దనాదులు సురసా ।
సూనుఁడయిన తారకుని న ।
సూనుఁడయినయట్లెతలఁచి రుల్లములందున్ ॥

చ॥ మెనసి జగచ్చతుర్దశకమున్ భరియించినయట్టి యాజనా ।
ర్దనునిపిచిండమందిముడఁడావులభింపకపోయె ఫాలలో ।
చనుప్రియకింకతుండయి యెసంగుశిలాదతనూజుఁడాలపిం ।
చినను శుభుల్ చెవింబడుట చేఁదలఁకూడినప్రీతికయ్యెడన్ ॥

వ॥ అప్పుడిందిరేశ్వరుండు నందికేశ్వరునకిట్లనియె ॥

చ॥ కడలిపరఁటె మందరముకవ్వము చిల్వలతేఁడుత్రాడుగా ।
నొడికమెలర్పఁగూర్చి వెతకోర్చి సుధార్థమొనర్చినట్టిమా ।
తొడరువువయ్య మంచెడఁదఁదో ఋమీ యిపుడో మహాత్మనీ ।
నుడుగులు దుర్మనశ్శుగపనోదనముల్ విని నంటనుండియున్ ॥

క॥ మందరముద్రచ్చరేకల ।
నందలుముటఁజేసి భృశమసహ్యమయినయా ।
మందరముఁదెచ్చుటకు మే ।
మందలమును బడినపాట్లు హరుఁడెయెఱుంగున్ ॥

ఉ॥ ఎక్కడనుండియేయసురయెప్పుడు పైఁబడి మన్కిరేండ్లకుం ।
గొక్కులువెట్టిలొడ్డులొనుకుంగడ తేరిదివైఁదిబలిష్ఠమై ।
*నిక్కలెయాక్రమించుకొని యీడదివైచునొయంచు నిత్యమున్ ।
బొక్కుచునుంటతోనె సరిపోయెనుమాబ్రతుకుల్ మహామహా ॥

చ॥ క్షమఁబడరానిపాట్లుపడి సంద్రము ద్రచ్చి సుధం గడించియ।
య్యమృతముద్రావియక్షయులమైతిమి కాని విపత్తు చేతమా।
నమిపుడుగోలుపడ్డకతనన్ వ్యృతిలేమికి మానహానిమా।
టమర అది మంమతింటిపునిడాకొ నెమాకనుతాపమిత్తఱిన్ ॥

ఉ॥ మందిసుఖాప్తిసాధనము మాయెడ సౌహృదమూని తెల్పిర।
క్షిందితిపీయుపాయ మెఱిఁగించినయంతటినుండి యొప్పునీ।
పందినచొప్పునన్ జలధిభంజితశత్రులమై సుఖింతుమా।
యాచునతిత్వరాకులములయ్యెడు మాయెదలంచుఁ బల్కుచున్ ॥

క॥ ఆతండుని పీడొర్క నిచని।
రాతండు నిశిరులు హరిహయప్రభృతులునున్।
జేతంబుల కలవరముల।
చేతంబులకలపుడు ల్లసిల్లనొడళ్లన్ ॥

భద్రః వృత్తం॥ అందఱావనమాలిసంక్రందనాది సుధాశనుల్।
డెందమంకఁబ్రనూనచాపుందలంచిరి పోవుచున్ ॥

సీ॥ ఎన్నండు నెచ్చోట నెవ్వారిలో నొకర్కఁ డైనంబరుడు లేనియందగాఁడు।
పుట్టినఁ గందునమ్ముల నెల్లజగముల మల్లాడమడియొనర్చు మాసటీఁడు।
ఇరువదియేడుగురిల్లాండ్రఁబూటకొకర్క తెఁగూడుదణికి సంగాతకాఁడు।
తివుటనైజకెర్క రతిండి తేజీనెక్కి వయ్యాళిదిరుగాడు వన్నెకాఁడు।
తలఁపుచూలియనుటదబ్బరగాకుండ।
మమలఁ కలఁచినంతమాత్రలోన।
గుడుసువాలుగాలుపొడలిచూపొడయల।
సరసవచ్చిచిలిచె పిరివిలుకుఁడు ॥

చ॥ అటుచని వారికిన్ బ్రణతుఁడై మదిసంమలఁ జేతులుంచిచెం।
గటనిలుచుండి నావలసఁగాదగుక్రొంబనియేమియెంతదు।

ఘట్టముదిగ్గయైనఁ దీర్తునొడికంబునననన్న మనోజునిందుకోఁ
గిటఁగదియించియిట్లుపలికెన్ బురుహూతుఁడు వెన్నునానతిన్ ॥

చ॥ గుఱుకొనిసుప్రయోగవిశిఖుల్ భువనంబులలోని ధన్వులం ।
దఱునొకలక్ష్యవస్తువునొనర్తురు రెండుగఁజేతినేర్పునన్ ।
జఱుకరిమిన్ననీకడిమిచొప్పుగరంబపురూపమయ్యెడున్ ।
గుఱియను రెంటినొక్కటిగఁగూరుతు వెంతటిశిక్షితుండవో ॥

చ॥ కడుభరమాటచేఁబెరయఁగల్ [illegible] నెఱవేరుపలే [illegible] మో ।
కడఁడిపుడు మాకునీవలనఁగాదగియున్నది శూరవర్యమే ।
మిడుమలఁబాసిసౌఖ్యపడుటిష్టమయేని యొసద్దుసేయకే ।
ప్పుడచనియీపనిన్ నెరపిపొందుము కీర్తిమదగ్రణిత్వమున్ ॥

మ॥ భువనాతీతతరస్తరస్విపనితప్రోద్దామసంస్ఫోటపా ।
టవుఁడా తారకుచేతమాపడినపాట్లన్ నీవునాలించియుం ।
డువకాయాసురసాత్మజుణ్ గిరిశరేతోజాతుఁడేదక్కవే ।
తెవఁడున్ భీమమడంపనోపఁడు వింటే తుంటవిల్తాలుపా ॥

చ॥ ధవుఁడిఁకద్రినేత్రుఁడంద్రిజయగు దక్షుఁడు తానొనరించుసత్త్రతం ।
తువునకుఁబిల్వమిన్ గినుకతోఁజనియాతనిమాటిరోగశ ।
క్తివపువుపాసి యీశ్వరునిదేశమునన్ సతిమేనకాహిమా ।
న్యవనిధరేంద్రజఁపక్షులకాత్మజయై యుదయించి పెర్గెనన్ ॥

ఉ॥ ఆర్తినుదానతావనగుణాహితలక్షణుఁడిష్టదక్షిణా ।
మూర్తియనంబొసంగినవమోహనమూర్తియు నాత్మయావన ।
స్ఫూర్తియునై హిమాద్రివటబుధ్నమునన్ వెలయున్ మహర్షిసం
కీర్తితుఁడాదిమస్థితికిన్ బరమార్థము సైగఁజేప్పుచున్ ॥

ఉ॥ ఈవొకరుండుతక్క మఱియెవ్వరు [illegible] ।
దేవునిధీరమానసముద్రిప్పి కలంతువనొం [illegible]

తావనిభృత్తనూజయెడ నత్యనురక్తుఁడుగానొనర్చినా ।
ప్రావినక్రొత్తయుత్తలముబాపవె యోయతిలోకపూరుషా ॥

క॥ ఉభయులు నస్మన్మాంబకులా ।
ప్రభువీవునుఁగాన నెదిరిపఱుపఁగలుగుద ।
య్యభవుఁడ వజ్రంవజ్రే ।
ణఖిస్యతానానినచొప్పునఁ బ్రథితముగ ॥

ఉ॥ మున్నుడురాజశేఖరుని ముంగడనేనియుఁగొంకువోనియా ।
వెన్నుఁడు విద్వ్యమన్నికృతివిన్నుఁడు జన్యపరాజయవ్యథా ।
ఖిన్నుఁడునై యశక్తుఁడగుఖేటుఁడునుంబలెనుండెఁజూడుమిం ।
కన్నుడుతేల పెక్కుమొనకట్టుము దుఃఖితబంధురత్నముగ ॥

క॥ వెలగందియనియె మదనుఁడు ।
వెలఁగందినయెడఁదతోడ విమనస్కుండై ।
తెలగంటిదొరయనినముడి ।
తెలఁగంటిమనంబు కదునుదిలగొనినొవ్వఁగ ॥

ఉ॥ తాఁకియనీకరంగమునఁద్వత్ప్రభృతుల్ సురలప్పటప్పటఁ ।
సోఁకులచేతిత్రెళ్లుచవిచూచుచునుంమరకాని సోఁకుషుం ।
జీఁకటివేఁడివెల్గయిన శ్రీపతియొక్క సురారికోడిపెఁ ।
మూఁకలిజెందెనంచు వినఁదోఁపునివ్వెఱవ్వటిల్లెడుఁ ॥

సుగంధివృత్తం॥ దాడిచేసియొక్కడీఁడు తారకాఖ్యుఁడొక్కడీ ।
రేడులోకముల్ జయింపనేగె నంచెవండొనా ।
తోడఁజెప్పవింటిఁగాని దుర్నిశాటుఁడచ్యుతున్ ।
గూడనొంచెనంచు గష్టాకొండువింటిఁగ్రొన్నుడిన్ ॥

చ॥ కడఁగితదీయదోర్యుగళకందువుతీరుచువారులేమిఁ
గడుఁబదింటిఁగెల్చుటయొకాక నిశాటతమింసవారిఁగా ।

ప్పుఁడుమున విష్ణునోర్చ్చిఁ దలుపుల్ తినువానికిపానహంబులఁ
ప్పడము లెయున్నమాడిఁ బెరబల్లిమలాతనికొకరుఁ లెకరుఁయే ॥

ఆ॥ భౌమవిషయములను బాటింపకాశ్గల ।
గెలిచి తనమపదము గెలివిఁబట్టు ।
కొనినపుణ్యజనులకుంగూర్చ్చి విష్ణువై ।
తమలిగించినాడె తారకుండు ॥

క॥ తలఁచినమాత్రన జగములె ।
పొలియింపన్ జాలుమిమ్ముబొట్లకఁగినుకన్ ।
గలిగించుపొడవమను నే ।
పొలిసెనకాతలఁపుఁడింకఁ బొలదిండిదొరన్ ॥

ఉ॥ ఉమ్మలముజ్జగింపుఁడిఁకనోయనవద్యచరిత్రులార నే ।
నమ్మలపట్టికీశునకు నంటోనగూరుచుమీరలర్మిలిన్ ।
సమ్మతిమాత్రమిచ్చుటయె చాలునటంచు మరుండనన్ వికా ।
సమ్మతిమాత్రమయ్యెఁ దివిషన్నికరంబులకప్పెడందలన్ ॥

మ॥ జయనంబయ్యెశుఁబొమ్మటంచు హరుఁ బాశాసింపఁ దేవౌఘము ।
న్నయనంబైఁ తిలకించుచుండ నెలమిన్ దన్నట్లుదీవించుచు ।
న్నయనంతాదులయొద్దనెట్టుగొని కందర్పుండు శీతాద్రికిన్ ।
బయనంబై చననింటికేగెఁజనిరాస్వారాణ్ముకుందాదులున్ ॥

చ॥ అనవిని రౌమహర్షణికి నమ్మునులిట్లనిరల్లుఁడయ్యుఁద ।
త్మునిడొనరించుజన్నమునకున్ సకలామరవంద్యుడాశ్రితా ।
వనుఁడు పరాత్పరుండు పిలువంబడకుండుటకేమిహేతువా ।
తనిక్రతువెట్లు నెల్లైవినఁదర్షముప్పైడు నానతీయవే ॥

వ॥ అని శౌనకాదిమునులు ప్రశ్నించుటయు ॥

* రథోద్ధతగతివృత్తం *

అజీగవశయా హతారినిచయా।
ప్రజాపతినుతా పవిత్రచరితా।
గజాంధకహరా క్షుపాకరధరా।
భజత్సుమవనా పరాస్తసవనా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దిషటూరి సోమనాథశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందుత్తరభాగమున
ప్రథమాశ్వాసము

---



శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# తారకాపచయము.

## ఉత్తరభాగము.

### ద్వితీయాశ్వాసము.

క॥ వసుధానిలశిఖిగగనాం
బుసుధాంశురవిపురుషాష్టమూర్తిలీలా।
వసథాయమానవారా
ణసీనగరభూమివిశ్వనాథస్వామీ॥

వ॥ అవధరింపుము శౌనకాదులకు సప్పౌరాణికుండిట్లని చెప్పం దొడంగె॥

మ॥ జగముల్ సేయుతఱిన్ విధాతృఁడు జగత్సర్గక్రియైకాగ్రుఁడౌ।
ప్వగఁదక్షుండను వానినంగుటమునంబుట్టించి వర్ధించియా।
దగినుండబ్జముఖిన్ బ్రసూతియనునోర్తుం బెండ్లిగావించెనా।
దగకుంబుట్టిరి సుందరుల్ పలువురింతుల్ ముద్దుకూఁతుండ్రుగాన్॥

క॥ కొందఱిధర్మునకున్ మఱి।
కొందఱి జ్వలనునకునింకఁగొందఱిశశికిన్।
బొందుగనొసఁగినవాఁడ।
య్యొందక్షుఁడు దుహితలన్ మహితలక్షణలన్॥

మ॥ సతినానొప్పునశిష్టకన్యకశివున్ సర్వజ్ఞునిన్ దక్కునే।
నితరున్ బెండిలియాడనొల్లఁ జుమితండ్రీయన్నఁ దత్తుప్రజా।
పతినిష్పుం శివుఁడయ్యుఁ బుత్రినుతిఁ దిప్పన్ లేక ప్రార్థించియా।
శితికంఠున్ దోడితెచ్చి పెండిలియొనర్చెన్ శూలికాబాలికన్॥

* తరువోజ *

అవేళఁ గొన్నియేండ్లరిగినపిదప నబ్జాసనుఁడు సత్రయాగంబొకండు।
గావించుటకు సమకట్టి వైకుంఠ కాలకంఠుల లేఖగణములఁ బిల్చి।
రావించి జన్నమారంభించెనపుడు రమణదక్షుండును రా నెమరేగి।
దేవతలతనిఁ దోడ్తెచ్చిరి గద్దెదిగక కూర్చుండి రా త్రిణయనాచ్యుతులు॥

శా॥ అల్లుండయ్యును లేచి నాకెదురు రాఁడయ్యెన్ సుధాంధశ్చయం।
బెల్లన్ నాకెదురేగుదెంచికొని రానీక్షించుచున్ గద్దెయున్।
జెల్లంబోడిగ డెంతగర్వియితఁడిస్సీయంచుఁ దక్షుండుజా।
బిల్లిన్ గూఁకటినుంచుకొన్నదొరపైఁ బెల్లల్గెఁ డెందంబునన్॥

చ॥ అవుర సభాసమండయినయచ్యుతుఁడున్ దనయున్నగద్దెయన్।
దివకయకూరుచున్నను మదిన్ గనలొందకయల్లుఁడౌటచే।
శివునిఁగుఱించి మాత్రమెకసింగొనెఁ దక్షుఁడు సన్నగాంద్రబాం।
ధవముపొసంగినన్ బరువుతక్కువయేగద గొప్పవారికిన్॥

ఉ॥ నాటమనంబునంగినుక నాఁటగొలెన్ సతి తండ్రివీతధీ।
పాటవుఁడై శివుంగుఱించి పాటనయుంచక యెల్లవేలుపుం।
గూటువులన్ జెనంటినసగూటులనైతముఁ బిల్చి చంద్రమో।
జూటునిఁ బిల్వఁడయ్యెఁ బెనుజూటున నధ్వరికర్తుకాముఁడై॥

మ॥ తనియన్ బిల్చుటఁ జేసి దక్షుమఖసిధ్యానార్థమై తేండ్లతో।
నను వొందన్ విలసద్విమానములలో నాసీనలైవిన్మునన్।
జను వేల్పుంజవరాండ్రఁ జూచి సతి యుచ్చండంబుగా నేగి స్త్రీ।
జనవైసర్గికమైననాపలమునన్ సర్వజ్ఞుతో నిట్లనున్॥

శా॥ కంటేసర్వజగచ్ఛరణ్యపదనాగారాఁబపుందఁ డ్రిపెన్ ।
గొంటుంజందమిసీయమేయమహిమార్ణోరాశివౌనీపయిన్ ।
గంటుంబూనినినుర్ హవింపకోకయాగంబిప్పుగావించెదుర్ ।
వింటర్ బోవుచునున్నవారదె సురల్ విశ్వంభరేంద్రాదికుల్ ॥
ఉ॥ కీడగుదీననంచుమఱిదికిన్ బొడకట్టమినిన్నుఁబిల్వకు ।
కీఁడగుదక్షుఁడీచెయిదికిన్ గడఁగెన్ నికుఁబారికాంక్షిజా ।
లేడితునాదిదేవుఁగనియించిభవత్కృతికాతఁడగ్గమై ।
లేడితుపాకిప్రేటుసవలెన్ జేడనుండనొయ్యే మొయికటా ॥
సీ॥ శ్రీధవాదిసుపర్వశేవ్యుఁడౌ నిన్ను బోఁటిమహాత్ముజెట్టవట్టిన కతమున ।
నీతల్లుపజపలె నిఁరులింటికిఁగాక పుట్టినయింటికిఁబోకయగుట ।
నేగుచుండిన వేల్పుటింతులకెల్లనుముఖ్యనై మన తేరుముంమనడువ ।
జనుచున్నయాలేఖజంపతులున్ వలెమనమును దివ్యవిమానమెక్కి ।
యదెసతీదేవివచ్చుచున్నదియటంచు ।
వీటిబోటులునాకయి వేడుకపడ ।
నధ్వరోత్సవమీక్షింపనరుగుభాగ్య ।
మునకునోచుకొనకపోతిననిమఱియును ॥
మ॥ సతిసాష్టాంగముగాఁబినాకికి నమస్కారంబు గావించిని ।
ల్పితలన్ మోడ్పుకేలువెట్టిఋటుపలెన్ నీవుపీడొల్పిసన్ ।
గొతుకికొంతయులేకయేగి యిదినీకుంబుద్ధిగాదంచుఁదు ।
ర్మతికిన్ వానికిఁదెల్పవచ్చెదమహాత్మా నాకుసెల్విచ్చెదే ॥
శా॥ వేదాంతస్తుతలెస్సమైకొనినను పీడొల్పిసన్ బోవుదున్ ।
నీదెందమ్మునకియ్యకోలొదవదేనిన్ బోవఁజాల్మియటం ।
చాదాక్షాయణివల్కి డాన్ శ్రుతతదీయాలాపుఁడై భావభ ।
వోద్గతంబస్ఫుటముగా పుట్టున్ నఁతికినయాత్రక్షేంద్రవాహుండనున్ ॥

ఉ॥ ఆలము సేసెనన్నతఁడటంచు నొకింతయుఁ గినర్చ నాకు లే।
దాలరులైనమూఢమతులందఱిలోపలఁదక్షుఁడగ్రతాం।
బూలమువాఁడు తండు నినుబోఁటులు తేర్చినఁదేలువాఁడె కాం।
తాళమే మీమమిక్కలి యెదన్ గదియించున కాఁకయుగ్మలీ॥

మ॥ ఓకాత్యాయని వ్యాఘ్రమాదిదవిషద్యోషిన్నుతాచార్యమై।
నాకాఖ్యున్ సుతుఁగాంచినన్నుఁదనకున్ జామాతగాఁజేయు స్త్రీ।
లోకంబున్ బడయంగఁగోరిహిమవంతుండిప్పుడుత్సాహియై।
నాకైకష్టతపస్యలన్ సలుపుచున్నాఁడెంతయున్ భక్తితోన్॥

అక్కర॥ దక్షుని గీమునకేగి నానిమిత్తమునని చేర।
సుక్షణంబుఁజి యానెపమునన్ నీవుఁజోగమునఁదను।
మోక్షంబుఁబాపించి పిదపఁజేపటుము మదర్థకైయ।
పేక్షించియొకకొన్నెఁగమలములఁగోయుహిమశైలపతికి॥

క॥ పెనుతుఱఁగలిఁగోరలుసినున్।
బెనుతురగలిపోవ నెదలబెంగలె డందల్।
తనియుంగనగపతియునా।
తనియంగనయున్ ముదములుతలమునకలుగాఁ॥

సీ॥ సురసాఖ్యకనురేంద్రసుతకుఁగశ్యపమహాఋషికిఁ బుట్టితపమొనరించి నన్ను
మెప్పించివరములర్మిలిఁబొందుటన్ జేసియని నెంతబలియురకైన నోర్వఁ
దలముగానియసహ్యబలుఁడైన తారకుఁడను వాని చేనాహవాంగణమున
బన్నంబునొందింపఁబడి చుట్టువాల్లాల్లు మొదలుగా నెల్లరుత్రిదశులు
శరణుజొచ్చిశత్రుసంహారమునకుఁబ్రా। [నను।
ర్థింతురపుడు నేనుదేవహితము।
పొందెఁగోమరునొకనిఁబుట్టించు పనికినే।
నినుఁబరిగ్రహింతు నిశ్చయముగ॥

క॥ సుగణఖనివినీవానిం ।
ద్యగుణుండగుదక్షునకు సుతవుగానుండక ।
దగవుచు దీయాదేశము ।
తగవుగగానిచేయుమావిధంబునవింతే ॥

ఉ॥ నేఁడుశివుండు లేడిచట నిల్చుటయొగ్గనిపోనివేల్పుమ ।
న్నీఁడువిధాతశ్రీయువతినేతయుమున్నగుకొల్వువారిక ।
త్తూఁడరియష్టకున్ గొడవమాఁకొననున్నదియన్ననప్పువుం ।
బోఁడిలలాటభాగమునమోడుపుకేలుగదించియిట్లనున్ ॥

శా॥ వెన్నుండైనను వేల్పుఁబెద్దయయినన్ వృద్ధశ్రవుండైననున్ ।
నిన్నల్గించిన నెంతవానికయినన్ సేమంబుసేకూఱునే ।
బన్నంబేయగుఁగాని యిక్లైటెఁగియున్ బ్రహ్మేంద్రవిష్ణ్వాదులా ।
జన్నంబేటికిఁజూడఁబోయిరొక్కొ యాశ్చర్యంబువాటిల్లెడున్ ॥

ఆ॥ తలఁపనెంతయొఱుకగలదూరదర్శుల ।
కైననెట్టములనెయనుభవింప ।
వలసియున్నయపుడవశ్యంబుపొరపాటు ।
వొదలిపెనయుఁగాదె హృదయములను ॥

చ॥ తనతనుజాతయా సతికతంబునఁ దక్షుఁడు పిలువఁమాలినా ।
దనునపకీర్తినాకునయంబు పొసంగకయుండనాపయిన్ ।
గనికరమూని యాసవనకర్తకు నాసవనంబుజూడవ ।
చ్చినసభవారికిన్ గొలఁదిశిక్షయొనర్చి క్షమింపుమంతటన్ ॥

ఉ॥ పనికఁబోయివత్తు సెలవిమ్మనియీశ్వరుదత్తశిష్టియై ।
యేనికతిండివావురమునెక్కి నభోగతినేగె నాసతీ ।
మానవతీవతంసము విమానములెక్కి నియోజ్యలన్యకా ।
మానవధానతారహితలై తనుఁగొల్చుచు వెంటఁబోవఁగన్ ॥

ఉ॥ పారిషదాంగనల్ భయముభక్తియుఁబెద్దయుఁగల్గివెంబడిన్ ।
సూరెలనేగఁదూఁకొనెఁబ్రసూతితనూజసభాస్థితాహిభు ।
గ్ధోరణవాసవాద్యమరకక్ష్యాటముద్రష్టృనిరంతరావృత ।
ద్వారవితర్దిచత్వరకవాటము దక్షునియజ్ఞవాటమున్ ॥

క॥ అలుకకయాసతివేలిమి ।
నెలవుకెలనికరిగి మేదినికిఁడిగకుపరి ।
స్థలముననె నిలిచెసతిపాం ।
సులనంటునెయనుచు నచటిచూపఱువలోకన్ ॥

ఆ॥ బిడ్డనల్లువానిఁబిలువడుసరియక ।
దాతనూజతనకుఁదానవచ్చి ।
యున్నఁగన్నఁహూఁతుఁగన్నెత్తియైననుఁ ।
జూడడయ్యొఁబాలసుఁడతండు ॥

వ॥ ఇట్లు సతీయంతరాళంబున నెనిచ్చి స్వమహిమాతిశయప్రభావంబుచే సభాభవనంబు నెల్ల వింత తేజున వెలుంగం జేయుచున్న యయ్యాదిమకుటుంబినిన్ జూచుచుఁ దక్షభయంబునఁ దల్లియగు ప్రసూతియు నగ్రజలగు శ్రద్ధా మైత్రీ దయా శాంతి తుష్టి పుష్టి క్రియోన్నతి బుద్ధి మేధా తితిక్షా హ్రీమూర్తి స్వాహాదులును నేమియుననవోడి యూరకుండ నిందువలన నేమియుపద్రవంబు దలకూడనున్నదియోయని యుంది రేశ్వర సంక్రందన శతానందాది బృందారకులునుఁ గశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ వశిష్ఠ జమదగ్ని భృగు పులస్త్య మాండవ్య శాండిల్య కణ్వ నారదాది మహామునులును విభ్రాంతులై చూచుచుండ నప్పరమేశ్వరి కరసంజ్ఞచేఁ బ్రజాకలకలంబెల్ల నివారించి కొలువువారినందఱఁ గలయం దిలకించి తత్సభాస్తారులవహితులై యాకర్ణింపఁ దక్షునుద్దేశించి యిట్లనియె ॥

మ॥ తపునానీకిదిగాంచిరీ జగములీఁదన్ సర్వసద్ధర్మవే।
త్రపునా నొప్పు మనీషివీవునిగమాంతస్తుత్యచారిత్రునిన్
భవునారాయణపద్మజాదిదివిజోపాస్యాంఘ్రినిర్భృత్యసం।
భవునాహ్వానము సేయవైతివిదిధర్మంబే వివేచించితే॥

ఉ॥ తప్పొకకొంతయుండినను దాలిమిఁబిల్చెదరింటఁగర్జము।
న్నప్పుడు కన్నతాఁతులఁదయాళులనన్నకృతాపరాధనా।
యప్పలతోటిపాటుగ ననాదరహానిగనైనఁబిల్వకే।
ట్లొప్పరికింపనెట్లు మనసొప్పెనునీకు విరించనాత్మజా॥

మ॥ సుతనాహ్వానము సేయనేలయనవచ్చున్ నాయనా నాయనా।
దృతికిన్ గుందనకాని నీకుశివుఁడెగ్గేమేనియున్ జేసెనే।
క్రతుకర్తన్ గ్రతుభోజినాక్రతుఫలప్రాదేశకున్ మానియా।
క్రతుభుఙ్ముఖ్యులకున్నవారికి హవిర్భాగంబులీఁజాలుదే॥

ఉ॥ ఐనదియేమొయయ్యొ నికనైనన మేయమహామహత్త్వనీ।
శానుఁబినాకపాణియమశాసనునిన్ గినియించి ప్రాణమున్।
మానముఁగోలుపోకబతిమాలి వృషధ్వజునాశ్రయింపుమీ।
యానెలతాలుపాశ్రితదయాళుఁడుగావున నిన్నుఁగాచెడిన్॥

చ॥ మనమునఁబెద్దయున్ దురభిమానముగల్గినమూర్ఖవోటని।
న్ననఁబనిలేదుగాని యల్లికాక్షునిఁగొంతయెఱుంగునీజనా।
ర్దనకమలాసనాములు సదస్యులు నీకిదిబుద్ధిగాదురా।
యనుచుఁజివాళ్లువెట్టమికి నచ్చెరువయ్యెడు నగ్గలంబుగన్॥

ఉ॥ ఎల్లరునాలకింప సతియిట్లువచింపుచునల్కచే మొగం।
బెళ్లడఁజాజువారనతఁడిట్లనునో సతి గ్రుడ్డువచ్చితా।
బిల్లను వెక్కిరించెనని పృథ్విఁజనంబులువల్కుచాడ్పునన్।
జెల్లరె నాకుఁబుద్ధులను జెప్పెదవంతటిదాననైతివే॥

చ॥ కుటిలుఁడు తిత్తిగొట్టు మొఱకుండు శ్మశానశయి హీనివాసలం।
పటుఁడు పిశాచరాజజనవాసుఁడు స్థాణువు నొక్క దేవుఁడే।
నటనను నిగ్రహించు నటయ్యుల్లియతంబు సెబాసయారెయా।
యటమటమాటలాడుటకు నాతఁడు నీకెగబోసి పంపెనే॥

చ॥ సకలగుణాభిరాముని కొసంగితిఁ గన్నియ నాయవజ్ఞ చా।
లక తనుఁ బిల్చి తేరఁదనలాగున నేనును సిగ్గు లేనిక్రు।
ల్లకుఁడనె నాదు బంధుగుబలంగము లోనొకఁడైకు అంగటన్।
వికృతపురూపుతో నతఁడు నిల్చిన నల్వురు నన్ను నవ్వరే॥

చ॥ ఎముకలపేర్లు దాల్చి ముసలెద్దొకఁ డెక్కి కళాసమెడ్డబో।
ల్లి మెయికిఁ జుట్టి భీషణవలీముఖమూర్తులు భూతముల్ సమూ।
హములుగ సూరెలన్ నడువ నా వికృతాకృతి కొండపీటిజం।
గమిచటికేగుదెంచిన నెకాని మదిష్టికి లోటువచ్చునే॥

శా॥ ఈపిల్లవని పేరటంబునకు నెక్కే తెంచితే సంశయం।
బావంతైనను లేదె యాఱు నెలలాయ్యన్ బొందుగావింపవా।
కేవీ కామరటన్న చాడుపునఁ బ్రాణేశుండునున్ బోలెఁజీ।
నీవున్ బ్రీడ త్యజించినావటె భవానీయంచు వాక్రుచ్చుడున్॥

క॥ దక్షునిఁ బ్రబలతెఘూనలవము।
దక్షుని సర్వజ్ఞవిషయికావఖతివచో।
దక్షునిఁ బోరిచూపునఁగని।
త్ర్యక్షుని సహధర్మిణియనె నతనికి మగుడన్॥

ఉ॥ తోచ్చెము లేలయూడెదవు దుష్టజడాత్మక దుర్దురూటనీ।
విచ్చతురాననాచ్యుతులకేనియు లెస్సయెఱుంగరానియా।
వెచ్చనకంటి దేవరస్థవిష్ఠమహాత్వమెఱుంగఁజాలుదే।
బిచ్చరిగేలిసేయదె సతీమణిశీలముఁ జూచి దుర్మతీ॥

క॥ గిబ్బరవుతు మహిమమునీ।
యబ్బయుఁదాతయునెఱుఁగరనఁదెలియఁగనీ।
కబ్బునెయది పెఱగాయకుఁ।
డబ్బిబ్బునడుగులు ప్రేలెదవుగాకయిసీ॥

క॥ అలమృత్యుంజయునిఁగవి।
చ్చలవిడిమూఁడనేకనాలుగు చాలదునీకుఁగ।
బలువేలతునియలుగగా।
వలదేనీజిహ్వాశివునవజ్ఞాపింపఁగ॥

శా॥ నీకుంగాలముచేరువయ్యెఁగనుకఁగ నేనాడువ్యాహారముల్।
నీకర్ణంబులకెక్కవయ్యె సభికానీకంబువీక్షింపఁగా।
గాకోలాశనుఁడంపవచ్చెప్రమథౌఘుంబుల్ నినుంబట్టిలి।
ప్రాకల్పంబుగజంపునప్పెటఁగెదా కాలారిమాహాత్మ్యముఁగ॥

మ॥ పడఁతుల్ స్వీయులుమొత్తొమొత్తొయనిబొబ్బల్ వెట్టుచేడ్వంగని।
కడయీసభ్యులలోననడ్డుపడిపేఁకఁగనిన్నురక్షింపవ।
చ్చెడుదిక్కెవ్వరులేకనిఁగ శివభటుల్ చెండాడుచోనీలకం
ఠుఁడె సర్వాధికుఁడంచెఱిఁగెదవు నిన్నుందెల్పనాకేటికి।

శా॥ నీచాగ్రేసరశిశ్విదానుఁడు సుధీనింద్యస్వభావుండునా
నీచేఁగల్గినదాటఁజేసి నితరాంనింద్యంబెయానాడుమే
నాచంద్రార్కకిరీటుపాదవరివశ్యైకకృత్యకర్త్వంబుగా।
దీచెన్నంటిశరీరమిచ్చటనే నీవీక్షింపవగ్నించెదఁగ॥

క॥ ఓగర్వ్యగుణుఁడదేహ।
త్యాగముగావించుటయె యథార్థంబుగనీ।
యాగమునకు నేతెంచిన।
యాగముతోఁ బగిఁశిక్షయగునారసినఁగ॥

ఉ॥ నందనయీగతిఁ బలికి నందన గాదిలికూఁతురన్న ప్రే ।
మందిగఁ ద్రావియొద్దితనమందిరఁ గేసుఁగొని దీనిసోలకీ ।
గందరగోళమెల్ల సణఁగందరలింపఁ బడటంచు నల్లఁ జేఁ ।
డెందముగందనానతియి డెందము నెస్సమతిగ్మమూర్తియై ॥

ఉ॥ అంతకుమున్నె స్వీకృతమహత్తరయోగసమాధినైన నిజ ।
స్వాంతము శంకరాంఘ్రిజలజంబులయందు లయింపఁ జేసియ ।
త్యంతమునుగ్రమూర్తియయి యాసతియుం దమమందదక్షుగోప్యకుల్ ।
చెంతకుఁ జేరలేరయిరి చీసలు సేరునె వహ్నికీలకున్ ॥

గీ॥ అప్పుడయ్యాదిదేవి దేహంబునుండి ।
వేఁచిచూడఁదరముగాని దీప్తితోన ।
హాశ్రయాశముపుట్టియాయమనుజుట్టి ।
దరికొనినహింపఁదొడఁగె నంకలును బెగడ ॥

వ॥ ఇట్లుఖిలానలజ్వాలికామాలికామధ్యంబున మృత్తాబుమంను బొమ్మయుంబోలెఁ దహింపఁబడుచున్న కొన్నెలతాల్పునమ్మ మిన్నంజూచుచున్నయన్నిలింపాది సభాస్తాగుల హాహాకారంబులచే సధ్వరాగారం బెల్ల మహాకోలాహలబధిరీకృతాంతరాళంబయ్యె నప్పుడయ్యయ్యోతన చెప్పినచొప్పున నె మహామహాత్వ గావున యోగప్రభావజనిత విభావసువుచే సర్వమంగళ తనదివ్యమంగళవిగ్రహంబును దహించుకొనుచున్నయది శివ శివా యెంత ఘోరకృత్యంబనువారును నింతకువచ్చినను నీకాంతను శాంతస్వాంతను జేయకూరక చూచుచున్నాఁడు దక్షుండెంత రాతిగుండియగల దురాత్ముండనువారును నీపురుషోత్తముండమున్నగు నీసభాసదులును నిదినీకుఁ దగదనక చిత్రప్రతిమలవలెఁ జూచుచు మిన్నకున్నారేమొకోయనువారును నిదియింతటఁదీరునదికాదేదియో మహాపద్రవంబు వాటిల్లనున్నయదనువారును నీదాక్షాయణి నొడివినట్లఖిలజగత్సంహారణవర్ధను

డగు త్ర్యక్షుఁడీ దక్షుని శిక్షింపక విడువడనువారును నీమశ్చిత్తునకట్టిప్రాయశ్చిత్తంబు తప్పకకావలసినదియెయ్యనువారును నిప్పులువయందె తప్పిడియీయొప్పులకుప్ప యిచ్చటికివచ్చుటయైన మానదయ్యెననువారును సర్వజ్ఞుండగు శర్వుఁడీ సర్వానంగళకోరినను వలగనినివారింప కేలయంగీకరించెనో యనువారునునై పలువురుపలు తెఱంగులఁగుసగుసలువోవుచుఁదిలకించుచుండిరాసమయంబున ॥

గీ॥ ఆదిపురుషుఁడైన దక్షునిఁజూచియెయ్య ।
లేదియఘుతను స్త్రిగ్మనరీచిచేయి ।
సాఁచితత్ప్రజాకలకలమాఁచియులద ।
ధీదియిట్లనిపలెక ధర్మోచితముగ ॥

చ॥ తగను పరాత్పరుఁడయిన స్థాణునితో నసమానకక్షయా ।
జగములనెల్ల నొకిఁట నిముసంబున మార్చుటకోపుశూలిమీఁ ।
దఁగినియ నెంతవాఁడవుబుుతంబుగనీనుడివాలుతాల్పునన్ ।
దఁగిచుఁడునున్ దదాశ్రవులు దోసమవో చీమవో నీవు తెల్పుమా ॥

క॥ తోయజయోని శ్రీనా ।
రాయణవరివశ్యితాఁఘ్రియల్లుఁడగుటకున్ ।
మాయురేమదిఁబెల్లుబ్బక ।
సూయపడెదవెంత బాలిశుండవు దక్షా ॥

శా॥ దక్షాయింతటనైననిమెను పరిశాంతిన్ జేసి శర్వున్ లలా ।
టాక్షుంజేరి మహాపరాధనుహామద్యాకార్షమజ్ఞానతో ।
రక్షత్వాం శరణంగతోస్మి యనుచున్ బ్రార్థించియానర్వాలో ।
కక్షేమంకరుఁదోడితెమ్ము బ్రతుకన్ గాయ్యుండెసన్ గన్ననన్ ॥

క॥ విడుపుము మదిగారవమునా ।
నుడుపునకున్ దప్పకీకొనుము విసఫ్రాడన్ ।
దుడిదివయిచెదేనికడున్ ।
బెడఁదపొసఁగునప్పుడను తపించెదవునుమీ ॥

క॥ నావుడు దక్షుండిట్లను ।
నీ వెఱిఁగినయంత వట్టు నేను నెఱుఁగఁగలనే ।
గావరుఁడిఁబునకు తాలుపు ।
నీవిట్లుగనింతయలయ నేటికిఁ జెపుమా ॥

చ॥ బుధుత నెలంగ పర్గమునఁ బూనినవాని మహత్త్వమెట్టిదం ।
చడిగిననాడు నాకుఁ దెలియన్ వినుపింతువుగాని లేశమున్ ।
పడితివితోలు తాలుపుప్రధానము బెక్కయు సేపుబట్టుకై ।
వడివినుతింది చాలునికవద్దొకచోటను విశ్రమింపుమీ ॥

క॥ ఈయున్నసభికులెవ్వరు ।
నీయెఱిఁగినయంతగాఁ ద్రినేత్రు నెఱుఁగరై ।
రోమమొ నొ చెప్పఁజాలక ।
పోయెనొకరుఁడును నిన్నుఁబోలె దధీచీ ॥

మత్తకోకిల॥ ఓమునూరి పరార్థ్యయిచ్చటనున్న వ్రజివికిందినా ।
రాయణాదిసులెల్ల నవ్యమహావివేకముహోరాదపీ ।
చీయనందగుపెట్టుచకగ్గఁ జెప్పినాడవు మెచ్చితిన్ ।
మాయు రేయిఁకనూపకింపుము మాటువలుకనావుడున్ ॥

చ॥ నగిమునివెండియిట్లనుఁబినాకిమహత్త్వము లెస్సవాకొనన్ ।
నిగమసులైనఁజాలవస నేనన నెంతటివాఁడ నీసమ ।
జ్యఁగలుగువారికందటికశక్యము తన్మహిమంబు సెప్పనీ ।
కుగమును లేమ వింటకిఁకనోయనగీతనిసర్గవింటి వే ॥

చ॥ వినఁబడునెట్టు నీ చెనఁటివీనులకుం బరమేశతత్త్వ ।
గ్ణనములు చంద్రశేఖరపరాదితభీషణభర్త్సనాదిక ।
ధ్వనులును నాడువాండ్రరుదితధ్వనులున్ ద్రుటిలోనఁ ద్వాన్నిబ
ర్హణముతఱిన్ వినన్ వలసినంతటిపస్తిశనీకు నుండగన్ ॥

ఆ॥ దక్షుయాత్మణంబతప్పక కానున్న।
క్షోభమేనుకనులఁ జూడఁజాల।
నశివన్నైన సవనమశివంబయయ్యెడు।
ననుచు లేచిపోయె నాదధీచి॥

క॥ అంతకుఁబూర్వమె యచటియు।
దంతంబంతయునుఁ దనయెదఁ దెలిసినస।
ర్వాంతర్యామియయినశివు।
నాంతకునకు నెడఁదఁగొంచెమలుక వొడముదున్॥

గీ॥ మొఱకుఁడని దక్షుఁదెగడిక్రమ్మఱనిసురలు।
దక్షునినొకింతశిక్షింపఁదలఁచు నిందు।
ధరునికూర్చంబునుండి క్రిందఁబడెనొకరు।
స్వేదపృషతమా చెమ్మటచినుకునుండి॥

సీ॥ ఉగ్రతమోగ్రవిగ్రహాభోగసమాక్రాంత సర్వరోదోంతరాళుఁ।
డామకుండవదశ్రమాఖిల బ్రహ్మాండహననశక్తిష్ఠ బాహాసహస్రుఁ।
డశ్లక్ష్ణపాదయుగ్మాలసవిన్యాసభారభుగ్నానంతఫణసహస్రుఁ।
డక్షీణరూక్షకల్పాంతాశుశుక్షణినిక్షేపదేశాయితేక్షణుండు।
వేల్లితాఖర్వకైశికవేల్లనజని।
తప్రభంజనవశదిగంతప్రదేశ।
ధావ్యమానాంబుభృత్సముదాయుఁడునయి।
పొడమె నత్తఱి నొకమహాపురుషవరుఁడు॥

క॥ అళికన్యస్తాంజలియై।
యళికాక్షునకెంగి యతఁడయా నాచేయన్।
వలసినపనియెయ్యదియో।
సెలవిమ్మనుటయును నాశశికలాపుఁడనెన్॥

సీ॥ ప్రియపుత్రవిభుమత్పరిగ్రహంబైన సతికిఁ జనకుఁడు శతధృతికిఁ గొడుకు।
దక్షుఁడునాపైనెదన్ గిన్కఁ గొనినన్నుఁ బిలువక యెల్లవేల్పులనుబిలిచి।
రావించియొకయ్యధ్వరమ్ము సేయుచుండుటవినియచ్చటికిసతిచనితగదని।
చెప్పియాదక్షుని చేనవజ్ఞాతయై యొడలుయోగాగ్నికాహుతిగజేసెఁ।
దనమకని పెంచినతనూజదారుణముగ।
నుసురుబల్మిమైవిడుచుచునుండననుత।
పించివారింపకొప్పరికించిచూచు।
చుండెనారాతిగుండియజెండిపోతు॥

క॥ ఆసవమువిడిచిపోరై।
రాసవమున్ద్రావియపశులైన తెఱఁగునన్।
వాసవముకుందవిధిముఖు।
లాసవముక్తియగునంతయులయువలయుటన్॥

ఉ॥ ఆసభలోనివారలెవరడ్డమువచ్చిన నగ్గిమంటలో।
ద్రోసినయెంతప్రాజ్ఞమమురూపున నేపునశించునట్లుగా।
జేసిసదస్యులెల్లరునుఁ జేడ్పడిపాయిడనాతుటాకిసో।
మాసినిదక్షుఁబట్టిపరిమార్పుమనర్గళబాహుశక్తిపై॥
గీ॥ ఉడ్డకేల్వేలుపొడలిచూపొడయఁడుమొద।
లగుకడిఁదిదావరీలకునైననిన్ను।
నెదిరిమోర్వఁదరంబుగాదేగిరమ్ము।
వేగిరమ్మగుణసముద్రవీరభద్ర॥

ఉ॥ నావుడుమ్రొక్కియాతఁడధునాభవతాంప్రణతావనైకతా।
నావుడు రాజచూడచరణౌ తవమేజయదావటన్ననా।
దైవతదైవతంబపుడు ధాట్యుపలబ్ధమహోజయప్రవమో।
దైవతవేణుమస్తనుచునిచ్చెఁ ప్రియంబుగఁగాంచిదీవనల్॥

ఉ॥ బాలసురంగలాంఛనకపర్దునకుం బ్రణమిల్లి యాజగ।
త్పాలకు నానతిం గొని యతండు వసాహావనం మొనర్చన।
న్వేలకు నేగె విష్వగుపవిష్టసమస్తతపస్విదేవతా।
జాలకు యోజనాయుతవిశాలకుఁ దక్షుని యజ్ఞశాలకున్ ॥

ఉ॥ శ్రీరమణామలచ్ఛిరువు జెంది కనుంగొనుచుండ నమ్మహా।
పూరుషమాళి సోవుచు నెపోయి హరిమ్ముఖనావివేకకం।
శేరునిఁ దక్షునిన్ దనప్రదక్షిణకరంబున జుట్టుపట్టిగం।
భీరపుఁ బిడ్గుఁ గ్రమ్మోంతఁ దలఁపించు నెలుంగున నప్పుడిట్లనెన్ ॥

గీ॥ ఎల్లజగములతల్లి నా తల్లియేది।
రావశువ యామె నిప్పుడు చూపకుంటి।
వేని యిందఱు చూడ నీ మేనికండ।
లోలి చిద్రవేలిమికి త్రికాహుతులొనర్తు ॥

క॥ చెట్టంత కూఁతురును బో।
గొట్టుకొని యుఁ దిటవునన్ దగుదుననిజ స్నం।
బిట్టులొనర్చుచునుంటివె।
కట్టా నీయంత పాపకర్ముఁడు కలడే ॥

శా॥ ఓరీ దక్షుఁడ నీకు నే భయము లేకుండఁగ నినుం గావ నె।
వ్వారున్నారని నమ్మి యాదిమపవిత్రా డర్హ్మాణాభాజనా।
కారున్ శంకరు నామతింపక సభన్ గారోష్ఠ్యముల్ ప్రేలితో।
వారిన్ రమ్మను మిప్డు నీశిరము ద్రెవ్వన్ ప్రేయ నీకుంటకున్ ॥

వ॥ అనియా సభాసములనెల్లఁ గలయం దిలకించి ॥

చ॥ పలువను దక్షుఁ బట్టియిదె బలిమి వధించుచున్నవాఁడఁ గా।
జులు తొడిగించుకొన్నయని జొచ్చుటకోపని స్త్రీలు గాకిటన్।
మొలలకుఁ దాళ్ళుగట్టుకొని పొర్చెదు పూరుషులుండిరే నినే।
బిలుచుచునుంటి వచ్చి విడిపింపుడు వీని నటంచుఁ బల్కుడున్ ॥

చ॥ ఒకరువుఁడట్లు వెఱవిసుచుండియుఁ జేవకుఁ గూరుచుండెనే ।
మొకొ సురలీయవజ్ఞ కెటులోరుతు నేనని పూషుఁ డాతర ।
స్వీకడకు నేగఁ బండ్లు డులిచెన్ శివఘర్మభవుండు పూషుఁడు ।
ర్వెకొఱఁగ రెండుదౌడలును రెండర జేతులఁబట్టి యొడ్పుచున్ ॥

చ॥ భగుఁడను నాతఁడే ద్రైయనభంబు శుభంబు నెఱుంగ కడ్డమై ।
నిగిడిన వీరభద్రుఁడతనిన్ గనుదోయి పెకల్చి కూలిచెన్ ।
భృగుముని యడ్డమేగి విడిపింపఁ గడంగిన నొకఁ తన్నుత ।
న్నిగిరిశ సంభవుండు ధరణింబడఁ గూలిచె నామునీంద్రునిన్ ॥

వా॥ ఈనిర్ముక్త ఫణీంద్రకల్పుఁ డెవఁడో యొక్కండు వీక్షింపలే ।
దో నాకౌకసులార యందఱును లెండుత్సాహమెపారఁగన్ ।
వీనిన్ గెల్వఁ దరంబు గాదెవరికిన్ వేర్వేఱ మార్గాన్నసం ।
చౌనౌనంచు నునందఱుం గవిసి రాయభ్రంలిహాకారునిన్ ॥

ఉ॥ కొందఱి భూరిహుంక్రియలఁ గొందఱి రూక్షనిరీక్షణంబులన్ ।
గొందఱినర్ధచంద్రములఁ గొందఱిఁ గుప్పిటిపట్టుపోటులన్ ।
గొందఱి బాదఘాతముల గొందఱిఁ దోడెపు లెంపకాయలన్ ।
గొందఱి నాయుధాహతులఁ గూలిచెఁ దాఁకినవారి నెల్లరన్ ॥

సీ॥ పరిపక్వతృణరాజఫలములవలెఁ దలల్ పఱియలుగాఁ గూలియఱచువారు ।
వాతముకుఁ న నెత్రుద్రవంతలు వాఱంగ బుడమిక్రేవాలి వాపోవువారు ।
విలవిల గాలుసేతులు వెలికిలబడి గొట్టుకొంచేడుపు వెట్టువారు ।
నిడుదనాలుకలు సాఁచి నడిమికేఁగరచి కుంభిని బోరగిలి విలపించువారు ।
నగుచు నొకఁరుఁడైనను మిగులకుండ ।
న్నపతిద్వంద్వభుజసారుఁడైనయట్టి ।
వీరభద్రుని చేనట్లు వ్రేటులువడి ।
చాపచుట్టుగఁ గూలి రప్పాపులెల్ల ॥

ఉ॥ వెడ్డిసునంతలేని భుజవీర్యమెలర్పఁగ వీరభద్రుఁడు ।
ట్లడ్డమువచ్చి తాఁకినవియాతులనెల్లరనొక్కట౯ వేల్మిడి౯ ।
జడ్డిగముల్ తొలంచి క్రతుశాలకు నాస్తరణంబొనర్చుచు౯ ।
గడ్డుకొన౯ మది౯ గినుకఁ గ్రన్నఁ ద్రివిష్టపనాథుఁడెత్తెన్ ॥

శా॥ దంభోళింగుడికేలఁబూని పెనుకాంతాళంబున౯ ఘోరసం ।
రంభుండై తనమీఁద నేయఁగ నకింపంగాన వేక్షించియా ।
శంభుస్వేదభవుండు నవ్వుకొనుచు౯ సహ్రాదినీకంబుగా ।
స్తంభీభూతము సేసెనయ్యెడన నాజంభారి దోస్తంభము౯ ॥

శా॥ అంత౯ దాలిమిడిందిపశ్యదశుహ్యాటోపుఁడై యుండిరా ।
కాంతుం డాశివపుత్రు నేయుటకుఁ జక్రంబెత్తిన౯ జూచి ని ।
శ్చింతుండై నిలుచుండి ప్రమానుసిలఁ జేసె౯ వీరభద్రుండుదా ।
వంతంబందగ నాసుదర్శనముతో వైళంబ వైకుంఠుని౯ ॥

మ॥ అకటా చూడి తెనీకు నాప్తులగు విష్ణ్వాదుల్ పరాభూతులై ।
రిఁకఁ దిక్కెవ్వరు నీకు నోరి యొటా యిష్టంచునాదక్షును ।
స్తకము౯ గోటనెత్రుంచి హోమశిఖిమీఁద౯ వైచె వింతల్ నెలం ।
తుకలు౯ బెట్టుకడించియేడ్పు టులివుల్ ద్యోవీథికి౯ బ్రాకొన౯ ॥

సీ॥ ఋత్విజులను వెక్కిరించి నవ్వెడువారు పెనువంటపాకలుపీకువారు ।
హవిరాదివస్తువులవనిఁ జల్లెడువారు వేములఁ గాల్మడి విడుచువారు ।
దక్షబాంధవులయాచలలు మొత్తెడువారు కుంబలు పందిళ్లు గూల్చువారు ।
వేలిమికోరముట్లు వెలిబార వైచువా రగ్గికొండములు చల్లార్చువారు ।
విడువుడిఁకఁ బుద్ధివచ్చె నివ్వఁడనిపించి ।
యడ్డుకొనువారి నేపిరపాడఁచువారు ।
నగుచు సస్వసంబొనర్చిరయ్యక్షుల [illegible] ।
నప్పుడప్పీరభద్రానుయాయి ముఖ్యులు ॥

మ॥ అటులాదక్షుఁడొనర్చుచుండిన మహాయాగంబశంకంబుగా
విటతాటంబొనరించి లబ్ధజయుఁడై వీరేశ్వరుండేగి ధూ
ర్జటికిన్ సాగిలి మ్రొక్కి చేసి నిసర్గంబున్ నివేదించెన
చ్చటవిష్ణ్వాదులు తన్నికారమునఁ బశ్చాత్తప్తులై కుందుచున్ ॥

శా॥ అజ్ఞానంబునఁ జేసి చేటొదవునం చాత్మన్ వివేచింపకే
యజ్ఞార్థంబరుదెంచుటన్ దగినప్రాయశ్చిత్తమిష్టమ్మయ్యెనీ
యాజ్ఞావర్తులమేము వెట్టుకొను మొఱ్ఱాలించి వేవచ్చి స
ర్వజ్ఞ మ్రొక్కుచునుంటిమీ పెనువెతన్ వారించి రక్షింపవే ॥

శా॥ అంచున్ వేడుచునున్న యాసురలకుయ్యాలించి చూపట్టి యా
పంచాస్యుండు పురందరాచ్యుతులకున్నాన్పాటుల్ తొలగించి మ
న్నించెన్ వారల నేఁడుకోలు ననటన్ జేడ్పడ్డ జేజేలర
క్షించెన్ మేఁడశిరంబునుర్చి బ్రదికించెన్ దక్షునిన్ గ్రిమ్మఱన్ ॥

ఉ॥ ఆగిరిశుండు వేల్పుదొరలందఱు వేఁడుటఁ జేసి వెండిత
ద్యాగము పక్రమించుటకుఁ దక్షునకాజ్ఞయొసంగి తద్ధవి
ర్భాగము ముందుగాఁగొనె సుపర్వులప్రార్థనచే శివాజ్ఞ నా
రోగిణముల్ పొనర్చిరమరుల్ మఘవద్రుహిణాచ్యుతాదులున్ ॥

వ॥ ఇట్లు సురప్రార్థితుండై దక్షాధ్వరంబు గావింపంజేసి పశ్చాత్తాపదుఃఖితమనస్కుండై యున్న దక్షునూఱడించి తత్రత్య నిఖిలబృందారకకర్మంది బృందసంస్తూయమానుండై శివుండంతర్హితుండయ్యెనని చెప్పిన నప్పౌరాణికుంజూచి మహాత్మా సురప్రార్థితుండై సుమశరుండేమి సేసె నయోనిజయైన జగన్మాత శీతగిరినేతకెట్లు తనూజాతయయ్యె నానతీయవేయని శౌనకాదులు ప్రశ్నింపఁబడియును ॥

మదనవృత్తం॥ ధారాధరఘవిగళా దమునోలలాటా।
స్వారాణ్ణతాంఘ్రియుగళా శశిఖండజూటా।
క్రూరాసుహృద్విశసనా కుధరేంద్రచాపా।
వారాణసీనివసనా వనమాలిరోపా॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందుత్తరభాగమున
ద్వితీయాశ్వాసము

---



శ్రీ రస్తు.

శ్రీ గణేశాయనమః.

# తారకాపచయము.

## ఉత్తరభాగము.

### తృతీయాశ్వాసము.

క॥ క్షీరోదమథనవేళా।
ఘోరావిర్భూతకాలకూటక్ష్వేళా।
హారపరిత్రాతజగ।
ద్వారావారాణసీనివాసాగారా॥

వ॥ అవధరింపుము శౌనకాది మహామునులకు రోమహర్షణసూనుండిట్లని చెప్పందొడంగె॥

మ॥ హిమవంతుండనువాసరాచరితసర్వేశార్చనుండొక్కనా।
డుమహాదేవనమస్యకోసమొక కండోలంబు చేబూనిపు।
ష్పములందెచ్చుటకొక్క చేర్వఁగల కాసారంబుఁబ్రాపించియం।
చుమనోజ్ఞంబులు పుండరీకకుముదావల్ గోసి సంతృప్తుఁడై॥

క॥ తామరలుగోసి యింటికిఁ।
దామరలుచునున్నతటి న్నతాదృశజలరు।
ద్ధామధురానహమగుచును।
ధామాధురాంభసఁ బ్రై పోలు నకొఱలనన్॥

ఉ॥ ఒక్కసహస్రపత్త్రమున నుద్యదనూరునియంతృమండలీ।
రుక్కనుమించఁజాలినయురుప్రభతో వెలుగొందుచబ్రవుం।
జక్కదనంబుచే నజునిసర్గమునందునభూతపూర్వమై।
యక్కడఁగానిపించెనొకయాఁడునిసుంగలగట్టుతేనికిన్ ॥

ఉ॥ ఊయెలలోనఁబండుకొని యూఁగుతెఱంగున నాసముల్లస।
త్తోయజగంధముఁబంధుకొని తూఁగుస్తనంధయుఁజూచియయ్యవ।
శ్యాయశిలోచ్చయేంద్రుఁడెదనబ్బురమందుచుఁ గొంతసేపుక।
న్మూయకచూచుచున్ నిలిచె ముద్దులుమూటలుకట్టునాయమన్ ॥

ఉ॥ పోవుచుఁద్రోవలోనొడమె ప్రాఁడుపుఁగాంచిన కింపచానున।
ట్లావలినేలతాల్పుదొరయానిసుఁగుంగని హర్షమాణుఁడై।
కేవలమున్ బ్రణంత్రనుజిఘృక్షుఁడు భక్తదయాళుఁడన్మవో।
దేవుఁడు ప్రీతుఁడై యొసఁగెఁదీని నటుంచెదఁబొంగె నెంతయున్ ॥

ఉ॥ అంటియునంటనట్లధికమైన మెలంకువతో నగేంద్రుఁడా।
చంటినిహంగునెత్తి జలజచ్ఛదనంబునఁబట్టి పర్వుమై।
నింటికినేగి మేనకకునిచ్చుడునాచలిగట్టుతేలివా।
ల్గంటియుఁబొందె నెన్నఁడునుగాంచియెఱుంగని సంప్రమోదమున్।

మ॥ పసిఁడింబోలుపనానఁగొల్పునసుశ్శోభన్ బొల్చుచున్నట్టియా।
పసిబిడ్డన్ మెలపొప్పనెత్తికొనియా ప్రాలేయశైలేంద్రప।
త్నిసునూళంబునుజెందికొంతవడికిన్ దెప్పర్లియానందబా।
ష్పసమూహంబులు పెద్దసేపువిడిచెన్ శగ్గాతిరేకంబునన్ ॥

ఉ॥ ఆపసిబిడ్డనెత్తుకొని యక్కునఁజేర్చుటయున్ బ్రసూతికా।
రూపముదాల్చె మేనకయుకోజములంబెను చేఁపుజొబ్బిలన్।
జూపఱుమెచ్చలాసికసుశ్శోభననాటకశాలలోపలన్।
మాపొకవేసమున్ విడిచి మాఱటబారిసమూనుకె నడిన్ ॥

గీ॥ చూలుకాన్పును లేకయూ సొగసుటడ్డ।
పట్టుపావనుకూతుగాఁబడసి పురుడు।
లేనిబాలింతయ్యెు నా మేనకపురు।
డెందముఁగలదీశ్వరినకన్న యిందుముఖికి॥

ఆ॥ మొదటిగేస్తురాలు మూలప్రకృతిజన।
నీజనకులు లేని నిఖిలభువన।
కారణాత్మచంటికందయి మేనక।
చన్నుగుడిచె శివునిశాసనమున॥

ఆ॥ దొరకునింటమహాళికరుణచే నొకతమ్మి।
దొరవియందు నొకఁగరితనిసుఁగు।
దొరకుటెట్టిఁగి చూడనరిగిరిపౌరులం।
దొఱకు స్తుతిగునఃకుతూహలులయి॥

మ॥ శ్రితభక్తేప్సితదాయకుండగు కపర్దింగూర్చి పెక్కేండ్లుగా।
వ్రతమంబౌ నియమంబునన్ మహింగోత్రస్వామి కావించిన।
ట్టితపంబిప్పుడిదిన్ ఫలించెననుచున్ డెందంబులం దెంచిర।
ప్రతిమానమ్యతిమూర్తినాదిఋతపాపంగాంచి యాన్నైగముల్॥

మ॥ మునుపెన్నండును నెందుఁబొందని మహామోహంబుగల్గించున।
య్యనిదంపూర్వవిలాసమూర్తిఁగనియష్టయోగ్యషధిప్రస్థవా।
సినులైనట్టి నెలంతలెల్లనిఘసాజీవాములన్ విస్మరిం।
చిని షేవించుచునుండిరెప్డెడయు కాశీతాద్రిరాజాత్మజన్॥

శా॥ బాలాంలోకశిరోవతంసమగుచున్ భాసిల్లునయ్యీశ్వరిన్।
నాళీకాక్షులు తూగుమంచములలో నంబంధుకో బెట్టియు।
య్యాలూగించుచు ముద్దులాడుదురమేయంబైన హార్దంబునన్।
లాలుల్ జోలలు దొట్లపాటలు మహోత్సాహాల్లానంబునన్ బాడుచున్.

మ॥ నిఃమూహింపఁగలేక యీశ్వరినను ర్వీంద్రోక్తసామాన్యబా।
లిక గా నెంచిరటంచు నవ్వుకొనుసోలిన్ దోచెనష్టానెలఁ।
తుకలక్ష్ణశరానురాగమువఁదన్నున్ సందిటన్ ముద్దుబె।
ట్టుకొనంబోయెమునప్పు నెత్తికొనినప్పున్ సారెకున్ నవ్వుచున్॥

ఉ॥ కంగటిప్రేంకలోఁదగుసుఖంబు మెయిన్ శయనించికాలుగే।
లుంగదలించుచున్ జిలుఁగెలుంగెసఁగన్ దనలోనఁదా నెఊ।
ఊంగయటంచుఁ బల్కుకొనుచుండు వినోదముజూచిచూచియా।
బంగరుబొమ్మ నెత్తికొని భామలుముద్దిడుకొందురర్మిలిన్॥

క॥ పడమండఁగెలనఁజూచుచుఁ।
బుడమింగూర్చుండఁబెట్టి సొలఁతులుకొన్నా।
ళ్ళాడికపుఁగనియగునాయము।
నెడపక యూడ్చించుచుందు రెలమివలిర్పన్॥

చ॥ వెలఁమలచే ధరిత్రినుపవేశితయై యుమవారిఁజూచుచున్।
గిలకిలనవ్వుచున్ దనమకేల్గవయానలిక్రొంబసిండిగా।
జులురలిపోవఁగొట్టుకొనుచున్ దనరెన్ గనకాత్రిశాయిదీ।
ప్తులయివమత్రరంబులకు భూషలివేలనియొంచెనోయనన్॥

మ॥ తనతిర్యజ్ఞమనంబువింతసొబగుత్పాదింప మోకాళ్లురెం।
డునుఁగేల్దోయియు నేలనానుకొనియందున్ బ్రాకుచున్ జెంతఁగ।
ల్గినపంకేరుహపత్రలోచనలు గేలిన్ బట్టుకోపట్టుకో।
యనిపల్కన్ జనుఁదొంటికంటెఁమరుసొయానంబునన్ నవ్వుచున్॥

చ॥ మగువలు గాఢహార్దలు హిమక్షితిభృత్తనుజాతముద్దుకే।
ల్దుగసవ్వశయద్వయాంగుళులతోఁగొని యామెను లేవనెత్తిచ।
ల్లగదకుకేలువట్టులు వెలారిచివిద్దెమువిద్దెమంచుమె।
ల్లగనిలుచుండఁబెట్టి పదిలంబుగఁజూచుచునుందు రాయమన్॥

క॥ వనితలు కనిష్ఠయోఁత ।
ర్జనియోఁ కేలూఁతగా నొసఁగి పడకతోఁ డఁగ ।
గని పెట్టి నడుపు హిమవ ।
త్తనయ నడుచు వారి వెంటఁ దప్పటడుగులన్ ॥

మ॥ ఎడగల్లన్ నిలుచుండి రమ్మనుచు నయ్యేణాక్షి పోఁకుండినన్ ।
మడఁతుల్ కన్నులు కేలమూసికొనుచున్ మాయమ్మయే వచ్చెనో ।
వడి మాతల్లియె వచ్చెనో యనుచుఁ బిల్వన్ మెల్లనన్ జిట్టిది ।
ట్టడుగుల్ వెట్టుచుఁ బోయి మీఁదఁబడు నయ్యన్ ముద్దుగా నవ్వుచున్ ॥

క॥ ఈక్షణములె క్షణములు మన ।
యాక్షణములె యాక్షణములు ఋతముగ ననుకోం ।
చాక్షణదాపతివదనలు ।
సాక్షాదీశ్వరినిఁ బాయఁ జాలరొకపుడున్ ॥

గీ॥ తనతనయకన్నియును మహాధనమణిమయ ।
మండనంబులె కాని సామాన్యములగు ।
మండనములుంచడయ్యె నాకొండదొరము ।
హిమభృదగ్రణికుపలములేమి కొదవ ॥ [గుడి ।

సీ॥ గుజ్జనగూళ్లు దాగురుమూఁతలను బిళ్ళగుడుగుడు గుంచముల్ కుందెన
నెట్టుడుగాయ వెన్నెలకుప్పలచ్చనగాయలు గంజనకాలుపగడ ।
సాలయొకటి సికొకటి నాలుగుకంబములాట కోలాటములందలంబు ।
చీకటిమొటికెళ్లు సిరిసింగణావత్తి బొమ్మలపెండ్లిండ్లు పుట్టచెండ్లు ।
లోనుగాఁగ నాటలు జనతానుతగుణ ।
తౌను విడమిన్నలం గూడి జానుమీర ।
సానుమత్తల్లజప్రియసూను వపుడు ।
తాను నాడును సామాన్యమానుషివలె ॥

క॥ ఉత్తమవనితలు జీతము।
బత్తెమునున్ లేకయె యెడబాయక యెపుడున్।
దత్తఱబడకైకొలువహిమ।
వత్తనయాక్రమించె శైశవము తృటిలో లేన్॥

శా॥ ఆపుణ్యోన్నయతన్ను నెల్లరు నశేషాజ్ఞేయవిద్యారహా।
శ్శేషిష్ఠావగతిప్రవీణయని యగ్గింపెంతయున్ జేయనై।
ష్యోపాధ్యాయుకసుంతయేనియును లేకుండగనే సర్వవి।
ద్యాపారీణమనీషయయ్యెఁ బరమేశాంచత్ప్రసాదంబునన్॥

చ॥ సదయకులోకమాతకుఁ లసత్ప్రథవర్తనసుప్రసిద్ధలౌ।
త్రిదశులవిద్విషద్భయము తీరిచిప్రోచుటకున్ గృపారసం।
బొదవియెడందలోనుబుకుచున్నదియే మొకొ యిట్లుపైకనన్।
గోవమమెఱుంగునిబ్బరపుగుబ్బచనుల్ తలచూపెనత్తఱిన్॥

క॥ తమదుశ్రుతిపారదృశ్వ।
త్వముఁ వ్యక్తముసేయుచున్నవడువుననపుడా।
హీనువత్తునతకన్నులుఁ।
ర్ణములసుదలకంటఁబ్రాకినవియై పొలిచెన్॥

ఉ॥ పాయముపెరిగొప్పదొరబాల్యముపేరటిచిన్నయేలికన్।
బాయగఁబారఁదోలి స్తనపర్వతదుర్గములాక్రమింపఁబో।
గాయజశిల్పియొక్కటకుఁగట్టినయట్టిపసిండిపావటీ।
లోయననుల్లసిల్లెఁద్రివళుల్ హిమవత్తనుజాతకౌనునన్॥

శా॥ తారుణ్యంబుప్రవిష్టమౌటకు నిమిత్తంబోయనన్ సవ్యగా।
త్తారుణ్యంబయి పద్మరాగమణినొయ్యన్ రాపడంజేయుచే।
సారెన్ మంకెనపూవుజంకెనయగాఁబల్లవప్రవాళప్రవాడో।
ప్పారెన్ జెల్లరె వల్లకీగుణసమగ్రన్నిక్వణక్షీపున్నదై॥

క॥ అలనై యగ్రోధము కెం
డలిరును మొదలైనవస్తుతతియున్నవలా
పలువల్లువకు నీడౌనని
పలువలువచియింతు రేను పలుకరుప్రాజ్ఞుల్ ॥

చ॥ అమయగనున్న స్వర్ద్రవిణమంతయు నుర్వ దనునాశ్రయించిన
ట్టి మొగడ చన్నుదోయి కిఁగటిద్వయికిన్ ద్యజియించిస్వీయలో
భమునఁ జూడకుండుటను బట్టియె విష్ణుపదంబుతోడిసా
మ్యమొనవిప్రాజ్యమయ్యెననమధ్యమమెంతయుఁ జెందెఁగార్శ్యమున్ ॥

చ॥ ఉనప్రసృతుల్ మరుండుహరునోర్చుటకున్ నమకూర్చుకొన్నకా
క్నమాలగు తూణరత్నములు కావుటనిశ్చయమందమన్నని
కర మెపుడునున్ విలోమములుకాని మనోజనిషంగముల్ విలో
మములగు భూమిభృద్వరకుమారిక చక్కనిపిక్క లెల్లగున్ ॥

గీ॥ సూర్యభిస్తుతలావణ్యశోభమాన
నార్యవైలక్షణ్యప్రతిభాతిరేక
నార్యఁగాంచి వికుర్వాణుఁడగుచునయ్య
హార్యసార్వభౌముండు మిన్నంటెనపుడు ॥

ఉ॥ ఆధరణీధ్రచంద్రమున నప్పుడు మాఁకొనె నీశ్వరుండసం
బాధశిఖావితానము భద్రపటంబను పేరనొప్పు న్య
గ్రోధము ద్రష్టృజన్యునికురుంబను తాంబువమండలాతిగో
త్రోధము శోభికాకృతశితమ్యుతిటిగ్మకరావరోధమున్ ॥

చ॥ సనకసనందనాదులగు సంయమివర్యుల వేఁడికోలునన్
బనుపడనగ్గిరీంద్రబహుపాదగమప్రవరంబు చెంతకున్
జనియటఁగూరుచుండి మునిపుణ్ములుకండని వారికాజ్ఞయి
చ్చినిటులలోచనుండొనరిచెన్ బరమార్థమహోపదేశమున్ ॥

శా॥ రుద్రాదిత్యమరుద్వసుప్రభృతిశుశ్రూషాగ్రహీత్యాల్లస।
త్పద్రాజీవుఁడు శర్వుఁడమ్మునులకున్ బల్కొక్కఁడున్ లేకచి।
న్ముద్రామాత్రముచేతనే సకలమున్ బోధించి నిస్సంశయా।
త్మున్ద్రసాంతులఁజేసి వీడ్కొలిపియచ్చోనుండెఁదానొక్కఁడున్॥

ఉ॥ ఆహిమవన్నగాధిపతియప్పుడధిష్ఠితయానవన్ జగ।
న్మోహనవిగ్రహున్ దనదుముద్దుకొమారితఁజూచియే తదు।
ద్వాహమహాప్రసాదమున ధన్యునిఁజేసి యనుగ్రహింపవే।
యోహరనన్ను నంచునతఁడువ్విళులూరుచునుండె నాత్మలోన్॥

గీ॥ రేలునుఁబగళ్లుమన్ సార్వకాలికముగ।
వేఱుతలఁపేదియును లేక విసపుగుతిక।
యేలికమదీయసుతనుద్వహించు భాగ్య।
మున్నదో లేదో కదయనియుదిలగొనుచు॥

మ॥ అతఁడొక్కప్పుడు తద్వటాంతికమునందక్షాడువాఁడచ్చటన్।
ద్యుతినుద్యద్ఘననాథుఁజెల్వమునఁజేతోజాతునిన్ మించును।
న్నతదేహంబమయన్ దపస్వివలె మౌనంబూని నవ్యాజ్ఞమీ।
లితనేత్రుండయి కూరుచున్న శశిమౌళింగాంచెఁడబ్బాటునన్॥

చ॥ అగమునకల్లుఁడౌమనని వ్యక్తముసేయుచునున్నపోల్కిన।
య్యగమునకల్లుడౌనటులు స్వాంగముమ్రానికినానికూరుచు।
న్నగిరిశునిన్ జగత్త్రితయనాథునిఁగన్గొనిమేన నెల్లెడన్।
గగురొదవన్ బొనర్చె మిహికాగిరినేత బహుప్రణామముల్॥

మ॥ అధికానందపరీతచిత్తుఁడయి సాష్టాంగంబుగాఁగన్ దయో।
దధికయ్యిందుకలావతంసునకుఁ జోతల్ సల్పి నిధ్యంజనా।
వధిక్షేత్రవ్వేడుచోటుసన్ నిధియొకొంచన్ గగ్గెఁబోయంచునెం।
తెదరాగ్రేయుఁడు శూలిఁగూర్చియెవుదిన్ జింతించువాఁడౌటచేన్॥

ఉ॥ మంచుబిడారుగట్టుదొరమానసమందనిశంబు నామొఱా ।
లించియనుగ్రహింపవె బిలేశయరాజకలాపయుతుమువాం ।
ఛించుచున్నవాఁడగుటచేఁ దనకాశ్రితరక్షకుండుగా ।
న్పించియశక్యవర్ణనము ప్రీతివిశేషమొసంగుటబ్రమే

చ॥ త్వరమయినింటికిన్ జని యుదంతమదంతయుఁగారవంపుఁగా ।
తురికెఱిఁగించి యాయమనుదోడ్కొని యెంతయు సంతసంబునన్ ।
గిరికులసార్వభౌముఁడరిగెన్ మగుడన్ మునువచ్చివట్టిపెన్ ।
దెరువుననీశ్వరుండు శ్రితదీనజనావనుఁడున్నచోటికిన్ ॥

గీ॥ శైలనాయకుఁడమ్మహేశ్వరునివలన ।
నమయుఁదదనుగ్రహమహాధనముఁనువడయు ।
వలసిగిరవుగనుంచినట్లలికలోచ ।
నునకుఁబరిచర్యకర్పించె ననుఁగుసుతను ॥

ఆ॥ ఆనయమెప్పుడేమివనివంచునోయని ।
శూలిమొగమునందె చూడ్కినిలిపి ।
పరిచరించుచుండెఁ బరమేశ్వరునకునా ।
లలనకన్నుసన్నలన్ మెలఁగుచు ॥

వ॥ ఆనమయంబున ॥

సీ॥ అరవిందనవమల్లికామ్రనీలోత్పలాశోకంబులనెడు నాశుగములూని ।
తుమ్మెదగొనయంపుఁ దుంటవిల్వట్టి యందంపుఁగెందమ్మిబొందలము [దొడిగి ।
మొసలిడాలు మెఱుంగు లెసఁగారు పులుకాషి పులుఁగువార్వంపుఁదేరు [పొనగనెక్కి ।
మలయమారుతుని నామని తేనిరాతిఁడిపడఁతుక యొడయని బాసటగొని ।

సంయుగోచితమైన వేసమ్ముపూని।
పద్మనాభాద్యమర్త్యులపంపు సేసి।
కడుఁబోఁగడుగాంచవలెననికాయమూని।
విషమనయనునిమీదికి వెడలెమరుఁడు॥

గీ॥ ఆసడిమెఱింగి తనహృదయంబుకుదురు।
చాటుకొఁకటిక్రేవ్వేశ్వతో పాఁతుపెకల।
నించువిల్కానితోరతియిట్టులనియెఁ।
గేలుగవఫాలతలమునఁగీలుకొలిపి॥

శా॥ ప్రాణేశా వినుమొక్కవిన్నపము సప్రాసన్న్యదిత్తుండవై।
వాణీనాయకభార్గవీపతిబృధస్వర్లోకనాథాదిగీ।
ర్వాణస్తోమసమర్చ్యమాణచరణద్వంద్వుఁడై కృతాంతాంతకుఁ।
డ్డాణుఁ డీకుఁజలింపఁజేయఁదరమే చర్చింపుమీచక్కఁగన్॥

క॥ అతఁడెక్కడ నీవెక్కడ।
మతినారసిచూడ హాసిమశకాంతరమా।
శితిగళునకు నీకుమఁబ।
ర్వతపరమాణువులయంతవాసి నిజముగన్॥

క॥ చేటెయగుగాని విజయము
వాటిల్లమ సమ్ము నిమ్మవమునీబోఁటుల్।
జోటింగుఁజెనయఁగడఁగుట।
లేటిపులిని నొంపనక్కలించుటయసుమీ॥

ఉ॥ ముట్టినమాత్రవాడుపడు ముల్కులతోఁజని నీవజాండముల్।
చట్టులచాడ్పునన్ జదుపఁజాలినమున్మొనవాలుకేలను।
న్నట్టిలలాటనేత్రుశమనాంతకునోర్చెదవేని దూఱిచే।
పట్టినమానవగంబుఖడఁగూల్చుటకోపుఁగదా యమాంసుఁడున్॥

చ॥ కలతెలుఁగుంటులెల్ల తను కార్యమెచూచిరికాని నీకుఁగా।
గలదొకవెంచ రైరి తెలుఁగంట్లముఖస్తుతికుబ్బి చేటుపా।
టులరయనైతివీవును బ్బ్రధుండును రాసదుడమ్ము మాత్ముతో।
వలవనమానకత్తుప్రేయవల్లభ యీజతనంబు మానుమీ॥

మ॥ రతిమోమోడకయిట్లు వలుకుటయు వారంభోరువుల్ జూచిన।
స్మితనై మోములరాకమీఁ సిడపు వజ్రీఁడిట్లనుఁ విస్మయా।
వతచూడాభరణంబ స్త్రీజనమునస్వాభావికంబైన త్ర।
స్నతచేనంటివిగాక శౌర్యధనులన్యల్నాకునీడామరే॥

ఉ॥ ఎంతభుజాబలాఢ్యుడనొ యేమియెఱుంగుదువాడదానవీ।
వింతిరొ మద్బలంబెఱుఁగకిట్లు వచించెదుగాకలచ్చితే।
డంతటివెగ్గలీఁడు నను వాత్మజునల్పుఁడనేని కూలిసై।
నంతకహాంత్లై శిఖియాత్కునిసై నెదిరింపఁబంపునే॥

ఉ॥ ముప్పదిమూడుకోటులు బుభటల్ దివినున్నను వారికేరికిఁ।
జెప్పినయీకడిందివని జేయగలేరనినన్ను వేఁడినా।
రప్పవిపాణిచక్రధరులంతటివారలు నాకునేనుగా।
జెప్పుకొనంగనేమిటికిఁ జెల్వమదీయపరాక్రమోన్నతిన్॥

చ॥ భువనము లెల్లనాకుఁగలముట్టినమాత్రనవాడువాఱున।
ల్పవిశిఖపంచకంబుసనలంచుచునుండుటనీవు చూచుచుం।
టివకద వారిజాతదళనేత్రి మదాశుగవృష్టిచేతఁదే।
జువిడిచి డిందకున్నె యలశూలియుఁగీలియురేపుచూడవే॥

ఉ॥ స్తవ్యపరాక్రముల్ మఘవశార్ఙ్గధరాదులు వేఁడువారుజే।
సెవ్వఁడు వేఁడికంటివొరథన్యజనుస్సుకుఁడసేనకాదె ప్రా।
ణవ్యయమైనమేలె జయనంబొనగూడినమేలె యెట్లునుఁ।
జివ్వలకోరికిఁ వెనుకదీయుమనేమినుమీఁదఁగూలినన్॥

ఉ॥ ఈశ్వరు నేను మారోఁగని జయించెద నేని యనన్యలభ్యమా ।
శాశ్వతకీర్తిగాంచెదను చాలిక లేనికతంబునన్ మహాహా ।
త్ర్యాశ్వనిచేత నొచ్చి తెగటాఱుము నేని తపోధనుల్ మహా ।
క్షీశ్వరులిచ్ఛగించెడు మహిష్ఠపదంబున కేనువోయెదన్ ॥

క॥ ఓయువతీరత్నమనా ।
సూయాణము మాన్పకుము యశోవామృత్యు ।
ర్వాయనిమినుసిగదొరపైఁ ।
బోయెదనేమైన సరియె పూర్ణేందుముఖీ ॥

క॥ పతియుల్లనుఁడుదదంఘ్రి ।
ద్వితయముపైవ్రాలి యారతీదేవినమ ।
సత్కృతిజేసి నిల్చిచూడఁగద ।
యితుని మొగమునందునిల్పియిట్లనె మగుడన్ ॥

ఉ॥ క్రొన్నెలతాల్పుతోడఁబగకూడదుదానదొసంగెసంగునం ।
చెన్నితెఱింగులన్ నోడివిమేనునినున్ బతిమాలుకొన్ననా ।
విన్నపమాలకింది యొదవింపవయూఱటనాకునయ్యొకా ।
నున్నది కాకమానదెటులున్నదొ నాతలవ్రాఁతయింతకున్ ॥

ఉ॥ ఇంపలరార నామనవియెన్నఁడుఁగేటునఁబుచ్చవీవు నా ।
పంపుకడంగితీరుపనపాల్పడుచుండెడివాఁడవిప్పుడా ।
లింపవునామప్రార్థన బల్మియలదైవచికీర్షితంబుత ।
ప్పింపఁదరంబె యేలెవిలిపెక్కువగల్గినవారికేనియున్ ॥

క॥ పోనిమ్ము వెంటవచ్చుట ।
కేనియునీకొనుము జీవితేశ్వరనన్నున్ ।
దీనికినినొప్ప వేనిప్ర ।
సూనాయుధ మరలవచ్చిచూతవు నన్నున్ ॥

ఉ॥ అంచువినీతిపెంపునఁ గృతాంజలియై రతియట్లువల్కఁ నా।
పంచశరుండు మంచిదని పైదలితో రథమెక్కి సాగి కా।
వించె నభిక్రమంబు తన వెంబడి నెయ్యురుకూడ నేగవే।
యంచులవాలుదాల్పిడినయానతిదీర్పఁ బినాకిమీఁదికిన్॥

ఉ॥ చేరువనొక్కఁడొక్కఁ డీయచేసె ఘూతంబు కటుస్వనంబుతో।
ఫేరువలంతిదవ్వున నె పెద్దయు సేపఱచెన్ రథంబుపై।
బోరువ దూఁకొనెన్ జెవులపోతెదు రైచనె వైజయంతిపైఁ।
బారువముల్ దివాంధములుఁ బాఱరలాడఁ దొడంగె నత్తఱిన్॥

క॥ సకినములవిగనిరతితన।
యొకిమీనియడుగులనొఱగి యొంతగఁబతిమా।
లుకొసినను వినకయూద।
గృకుఁడీశ్వరుఁడున్న హిమధరంబునకరిగెన్॥

చ॥ అవశకునంబులెవ్వియును నాత్మఁగణింపక మొండికట్టెపు।
ష్పవిశిఖుఁడట్లువోయి హిమశైలమునందొక చక్కిఁ బెక్కుఁపు।
ట్లవసుధనాక్రమించి కొమలన్ ముదిరాధ్వమునాక వెట్టునొ।
కఱవటముక్రింద నీశ్వరునిఁ గాంచెఁ బరాత్పరునాదిదేవునిన్॥

సీ॥ తనయపాపురుషికమునుముట్టఁబొలఁగించు నబ్బురంబగు మేనిహ
[వుసువాని।
నుల్లంబునందేదియో విచారించుచుఁగన్నులుమోడ్చికూర్చున్నవాని।
సేవకైజనకునిచే ననుజ్ఞాతరై యుమనన్నిధానమందున్నవాని।
నుద్యద్దివాకరద్యుతికోటికంటె నగ్గలమైన తేజుచే వెలుఁగువాని।
దక్షిణామూర్తియను పేరఁ దనరువాని।
నల్లకుత్తుకదొరఁ గాంచి యొల్లమేని।
కింగగురువుట్టమోటపు కేలువ్వాని।
చిన్నిపువ్వులు పెక్కొఱ నర్చె రతిజాని॥

చ॥ జడియక చిల్కరౌతు విశిఖముగా నిలుచుండివిల్లుగే |
ల్విడఁగొనియెక్కువెట్టి హృదిలెప్పముగా రతిదేవిమెట్టిపెన్ |
బెడఁదపొసంగునోయనుచు బెగ్గిలిచూచ్చుచునుండ దర్పమే |
ప్పడనడరించె నంపఱపరంపరగా నుడురాజమౌళిపైన్ ॥

గీ॥ దాననించుకమది గలంతపడఁడున్ ని |
దౌనమించువిల్తుఁడె యంచుఁదలఁచుచుగజ |
దానవనిషూదనుండు ముందఱకుఁజూచెఁ |
దానపుడు మీఁదిపోగకన్ను దరము దెఱచి॥

చ॥ ద్రుహిణచతుర్భుజామలమరుల్ దివినుండి మహానుభావయా
గ్రహముపసంహరించి కృపఁగావవె వీనినటంచుఁబల్కుచున్ |
బహునిబిడార్తరావములఁ బ్రార్థనసేయుచునున్నయంతలో |
నహరుఁడు నీఱుసేసె మరునిన్ నిటలోదితవహ్నికీలచేన్ ॥

గీ॥ అవురకనుమూసి కనువిచ్చునంతలోనె |
విలునునమ్ములునున్ గొనినిలిచియున్న |
కామునిన్ బసుమఁపుప్రోవుగాగమార్చెఁ |
త్ర్యంబకుండాదిమప్రాతిహారకుండు ॥

మ॥ భువిపై దివ్వియతాఁకునన్ సుషమమై పొల్పొందుకప్రంపుబో |
మ్మనలెన్ ధూర్జటిఫాలనేత్రశిఖిసంస్పర్శంబునన్ బేసికై |
మవుజోద్దట్టులు మండిపోవుటయుఁదద్దుఃఖాతిరేకార్తయై |
యవనిన్ దెళ్వదొఱంగికూలె రతి హాహా నాధయంచార్చుచున్ ॥

ఆ॥ కృత్తమూలయైన మృదులాంశుమత్ఫల |
వలెనెకూలి పెద్దవడికిఁదెలివి |
పూని యేడ్వఁదొడఁగె వీనిమతీవెల |
పలుకునగఘూర్ణించు నెలుఁగుతోడ ॥

చ॥ మడిసితిఁగూలితిన్ బిలుకుమాలితిబిడ్డతిఁగీటడంగితిన్।
గెడసితినేలపాలయితి గిట్టితిదోరితి గంతుకొంటిమే।
నెడసితి భ్రమందితిన్ జెడితినీల్గితిభ్రగ్గితి డింకవేసితిన్।
ద్విడిభమృగేంద్రమానమసితిన్ దెగటారితిఁజచ్చిపోయితిన్॥

మ॥ అలరుంగైదువుజోదనీవుపయనంబై సాగుచున్నప్డుమా।
కొలపుంబెద్దను మేనఁదాల్చిన శశింగోటీరమందుంచుకొ।
న్నలలాటాక్షు నెమర్పఁబోకుమనుచున్ వాకొంటకోనాగఁగుం।
డెలెమర్వచ్చుటచూచియప్డెయనుకొంటిం గెల్పులేదంచెదన్॥

సీ॥ నీవననెంతయుం నిటలాక్షునెదిరింపఁ జక్రహస్తుండైనఁ జాలఁడంటి।
నాతనియనుకంపకాశించి పారికాంక్షులు నిత్యమాతనిఁ గొల్తురంటి।
జడదారులకెకాదు శర్వుఁడధోక్షజబ్రహ్మాదులకునును పాస్యుఁడంటిఁ।
దనుశేందుమౌళితో దాడియాడుట పతంగంబు దావంబుపైఁగవియు [టంటి।
నానుడువు మిన్నుమిడియగానమ్మిశమన।
మథనుఁడగుశూలిపైఁబోకమానుమంటి।
నోటిప్రవ్వకొనర్చిన నీతిపోత।
యయ్యెనీపీనుమగకున్నాప్రార్థనంబు॥

క॥ చెవిఁగిల్లుగట్టుకొనిమె।
న్నివిధంబులఁబోరినన్ వినిమొడంబడవై।
తివినాము విన్నపమునకుఁ।
జివరకునింతదురవస్థచేకూఱెఁగదా॥

క॥ యమరార్ధనునుఁడు నిను[illegible]ృదు।
సుమములుపైవైచినట్టి సుమనోధన్మన్।
తమమాలి పిలుకుమాలిచె।
నమరన్ సుకృతీగతాయువనునుడి వృషమే॥

ఆ॥ మదనుఁజంపిశివుఁడు తదనువ్రతనునన్ను।
నీల్గఁజేయకుండు టేమిన్యాయ।
మత్తచేసినపనికారళ్ళు లేవను।
నానుడికీ దలంపునకుఁదగిల్చె॥

చ॥ జగములనెందునుకీ మగలుచచ్చిన స్త్రీలగ్రతజీవమైనయా।
మగనికళేబరంబువము భ్రమానువలెకీ బడిపెద్దపెట్టునకీ।
వెగచుచుఁగొంతసేపు పలవించెదరంతటియోగమేనినా।
కుఁగలుగదయ్యె నయ్యయొ యగోచరమయ్యెను నీదుబొందియుకీ॥

సీ॥ మేలిమిబంగారు మేలింటిలోనుండుదేహ మేమయ్యెనో మోహనాంగ।
శౌకపైకములకోజ్జతనంబువ్రాని నపలుకు లేమయ్యెనో భవ్యమూర్తి।
యఖిలలోకములననర్గళంబుగనొంచుకడిమియేమయ్యెనోకదమనోజ।
యెపుడును నెడబాయనీయని నామీఁదియరితి యేమయ్యెనో యసమ
మనకుసత్పరిసరంమ్మలై మంతుగనిన। [విశిఖ।
స్పర్శనకుమారుఁడునునలచైత్రుఁడునుఁడ।
మీశ్వరుండునుఁగాన్పించ రేమిప్రాణ।
నాథయెంతలోనెట్లయ్యె నాయవస్థ॥

చ॥ పొడమినవారిలోఁ బొడమఁబోయెడువారలలోనుగూడనా।
యొడయనికెవ్వరుకీ సదృశులుండరు చక్రదనంబునందటం।
చెడఁదఁదలంచుచుకీ సుభగనేనెకదాయని పొంగుచుంటినీ।
గడెవరకయ్యెనా హృదయగర్వము సర్వము భ్రుంగె నేటితోకీ॥

మ॥ దరహాసద్యుతికౌముదీకముఖచంద్రంబుకీ బృహద్వారసమ్మకీ।
స్ఫురదాజానువిలంబిబాహుయుగముకీ ఫుల్లాంబురుట్పత్రజి।
త్వరకర్ణాంతపరీతవల్గునయనద్వంద్వంబునా నీమనో।
హరరూపంబునుజూచుభాగ్యమిఁక లేదా నాకుఁ బ్రాణేశ్వరా॥

ఉ॥ ఈసహధర్మిణిన్ విడిచియేగితివొంటిగ ధర్మమేనినున్ ।
బాసిని మేష మేనియునుఁ బన్నగము న్నెపుడైననుంటినే ।
వాసరనాథతేజపిసునాస్యముపీసరవోవకుండనీ ।
వేసరణిన్ సురింగితివొయేర్పడఁదెల్పవె వెంటవచ్చెదన్ ॥

చ॥ అతులితరామణీయక సమన్వితమూ భవదీయమూర్తిదృ ।
ష్టితగులునే మొయన్న వెఱచే నొకనాఁడునుఁజూడలేకపో ।
యితిఁదమిదీరునట్లు హృదయేశ్వరలోచనతృప్తిగాఁద్వదా ।
కృతియొకసారిచూపి మఱియిప్పుడెపోదువుగాని రాగదే ॥

చ॥ నినునినునంతదీప్తిఘునునిన్ సుడిక్రైవ వుదాల్పుకూర్మినం ।
దనుదనుజాంతకోపమును దారతరసుఖన మర్త్యశత్రుభం ।
జనుజనురమ్యభూతుంజటికేఁజం పెఁగదా నిటలాక్షుఁడాతఁడో ।
పనిపని లేదటం విపుడు స్పష్టముగాఁదెలిసెన్ ద్రిలోకికిన్ ॥

ఆ॥ ఇదిసుకరమశక్యమిదియను భేదంబు ।
లేని సర్వశక్తి గాన శర్వుఁ ।
డమరుమరునిఁజం పెనట్టి దుర్లభమహో ।
భాగ్యభరమునాకుఁబట్టు టెట్లు ॥

ఉ॥ నెయ్యుర నెప్డుఁగోల్పడని నిత్యసువాసినులైన వేలుపుం ।
దొయ్యలులందునన్నొక తెనున్ మృతభర్తృక గానొనర్చినా ।
కయ్యయొయిట్టిబెట్టిదపుఁటార్తిగదించుట కెంతజాలిలే ।
దయ్యెనొయష్టమూర్తికి దయానిధియందురుగాదె యాతనిన్ ॥

ఉ॥ పరిచజనాంగనల్ మొదటిబాముఁనఁబు న్నెపునోము లేమిగా ।
పించినకారణంబున భువిన్ జనియించినవారొకోమగల్ ।
పంచతనొందినప్పటివిపత్తున భర్తలతోడఁదామునున్ ।
మించినకూర్మిమైననుగమించి సుఖింతురు శాశ్వతంబుగన్ ॥

చ॥ ప్రిమలనిపాపమేమియొనరించి దివంబునఁబుట్టినానొ యో ।
మృదుతరమూర్తి నిన్ననుగమించి సుఖించెదనన్న నాకుఁ జా ।
వుదొరకదేమి సేయుదు శివుండు నమద్భవతాతియమ్మహా ।
భ్యుదయము నాకొసంగవలెఁ బూర్తిగ నామెడ జాలిపుట్టినన్ ॥
ఆ॥ ఎప్పుడే ప్రయాతకెమరాదునోయని ।
కాలుకదపఁగొంకుగదుర వేల్పు ।
లేమఁగొకట తెకును లేని వైధవ్యావ ।
మానమెట్టులోర్తు నేనుముందు ॥
చ॥ కరమువినీతినిందనుకగారవమొనర్చెడువారెయయ్యునన్ ।
బరిణయమాదిగాఁగల శుభంబులలో నిటబట్టియక్షుకి ।
స్నతవిబుధాదియోషితలు నాయగపాటున కేవగించుచుం ।
దురుకదయెంత ఘోరమగుదుర్దశ దాపురమయ్యె నేటికిన్ ॥
మ॥ అనివాపోవుచునున్నయన్నవలయోత్పాలిందిస ర్వేశ్వరుం ।
డనుకంపారససిచ్యమానహృదయుండై యందువిచ్చేసి కాం ।
తునిమేబూడితప్రోవుమీఁదఁబడి యంమంబొన్లికల్ వెట్టున ।
త్తనుమధ్యన్ దిలకించియిట్లను సుధాధారాసమానోక్తులన్ ॥
గీ॥ నేత్ర మేకదయిదియు ననియు నెప్పిల్ల ।
త్వదుపసంవ్యానమస్రులఁదడిసిపోవ ।
నేడ్చుచున్నావు వీటిడీయిట్టులెనియు ।
గంబు లేడ్చిన నీభర్తక్రమ్మఱిలునె ॥
క॥ స్వార్థపరులైనత్రిదశుల ।
ప్రార్థనమునఁ జేసియంతరమెఱుఁగకనన్ ।
దుర్ధర్షుఁగలఁచియింతయు ।
నర్థముదెచ్చికొనె నీసుమాయుఘుఁడతివా ॥

చ॥ నెలతలమానికంబుగజనిందినదానవు నీవు నేనునుఁ ।
నెలతలమానికంబుగన నింద్యతనొప్పకు నీకునిత్తుఁ ।
గలిగినవంతనాయదియగా నెదలోనఁదలంచుచుంటినీ ।
యలజడిమాన్పు లెమ్ము పరిచాంబుజపత్రవిశాలలోచనా ॥

ఉ॥ స్త్రవ్యశరాసవిద్యుఁడగు త్వత్పతినాయెడనుద్యతప్రప ।
వ్యవ్యవసాయుఁడై చెడె నహంయుఁడు నీహృదయేశ్వరుండుఁతుం ।
తప్పుఁడుకాడుగానియయినన్ నినుఁగూర్చిక్షమింపనయోగ్యమై ।
ధవ్యమునిన్నుఁబొందమికి దర్పకుఁడిచ్చితినీకుఁగ్రమ్మఱన్ ॥

క॥ ముదితా తొంటి తెఱఁగుననె ।
బ్రదికి మరుఁడొనర్చుఁగాఁపురము నీతోడన్ ।
ద్విదితరులకుమాత్రమతం ।
డదృశ్యమూర్తియయి జగములందుఁజరించున్ ॥

చ॥ అడలకయింక నీమనిలయంబునకుం జనుమన్న గిత్తత ।
త్తడిదొరయానతిచ్చిన సుధామధురోక్తులకాత్మఁబొంగియ ।
ప్పడఁతుకతత్పదద్వయముపైఁబడి జోతలొనర్చెఁ బిమ్మటన్ ।
మృడుఁడపవారణంబునఁజనెన్ రతియున్ దనమన్కికిన్ జనెన్ ॥

వ॥ అనియిట్లుసూతుండు సెప్పిన ననంతరవృత్తాంత మేమని యా
మునులడుగుటయును ॥

మణిరంగవృత్తం॥ కేశవాద్యవగీర్ణచరిత్రా । పాశివందితపచ్ఛతపత్రా ।
జ్యాశతాంగయమహార్యశరాసా । కాశికాఖ్యనగర్యధివాసా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీమ
దివటూరి సోమనాథశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందుత్తరభాగమున
తృతీయాశ్వాసము

---

శ్రీరస్తు.

శ్రీ గణేశాయనమః

# తారకాపచయము.

## ఉత్తరభాగము.

### చతుర్థాశ్వాసము.

క॥ మృతిసముదాయాగతిభీతి ।
శ్రితమార్కండేయమునిపవిత్రాఙ్ఘ్రాం ।
ఘ్రితత్రైలోకప్రహరణభం ।
జితశమనశిరఃప్రదేశశ్రీవిశ్వేశా ॥

వ॥ అవధరింపుమమ్మహర్షులకురోమహర్షణియిట్లని చెప్పందొడంగె॥

పంచచామరము॥ వృషధ్వజుండు ఫాలనేత్రవీతిహోత్రకీలలన్ ।
ఝషధ్వజుందహించి భస్మసాత్కరించిపోవుడున్ ।
విషాదమందిగట్టుపట్టి వెచ్చనూర్చిచింతిలెన్ ।
విషాదపాణిపీడనేష్టినిష్ఠుచిత్తయాటచేన్ ॥

శా॥ నన్నున్ దమ్మునుఁగూర్పఁదారొనర్చిన కందర్పున్ హాతున్ జేసెనా ।
మిన్నుంగూఁకటివేలుపాతనికి నామీఁదన్ గృపాలేశమే ।
నున్నన్ మారుఁజికీర్షితోపకృతినయ్యుగ్రాక్షుఁడన్నేలచే ।
యున్నాబోఁటియభాగ్యకంఠటిమహాయోగంబు చేకూఱునే ॥

ఉ॥ ఎట్టిఁక నేను వెండి పరమేశ్వరునిన్ దరిసింపఁగందునా ।
కెట్టిఁకఁ దత్పదాంబుజము లెప్పటిగొల్చెద బాగెముబ్బునే ।
నెట్టులదత్పకాంతకునకింక ననుగ్రహపాత్రమౌదున ।
న్నెట్లుపరిగ్రహింపనతఁడీకొనునంతకునోచికొంటినే ॥

ఉ॥ ఎక్కడిమాట వెత్తితమి హెచ్చునవాసిగణింపఁగానినే ।
నెక్కడసర్వలోకవిసరైకశరణ్యుఁడు చంద్రశేఖరుం ।
డెక్కడనమ్మహాపురుషుఁడింపలరన్ జనుదెంచిననన్నుఁగా ।
ద్రొక్కుటసంభవంబునుదలోఁప నీయడియాసయేటికిన్ ॥

చ॥ హిమకరమౌళినన్ బరిణయించుట నోర్కమను నుంబునోముల ।
ల్పములోనరింది యొక్కవఫలంబులుగావలెనన్న పచ్చునే ।
యమృతమయూఖశేఖరుని యంజలివాంఛను రల్పకొండమ ।
న్న మరల దేమి సేయుదును నాహృదయార్తికిఁ బారమెద్దియో ॥

చ॥ గొనకొని శ్రోణుఁడెత్తరఁపుఁ గొండపయిన్ సహకారభూరుహం ।
బునవలరారు స్వాదుఫలముంగనికోయుటకెక్కఁబోవులా ।
గుననవివేకబుద్ధినయిగొంతెమ కోరెక్కలుకోరుచుంటిఁగా ।
కనగుదు రెవ్వరేన్విదినఁ గామహరుండు ననున్ వరించునే ।

చ॥ ననునునుకఁ బవ్వానితన నాతిగనాతిగ కింటియేలిసన్ ।
దనుకున మేయమైన ప్రసాదంబనడంబ మనంబునందునా ।
జనకుఁడు మిన్నుముట్టు నెల సంబునసంబున భూతపూర్వమై ।
యనయముగారవించు రహినన్నయునన్నయు తప్రియోక్తులన్ ॥

సీ॥ తనకుండఁజోటెందునొనగూడనట్లు సర్వేశ్వరుఁడిచ్చోటికేలవచ్చె ।
వచ్చెఁబోయాతని వరివస్యకై నన్ను గేంద్రుఁడాతని పజ్జకేలపనిచె ।
పనిచెఁబోయకలంకమైనట్టిమామకహృదయమాతనియందు నేలతగిలె ।
దగిలెఁబో సర్వజ్ఞుఁడగునాశ్రితార్తిభంజనుఁడేలనన్ను గైకొనకపోయె ।

నన్నతఁడు పెండ్లియాడకయున్నట్టై ।
పోయెనతని పదాంబుజంబులకుఱఁగట ।
నుండుటయుఁగూడలేనిప్రత్యూహమొదవ ।
ద్రాబతలిరువిలుతుఁడేలదాపరించె ॥

చ॥ అరయఁగనెల్లలోకములయందలి యౌవనవంతులైనస్త్రీ ।
పురుషులసంఘటించుట యెపూనికకర్జముఁగామెలంగుశం ।
బరదితిజాహితుండెయెడబాటునకున్ గతమయ్యెనీలకం ।
ధరునకునాకునున్ బళిరనాబ్రతుకెంత జగద్విరుద్ధమో ॥

ఆ॥ త్రిణయనుఁడువరించితీరనైనవలయు ।
నేనుమేనువిడువనైనవలయు ।
నీశ్వరునకుఁగానియీదేహమేలసోం ।
దర్యమేలజవ్వనంబిదేల ॥

ఆ॥ మట్టుమీఱివట్టి యిట్టలంపువిరాళి ।
పుట్టినట్టు కొట్టకొట్టువెట్టి ।
గట్టునట్టు దిట్టఁజెట్టవట్టుటకట్టు ।
గట్టిపట్టుపట్టిగట్టుపట్టి ॥

క॥ తపమొనరింపఁదొడఁగెనా ।
తపమునకిగమునకవర్షధారలనకయా ।
తపనీయగా త్రిసముపా ।
త్తపనాయితని యమయగుచు ద్రష్టలుపొగడన్ ॥

చ॥ పనివడియిట్లుదారుణతపంబునకున్ దొరకొన్నగారవుం ।
దనయతెఱంగుమాతరపితల్ వినిబెగ్గిలితత్పురీ జనం ।
బునుదమ వెంటరానటకుఁ బోయియటన్ దటి వేచియుండినం ।
దనను తదాసమాధ్యుపరతన్ గనియిట్లనిరామెతోడుతన్ ।

శా॥ బిడ్డా యెంతకుసాహసించి తెనిమన్ బ్రేమించుచున్ మంచియో।
చెడ్డో నీతలిదండ్రులుంటిమికదా సేబాసుమాతల్లినీ।
యెడ్డీ మాకెఱింగింపనక్క అయెలేదే యించుకంతైననా।
కడ్డంబెవ్వరటంచు నింతకుఁదెగన్ న్యాయంబె నీబోఁటికిన్॥

క॥ ఓతనయారత్నమనీ।
చేతస్సనమున్నకోర్కి చెప్పిముదలమా।
చేతంబడయకయిటువలె।
స్వాతంత్ర్యమువూననీకు సముచితమగునే॥

క॥ స్వైరితనీకుఁదగునెవి।
ద్వారహితవుకావుగద పితారక్షితికా।
మారేయనునీతివ్యా।
హారమునీవెఱుఁగనిదియటమ్మా వినుషీ॥

ఉ॥ బాళురెమెల్లగాఁజిఱుతబానిసపుంబువుఁబోంష్టువీచువీ।
చోపులగాలికులిక్కపడుచుండెదుదొంబులిగొట్టువియ్యెడన్।
వేపథువొందకీయెడరువీచుచునుండినయోరుగాలికె।
ట్లోపుమవమ్మనీవుపికచోత్పలనిర్వపదాయతేక్షణా॥

చ॥ ఎడఁగడఁగష్టమాట రయవిందు ద్రుషన్మయమైనమేడలో।
నుడుగకయుస్సురస్సురనుచుండెడుదానవునీ వనారతం।
బడవులనుండు నాటవికులైనను నోరుజఁజాలనట్టియో।
మిడిమిడియెండలో నొకనిమేషమునిల్చెదవెట్లువీటిడీ॥

ఆ॥ అంచమాదితలివమంచుఁబన్నుండికన్।
వొందకయిటునటునుఁబొరలుదాన।
వెట్లువెన్నువాల్తువేవెట్టితల్లిరో।
నీవుకటికిటాలినేలమీద॥

సీ॥ కరటిశతరములౌ గండశైలములు నిద్దంపుఁగుర్చీలచే తల్లినీకుఁ।
క్రోష్టుకాకోలాది రుతముల్ తతానద్ధసుషిరశబ్దములచే చూలినీకుఁ।
గాయలాకలములుగడ్డలున్ స్వాదుభోజనపదార్థములచే తనయనీకు।
వ్యాఘ్రతరక్ష్వాది వనసత్వయూథంబు పృథుపరిచ్ఛదముచే బిడ్డనీకు।
భూరితరసంపదలుగల పుట్టుబోగి।
వయ్యును నకించనవువోలె నడవి నెగ్గ।
తమ్మునఁదపంబునకుఁజొచ్చి మమ్మునిట్లు।
తగనియలమటపాల్సేయఁదగునె తల్లి॥

సీ॥ బహుమూల్యమణిమయాభరణముల్ మాని రుద్రాక్షదామంబులు [దాల్చినావు।
గమగమగమవల్చుకలపముల్ మాని మేఁశముగా వెలిబూదియలఁది [నావు।
తగటుహారవలుఉత్సర్జించి తోలునుగ్గడితముల్ బిగియించికట్టినావు।
నులివెచ్చపూనీటజలకమాడుటమాని వెంచలోబుడుకలు వెట్టినావు।
ఈకోమరుఁబాయమేమిసంసృతిసుఖములఁ।
గరముదనివొంది కాటికిఁగాళ్లుసాపు।
కొన్నదశమిస్థగృహులుగైకొనవలసిన।
ప్రచురవైరాగ్యదశయేమి పట్టినీకు॥

చ॥ జలజదళాక్షియొడ్డయిన జగ్ధికి నించుక వేళదప్పినన్।
గిలగిలలాడియోమునటికిఁగిన్వడు నెత్తున నేడు మల్లైమొ।
గ్గలకెనవచ్చుమర్బలవు కష్టతపంబునకుద్యమించితీ।
నెలలకొలంది నుంకులకునీవెటులోరుతువమ్మ యీపయిన్॥

సీ॥ ఉదరిమాడువుమీఁదనుండునివడవిలోనుండుటఁజూచి యెట్లోర్తుకున్న।
మృష్టాన్నము మెసంగునీవాకలముదినుచుండుటజూచియెట్లోర్తుకున్న।

మృదుతల్పమందుశయించునీవిలఁబండుచుండుటజూచియెట్లోర్తుమన్న।
యెండకన్నెఱుఁగని యీవిట్లు గఁదపించుచుండుటజూచి యెట్లోర్తు
చెలిమరులలోన నెపుడును మెలఁగుదాన। [మన్న।
వొంటిమయినుంటజూచి యెట్లోర్తుమన్న।
దుఃఖవార్థిలో మమ్ముఁగూలఁద్రోయకీత।
పమ్ముచాలించి లేచిరావమ్మతల్లి॥

తోటకవృత్తం॥ అనిబో మొనరించు నవార్యకులే।
శునిమేనకనుంగని జోలిలోన।
ర్చినిలంబడియ వ్విమపీజనమం।
డనమిట్లనివల్కె నడంకువతోన్॥

సీ॥ ధాతృప్రభృతులకుఁదలమానికంబు లేమహనీయచరితునిమలకడములు
సేవకప్రతతికిఁజేపట్టుకుంచమే కల్యాణగుణుని క్రేగంటిచూపు।
శరణాగతులసాధ్వసములకు వేరు విత్తేతపస్స్వాధ్యాని చేతిచాపు।
సకలనిరాధారజగతీస్థితికిఁ బోటుగంబమే యనుభావఖనినిదేశ।
మట్టిసర్వాధికుండగుహరుని వరునిఁ।
గాఁగబడయందలంచి యీకరణిదీవ్ర।
తపమువకునేను దియగొన్నదానవాన।
దలఁగివినుతున్ వినుడు తల్లిదండ్రులార॥

శా॥ ఉల్లంబిట్లుడికిల్లనేమిటికి మీకోగారవుందండ్రియో।
తల్లీమీరెకదా ననుంగడుఁబ్రమోదంబొప్ప నాహత్తితోల్।
సెల్లాయొల్లియవేల్పుసేవసలుపన్ సెల్విచ్చియంపించినా।
రుల్లంఘించినదేదిమీముదలనే నూహింపుడీ చక్కగన్॥

చ॥ అలరులవింటివానినయనాగ్నికి నాహుతిగానొనర్చియా।
వలమెడవేల్పుచాటువడినన్ సకలాత్మునినామహేశ్వరున్।

గొలుచుటమానిరేమెగమదిగొల్వక యీపగిదిన్ దపస్యకున్ ।
దలకొనియుంటిఁగాని జవదాఁటుమనే యెప్పుడైనమీనుడిన్ ॥

సీ॥ అడవియేసొగసైన హొయివటారమటా నొగికియుక్కు[?]వసామిఁ గొలుచు [నాకు ।
గాయలాకులెరుచికలవంటకంబులౌ వినవుమేఁతరిని సేవించునాకుఁ ।
గటికినేలయె యొడికపుఁ బట్టుతలిమమటా మలనెప్పుదొరదింతసలుపు [నాకు ।
మండుపేరెండయే నిండురేయెండయా సెకకన్ పబువును పాసించు
శివునిసర్వాత్ముఁ నాత్మభజించునాకు । [నాకు ।
నిచటియగములు ఖగములు మృగములునునె ।
తగినపరిబర్హమౌఁ దలిదండ్రులార ।
నాకొరకుఁబొందకుఁడుమీరు చూడు రెదల ॥

సీ॥ అఖిలయాదోభవాబ్ధికిఁదగు పీలికాఁడున్న నావశంకరుని సేవ ।
దుర్గతియాతనాతుహినసంహతికిఁదిగ్మంబౌతపము శివమంత్రజపము ।
కాలునియాటసాగకయుండఁ జేయుపెన్నికురింత యీశ్వరాంఘ్రియుగ [చింత ।
తతవాద్యనిశదముక్తితలోదరీస్వయంవరణము శంభునామస్మరణము ।
శ్రితులయిన సనుపులవాలిబృహతికాంచ ।
లగ్రథితహాటకంబై చెలంగెడుస్మర ।
హరుఁగుటిదిచేయునాసముద్యతికినడ్డు ।
వాట్లువెట్టకుడయ్యయో పంన్యలార ॥

క॥ ఉప్పరముచొల్లైముగఁగల ।
యప్పరమునివాత్రయించినట్టికృతులకున్ ।

నెప్పరముతోలఁగుదప్పక ।
డెప్పరములుతప్ప కావటిల్లు భవుకముల్ ॥

చ॥ ఎకసకియమ్ము గ్గాదు మిత్తియెండలు వర్షములోరుగాలికా ।
ర్మికములు నెవ్వియుం బగలు రేలునోకింతయుఁగావునాకుబా ।
ధకములు నానిమిత్తమెదఁదల్లడమందకుడయ్య మీరుమి ।
న్నికదొరయంజడోయిదరిఁజేరినవారికిను న్నెయంజికల్ ॥

క॥ కానన్ నాయూనువకి ।
చ్చోనోడువకుడడ్డముల్ ప్రసూజనయితలా ।
రానతులోనరించెదనా ।
యూనమదేమియానుఁబలు కరుగుడనవుడున్ ॥

గీ॥ మాటుమాటాడనోడి కొమార్తమదిమ ।
రల్పుట దరంబుగాక నైరాశ్యమంది ।
మేనకాహిమవంతులామెకడజోటి ।
కత్తియలఁ గొంతనుందినుకరుణము వెట్టి ॥

సీ॥ విడినవేనలిచకరుముడుచుకోలేనినాపోరియుండునునుడీపులుఁగులార
తలవాకిలెన్నండుదాఁటియెఱుఁగని మాముగుదయుండునునుడీ మృగ [ములార ।
లేఁతవ్రమాఁకులననల్చిదుముటకలయునాగోలయుండునునుడీ కుటము [లార ।
మ్రావలమెడపిక్రమ్మఅఁగట్టలేని మాబొట్టెయుండునునుడీచట్టులార ।
మీకునీమెనిల్లడవెట్టి మేమువోవు ।
చున్నవారము దీనిమీకన్నయనుఁగు ।
కొమరితనువోలె లలినామకొనుడుసుండు ।
వనములార బహుప్రాణ్యావనములార ॥

లలితపదవృత్తం॥ అనిపలు వేఁడుటఁ బప్పనముల్ తా ।
మొదలిచి మేనకయున్ హిమవంతుం ।
దుముఁగను నీరుస దుంగులు వాఱన్ ।
బనవుచు నేగిరి పారుఁ గదామున్ ॥

మ॥ అయయున్ దల్లియుఁ జన్న వెనఁ దనలయార్యాదేవి బాహ్యాంతరిం ।
ద్రియసంచారములాక వెట్టి పోరిదిన్ శ్రీకంఠుఁ డందాశ్రితా ।
భయవిశ్రాణనునందుఁ జిత్తములయుంపం జేసి వాచంయమా ।
గ్రియులున్ దీలుపడన్ మహాతపమొనర్చెన్ వర్జితాహారయై ॥

వ॥ ఆసమయంబున ॥

సీ॥ వృజినంబులని విసర్జించెనో యన వెంట్రుకలు లేనితల గడగడవడంక ।
నొచ్చిఖ్ఖురలుబొక్కి నోటిలో నేమేని బలికినప్పెల్లఁ దుంపరలు రాల ।
వేపథుప్రభవదోర్వ్యగ్రరింఖణమున నడ తేప తేపకుఁ దడబడంగ ।
పెరిఁగిన జవరంపునరపత్రుప్పాడుపంట ప్రైర్వలె గాలికిఁ బాత్రలాడ ।
నుడువులే మేమొ లోన నెగొడగికొనుచు ।
భ్రూయుగము మీఁదఁ గేలిడి ముందు దెసకుఁ ।
గనుఁగొనుచు చరగడపు జన్నిగట్టు వేస ।
మూనిచని శూలి పార్వతియొద్ద నిలిచె ॥

సీ॥ ఆపార్తియపుడె లోఁ జూపు చాలించినదాటచేఁ బ్రణమిల్లెనతనికతఁడు ।
శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తను చు దీవించి యట్లనుటకు వెల్లబాటు ।
గదిరినట్లు నటించి కాంతరోమున్ఱిమిచే మతిలేని వాడనొకతనఁ జేసి ।
యూఢవో లేక యనూఢవో యరయకే చేసితినిట్టి యాశీర్వచనము ।
ఉవిద యింతకు మున్నె నీవొకరుద్రుఁడు ।
కేలుపట్టికొనిన మగనాలవేని ।
చిత్తవైకల్యమున వివేదింపకనిన ।
నానుడికిఁ దప్పువట్టుకొనకుముసుమ్ము ॥

శా॥ ఆవ్వా యెవ్వరిబిడ్డవీవు భవదీయంబాహ్వయంబేమియీ।
పువ్వున్ మించిన దేహమార్దవము సంబోల్పారు నీవ్వార్ధకున్।
దవ్వానిం మదపించుచున్ నవతజేందంగారణంబేమివా।
క్రొవ్వంగూడునయేని నిక్కవము నాకుం దెల్పుమీ యంతయున్॥

ఉ॥ నావిని యాతుషారగిరినందన వందనమాచరించియో।
పావన సాధువృత్త ననుఁబార్వతియందురు లోకులెల్లనే।
నావసుధాధరాధిపతియా హిమవంతునకున్ గొమారితన్।
భావజహంతఁగూర్చి తపంబొనరించుచునుంటి నిట్లుగన్॥

గీ॥ మేదినీసురసత్తమ మిమ్ముఁవంటి।
బోధఘనులాడునుడు లేల పొల్లవోవు।
నేననాథనుకాపులే నిక్కవంబు।
కాను పరిణీత నెవ్వఁడలంకకుడనవుడు॥

శా॥ పోనీ లేచిన వేళమంచిదియె నాపున్నెంబు బాగున్నదో।
చానాయిట్లు తపంబువూనుటకు బీజంబీవె వాక్రువ్వవే।
దోనాయైద్యమునన్ వినంబడనె లేదో కాని జ్ఞాతంబుగా।
దో నారీజనమౌళిభూషణమస్పష్టోక్తంబుగాఁ దెల్పుమీ॥

గీ॥ అనుచు ముందుకు రెండుమూడడుగులుంచి।
యాబవంతపుముసలి యగజఁదటిసి।
యోరమొగమిడి చెవియొగ్గియుండఁ జెప్ప।
సిగ్గువడి యాళివంక వీక్షించెనాపె॥

క॥ అగ్గిరిసుతఛందమెఱిఁగి।
డగ్గరగానరిగి యాబిడచెలియొకతెయా।
వగ్గుముసకబాపనునకు।
ఓగ్గరగా నిట్లని తెలిపెఁ దదాత్వమునన్॥

ద్రుతవిలంబితవృత్తం॥ అవనిదేవకులాగ్రణి యాతఁడే ।
ధవుఁడుగావలెఁదప్పకటంచునా ।
శివునిఁగూర్చియె చేయుచునున్నదీ ।
పవిదినీమెతపంబొకప్రాణితోన్ ॥

సీ॥ అనవినితలయూఁచియాపొలంతినిగోరచూపునఁజూచి యాబాపనుండు।
పందితిక్లైడునావుపడ్డమబ్బియునోలె నెంతచక్కగనున్న దేశ్వదాస్య ।
మెల్లిదమైతి నేమేనునాబోఁటిజ్యాయస్తగుతో నీకుఁద్రస్తరులకై।
యని వైశికపుటలక్కనభినయింపుచునక్కవాడపుఁబాలుండు వలుకు
నగజ కేల్మోడ్చి దేవయీ యనుయనృతము । [టయును॥
వలుకలేమ యథార్థమె వలికినదిక్షు ।
మింపుడన నక్కపటదశమీస్థధరణి।
సురుఁడు పకపకనగిగట్టుచూలికనిమె ॥

ఉ॥ ఆహావు సేమియయ్యోడలవంతటఁ దాల్చినగాలిదిండిజా ।
వాహిరియేమియామరికివాసనతోల్వలు వేమిమున్నమో ।
త్సాహముబైన యాపెనుపిసాసి బలంగము లేమియయ్యెన ।
డ్వాహపుటెక్కుడేమి యెటువంటి పతిఁ వరియించితే చెలీ ॥

శా॥ అయ్యోయెంతటివెఱ్ఱిదానవబలాయాపాఁబలే బాపురే ।
యియ్యాలోచన లోనసొంతముగనీకేతోఁచెనా కానిచో ।
నెయ్యుర్వోలెనటించువైరులెవరేనిన్ నీవుపెన్వంతలన్ ।
బ్రుయ్యంజూడగఁగోరియువ్విధమునంబోధించి ప్రేరేచిరా ॥

చ॥ ఇచటికిమొన్నవచ్చినపుడిందుకళామకుటుండుగొన్నబ్రా ।
కచెలువుచూచినిక్కవముగానెనిసర్గమనోజ్ఞుఁడంచు నెం ।
చిచిగురుబోడిరోమరులుజెందియంమరెదేమొతద్వ్రపా ।
రుచింత యాదృశంబొ కలకూపెటిగించెదనాలకింపుమీ ॥

సీ॥ ఈక్షించుటకె చాల యేవంబుపలకొలుపుంగదే యాతనిబొల్లిమేను ।
విసముమెక్కినగొంతు వెక్కురు చాయయా మెయివన్నెకిబ్బడి మెఱుఁ [గుదెచ్చె ।
నెండుగాదఁపు వెరిట్లకెనవచ్చు జుంజురుగు పసుచుట్టలపల్లజడలు నెఱక ।
లెవరికేజగతిలేనివివిరూపంబులైనిగిడారుకనులుమూడెగుడుదిగుడు ।

చాలుచాలుమంచిచక్కనిపతినేరి ।
కొంటివిందుముఖిరో కోరఁబోయి ।
కోరఁబోయి తెవులుగొంటిదేవరఁగోరె ।
ననెడుమాటకిదియెయర్థమేమొ ॥

మ॥ కలికీలోకమునన్ సురూపులుపరిష్కారంబులున్ మందివ ।
ల్వలునున్ దాలిచిక ప్పిపుత్తురు వపుర్వైరూప్యమున్ మాయురే ।
యలముక్కంటినిజాంగమంజిశుకుఁ దోడాకస్మికాలోకనుల్ ।
తలఁకన్ దాలుచుఁదోళ్లునెమ్ములును నాతండెంత మూఢాత్ముఁడో ॥

క॥ వటఫలరదనభవకం ।
కటికాలాకపోటుముట్టుగాఁదాల్చినధూ ।
ర్జటికడిమియుఁగలితనమును ।
దిటవునునిట్టి వని వేఱె తెలుపవలయునే ॥

మ॥ పడఁతీనీయుపయానకాలమున నప్పంచాహముల్ నీవును ।
గ్రుడుసుంగూడి జరద్గవంబుపయి నారోహించి యూరేగున ।
ప్పుడు పౌరుల్ మిముఁజూచినవ్వుమరు కడ్పుల్ తీపులెత్తన్ బడం ।
పడి యారీథకుసైపకెంత యనుతాపంబందెదో నీవెదన్ ॥

ఉ॥ ఇస్సిరో నీకుఁబెట్టునగలెవ్వియొ సందియమేల తాఁకినన్ ।
బుస్సనలేచుత్రాఁచులువి భూషణముల్ కదయాకపర్దికిన్ ।
లెస్సగనొంటినిండఁదగిలించును వానినబీతుఁడిందిచే ।
తస్సాకతాయిచేసికొని తాల్పనలెన్ జుమి మొండిధైర్యమున్ ॥

సీ॥ మానోజ్ఞకమునకు మరులుకొంటివొయన్ననొడలెల్ల శ్వేతమాదొడవ [కెపుడు।
నైశ్వర్యవంతుఁడౌటా సగొల్వెనొయన్నఁ దెరల తింటకులేక తిరిప మెత్తుఁ।
గడిమి పెక్కువకు మేల్పడితివో యనినవ్వృకున కోడిపఱచినకోఁచ [యతఁడు।
విద్దెకాఁడౌటనువిల్లూరెదవొ యన్నఁ బితలుశిక్షించినబిడ్డగాడు।
అధికసౌందర్యవతికినీ కరసిచూడ।
నొకసుగుణమేనియును లేని యొఱటుమీఁద।
దెగడికకుమాఱుతమియెకలుగుటనీదు।
నుమటివ్రాతఫలమొయేమొ సదమలాంగి॥
సీ॥ చెలువంబునకు నపేక్షించెదవేని నాసత్యాదులైన నిర్జరులుకలరు।
శౌర్యమాశింతేని సకలవేథోండరత్నుణదత్తుశక్తి కేశవుఁడు కలఁడు।
చదువుకోరెదవేని సకలజగత్సర్గకృతముఖుండగు శతధృతికలండు।
కలిమి వాంఛింతేని కల్పాగసురభిచింతామణుల్ గల మహత్వంతుఁడు [గల।
డిట్టిగొనములకువ్వాలనేకులుండ।
నీదృశులనెల్ల నొల్లక యెబ్బెరాసి।
పిఱికి పేదమెమకఁగోరి పెండ్లియాడి।
యేమిసౌఖ్యమనుభవించెదే మృగాక్షి॥
క॥ మసనము కాఁపురముండుని।
వసనముకడవసముని దువపువునకులస।
ద్వసనమునగునీయప్పటి।
వెసనము భవదనుభవైకవేద్యముసుమ్మీ॥
చ॥ వలదొకమాటచెప్పెదను వారకయీకొని సౌఖ్యమందుమో।
నెలఁత కపాలభృత్పరిణి నీషత్యజింపుము శ్రీయుఁజెల్వునున్।

దెలివియు శౌర్యమున్ గలపతిన్ సమకూరుతు మెప్పుకీరుతుల్ ।
వెలయగ వానితో ననుభవింపుమ శేషసుఖోపభోగముల్ ॥

గీ॥ బద్ధుగా మనుమీ నాదుపలుకు స్వామి ।
సాక్షియనుటయునా కాదుజన్నిగట్టు ।
నార్యహారిచూపునన్ జూచియనియె ముక్క ।
చెరమలుకపోలములు నల్క చేతనదర ॥

శా॥ ఏమేమీ వెఱగయ్యోఢున్ వయసునన్ వృద్ధుండవై యుంటనీ ।
వేమోయొక్క పవిత్రవర్తనుఁడవంచే నెంచితిన్ ధాత్రపా ।
లోమీనాథజనార్దనామలగు వేల్పుల్ నీవలెఁ ధీనిధుల్ ।
గామింజేసినుమీ సదాకొలుతురకందర్పదర్పాపహుర్ ॥

గీ॥ వీటఁడీ పెద్దనిమరకు వేశ్యయగుట ।
నొదవుచుండినకునికిపాట్లోయనంగ ।
దలవడం కెడు వార్ధకదశకతమున ।
బైజనినుఁ బాయదయ్యో నిప్పటికయినను ॥

క॥ నీతరమా నాతరమా ।
ధాతరమాపతియునుర్ మొదలుగా దివిజ ।
వ్రాతములు దెలియనేరని ।
భూతేశున్నిదివ్యమహిమము నెఱుంగుటకుర్ ॥

చ॥ శివుఁడవలక్షణుండనివచింపఁ దెగించితి నీకువచ్చినేం ।
ప్లైవనికివచ్చె నిస్సిరొమహీసురవంశమహాకళంకనీ ।
ద్భువదనముంగనుంగొనిన దోసములన్నియుఁ జుట్టుముట్టునిం ।
కనైదలిపోకె వేనియునుఁగాఱులు ప్రేలిన నీడిపించెదర్ ॥ [మీఁద ।

సీ॥ శ్రీకంఠుఁడింద విచ్చేసియున్నప్పుడే యసమాస్త్రుఁడరుదెంచి యతని
గవియుచు శివుఁడు ముక్కన్నువిచ్చె నథోక్షజాదులు తెఱగంటులది
[యొఱింగి ।

న్యా గ్రహించక ప్రోవుమయ్యమహాప్రభోయని చాల వేడుకొనినను [వినక।
మఱియుంచె మరుని నామాధవాదులు చేయునది లేక విమనులై యరిగి
శివుఁడు సర్వాధికుండని చెప్పుటకును। [రపుడు।
తేమిగావలయుఁ బ్రమాణ మేను కన్న।
లారఁజూడిన యీవిషయంబుకంటె।
నోవసరుపోతపుడమి జేజే వెడంగ॥ [తయనియుఁ।
సీ॥ వృకదైత్యుఁ డెగువంగ వెఱఁబాఱెననియును వృషభమాతని కెక్కి-రిం
బునుకలుఁదోళ్ళు నెప్పుడుఁదాల్చునియును విగ్రహంబంతయు శ్వేత [మనియు।
రవణముల్ పెనుబోరబ్రాఁకుడులనియు నానాసదేశము పితృవనమ [నియునుఁ।
గేలఖట్వాంగంబుదాలిచెననియునుఁగవణంబునకుజో లెఁగట్టెననియు
యతిపరార్ధ్యమనోపచాయితపదాబ్జుఁ।
గేవలుఁద్రినేత్రుఁజాలసెగ్గించినావు।
కారణంబులువానికిఁ గలవువానిఁ।
దెలియువినిపింతు వినుమని పలుకుటయును॥
మ॥ చమవుల్ నేర్చితి వేమొ హేతువులుపేక్షుంగొన్ని కల్పించిచె।
ప్పెదు కాఁబోలును విన్నయట్లె కడుసంప్రీతుండనైనాఁడనా।
మదనారాతి త్రిశుద్ధిగా సుగుణసంపన్నుండు కాఁడేలచె।
ప్పెదవా వెంబరవిత్తునే నెఱుఁగనే పృథ్వీధరేంద్రాత్మజా॥
చ॥ సమజగతీమృగీదృగతిశాయి మనోజ్ఞతనైననీకువో।
కొమిరెరో యేపపుందొడవఁగ్రొన్నెలతాల్పును జెట్టపట్టుటో।
చ్చెమనుచు నీదుబాగునకె చెప్పిననాసుడికల్గినేవుపు।
న్యామునకుఁబోవఁబాపమెతుతైనటియన్న తెఱంగిదేసుమీ॥

చ॥ తివిరివచించెదన్ వినుము శ్రీవ్రతరజ్వరితాపయావిక్షిన్ ।
జవిగొనఁబంచదారయు రసజ్ఞునకుఁ జేఁదయితోఁచుఁ గ్రైవడిన్ ।
జెవులకు మద్ధతోక్తులు రుచించునె నీకు నదృష్టహీనకున్ ।
బవిసి ప్రసవ్యమైనపుడు పంకరుహాయతపత్రలోచనా ॥

గీ॥ పుట్టినింటననుభవించు ముద్దులెల్లఁ ।
బోయియెద్దురావుతునొద్ద ముద్దులనుభ ।
వించునపుడు నానుడులు తలంచుకొందు ।
కానిలే పోయివచ్చెదఁగంబుకంఠి ॥

మంజుభాషిణీవృత్తం॥ అనియిట్లువల్కి కుహనావనీసుధా ।
శనుఁడాతుషారగిరిసార్వభౌమునం ।
దనన్డపై వీడ్కొని శనైర్గమంబునన్ ।
జనె నామెమానసము స్వాస్థ్యమందగన్ ॥

సీ॥ ముంగాళ్ళు రెంటను మోవజీరులువాలుకొమరు నీరాకవిపీణములతోడఁ ।
దేజునమడికాసుతీవలఁబుగుణించుతిఃపోచయొంటిజందియముతోడఁ ।
పౌర్ణమాసీందుబింబముదిసంతులుకొట్టుమోహానంబగునవ్వు మోముతోడ ।
నంసదేశంబు పర్యంతంబు వ్రేలుచు నిగనిగలాడునూనె ముడితోడ ।
నభినవతారుణ్య శుభసూచకంబులౌ చక్కని నూగుమీసములతోడ ।
నాలుడికత్తెల నవకీర్ణునులఁజేయఁజాలిన యరిదివర్చస్సుతోడఁ ।
జిత్రతరజగన్నాటకసూత్రధారుఁ ।
డాత్తుపాకరకోటీరుఁడంతలోన ।
మిగులఁబ్రన్నని ప్రాయపుమెణకరియయి ।
వెండియుంగొండరాచూలిసండకరిగె ॥

ఉ॥ ఇంచుకదవ్వునన్ మహీధరేంద్రసుతాసఖులానటూత్తమున్ ।
గాంచి వెలంగుపాటూదవగా నుమఁగన్గొని వేఁడికంటిచే ।

బాచశరుండు సచ్ఛనిపలిక్రతి వెవ్వనిఁజూచియాతఁడం।
చెంచితో యామరుండిచటికేలొకొవచ్చెడుఁ జూడుమీయనన్ ॥

క॥ సకియలనుడువులువినిచూ।
డికి యాపురుషుదెసకు నివుడిచి యాతఁడెవం।
డొకో యశ్రుతచరమానో।
జ్ఞకుఁడనిటిచ్చపడిచూచి సకులకుననియెన్ ॥ [నకుఁ।

సీ॥ ఖద్యోతమునకు భాస్కరమండలమునకుఁ బల్వలంబున కకూపారము
గంటినలుసునకు గ్రావోత్తమమునకు గుసగుసకళని నిర్ఘోషమునకు।
గాజుజాతికినొడికపుమూలజాతికినున్నాహమునకుఁబీయూషమునకు
జిరకుటీరమునకుదొరవటారమునకునలుకుపాంతకుఁబట్టువలిపమునకు।
నెంతవాసికలదొ యంతకంటెనుఁగూడఁ।
దారతమ్యమధికతరముకలదు।
సుందు తలిరువింటిజోదునకీవచ్చు।
పురుషునకును మేనిపొలుపునందు ॥

గీ॥ అనినుడువుచున్నయంతలో నాచ్ఛలద్వి।
జుండు నేదిష్ఠుఁడగుటయుఁ జూడ్కిమలపి।
మిన్నకున్న నతండన్నుమిన్నఁదలఁచి।
నిలిచె వనమంతయును వింతచెలువుదనుక।

క॥ ఇద్దఱును సమవయోయువ।
లిద్దఱునతులసుషమామహితవిగ్రహాలీ।
యిద్దఱు మిథోనురూపుల।
యొద్దికచూపఱకు లోచనోత్సవముగదా ॥

చ॥ విమషిమె యయ్యానిమ్యోడల వేఱెఁడిమై మనయార్యవేత్త్రిషః
ట్టుదలయొకండువ్వాని శివుఁడోశివుఁడోయనుచుండెఁగానిచ।
కర్దనపుఁగుప్ప నీవటుశిఖామణిఁబెండిలియాడి వీనితో।
వివితతరంబుగా ననుభవింపగరాదె సమస్తసౌఖ్యముల్ ॥

క॥ ఇతనికినిదంపూర్వా।
ద్భుతసౌందర్యునకు నెనసభూతోనభవి।
ష్యతియనుచు మెచ్చుకొనుపా।
ర్వతిచెలులకు నాబిగాదివడుగభిముఖుఁడై॥

క॥ రొమ్మంతయుఁ జనుఁగవయుమొ।
గమ్మంతయుఁగనుఁగవయునుఁగా నలరెడునీ।
కొమ్మయెవతె పితలెవ్వా।
రిమ్మాడికి నిచటనుండు టేమి యనవుడున్॥

చ॥ వటుజనమండనంబ హిమవంతునకీయమ కూర్మిపట్టియీ।
తటిదుపమేయగాత్రి యభిధానము పార్వతియౌకసంపుఁగూఁ।
కటియెకిమీనివల్లభునిఁగాఁబడయన్ గడుపూని త్రిమైతపం।
బిటులొనరించుచున్నయది యీయమయంచెటిఁగించిరాచెలుల్॥

క॥ ఆమాటకుఁ గిడకికనగి।
బూమెవడుగు గిరిజదికు మొగమైయపుడా।
హైమవతిఁజూచియిట్లనెఁ।
బ్రామిడితనమామెఱుదికిఁ బాదుకొనంగన్॥

శా॥ ఓనానిప్పుడుజ్ఞప్తివచ్చినది నీవోరాద్రిరాట్పుత్రియీ।
శానుంగూర్చి తపించుచున్నయది తజ్జాయాత్వముంగోరియం।
చేనాలించితి నాల్గుప్రొద్దులకుమున్నెవ్వారొ వాక్రువ్వనీ।
వేన్గాయాహిమవత్తనూభవవు రాకేందూపమానాననా॥

క॥ ఆయెగుడుదిగుడుకన్నులో।
యాయేవఁపుబొల్లిమేనొ యాచిఁపిరిజు।
ట్టోయింతవలపునకుఁగత।
మేయనియో తెలియఁజెప్పుమీ హైమవతీ॥

చ॥ చిలువలనెల్ల మేనఁగయిసేయుట గన్గొనివల్చినావొ యా।
స్థలసరులెచ్చుగాఁగలుగు తుండెమునందముజూచికోరితో।
కళవసముల్ ధరించితిరుగన్ దిలకించివిరాళిఁజెందితో।
మెలఁతరో యేమిమేలునకు మెచ్చివరించితివృక్షవాహనున్॥

క॥ ఓవిషమేక్షణఫాలదృ।
గావిర్భూతదమునః పరాసుమనోభూ।
జీవాతుమూర్తి నినునే।
నీవరకును నెపుడుఁజూచియెఱుఁగనికతనన్॥

చ॥ కటిమెడ వేల్పువల్లభుఁడు కాపుటకున్ మదిఁగోరియాతనిన్।
గుఱిచితపించుచున్నయది క్షోణిభృదాత్మజయంచువిన్నయ।
త్రటినిశరాంకురూపు నెలతాల్పును బెండిలియాడఁగోరున।
త్రైజవయువానికిన్ దగినదేయయియుండునటంచు నెంచితిన్॥

ఉ॥ చేఁతలమేనులన్ నుషఁలఁజిత్తములన్ దలిరాకుబోండ్లపై।
రోఁతలుగొన్నదిర్భరనిరుద్ధహృషీకులనైనఁదాల్మిపెన్।
బాఁతుపెకల్చి చిత్తభవబాధలపాలొనరింపఁజాలునో।
పోఁతపసిండిబొమ్మరో యపూర్వమునీసొగసించుబోండ్లలోన్॥

గీ॥ దొడవకింపక త్రైలొసంగఁబడుటజూచి।
జనులుపోల్తురు కాకిముక్కునకు దొండ।
పండుగట్టినట్లని యయ్యుపమయుఁజాల।
దావృషాకపికీవాలవౌదువేని॥

ఆ॥ వేలుమడఁచి లెక్కవెట్టిచూతమటన్న।
నొక్కసుగుణమేనియును దొరకని।
యాపిసాసిరాయఁడానీకుమగఁడౌట।
చాలుచాలు నెంతజేలుపడితె॥

ఉ॥ కద్రువఁ డంచు నెంచకుము కాంతల విశ్వసనీయులౌటచే ।
నుద్వహనోద్యమంబునకు నొల్లని వాఁడ నెయయ్య నీవు భో ।
భృద్వరకన్యసౌశ్చితనఁ బెండిలియాడుటకియ్యకొంటి సుధీ ।
మద్వరవర్ణినీతిలకమా యనుమానము మాని తెల్పవే ॥
ఉత్సాహ॥ పదురు మెచ్చ నన్నుఁ జెట్టవట్టె దేని మోదమున్ ।
గమరమున లతాంగి వయసు బాల్య గల్గుతనము నరసింపు జెం ।
దెదరు సర్వలోకగృహస్థులు, నేను కాదు చెప్పుటో ।
సుదతి నీకు చెలులనడిగి చూడు మేకతంబునన్ ॥
చ॥ గెడవిడి వేయిఁ యేండ్లు తలక్రిందుగ నీవు తపస్సు చేసియున్ ।
బడయవు మాదృశుండయిన భర్తను నిక్కము కాన సంశయం ।
బుడిగి నను న్వరింపుము పయోజదళేక్షణ యంచుఁ గేల్మొగిన్ ।
గడఁగిన నద్రికన్యతొలఁగన్ జనినిల్చియ నెంతొ గ్రుధోగ్రయై ॥
ఉ॥ వేలుపులబ్జయోనియుఁ బ్రవిష్టపనాథుఁడు నేను హాత్మ్యస ।
బాళిఁగ లెప్పుడున్ దలలపై మణిభూషల చెంత బత్తిమైఁ ।
దాలుతురాది దైవతమహాండహా హాకొ ఱగానివాఁడుగా ।
నేలిదము య్యోవో వటునిహీనుఁడ నీకుపలబ్ధి లేమి చేన్ ॥
శా॥ వేదంబుల్ నిఖిలాగమప్రతతియున్ వేధస్సురాషాణ్ముఖుం ।
డాదుల్ నిక్క మెఱుంగలేని శివుమాహాత్మ్యోన్నతిన్ దెల్పయు ।
వేదల్ త్వాదృశులెట్లెఱుంగఁగలరో పృథ్వీనిలింపాధమా ।
నీదారిన్ జనకింక నుంగ వద్దు రే దేనిన్ సాగఁదోలింపెదన్ ॥
సీ॥ ఝుష్టు తృష్ణలనడంచు సుధఁ ద్రావు తెఱఁగంటిమడఁతిసాంధిచూడ మా
[సరంబు ।
ద్వీపమాంసము మెసంగుతెఱవాఁడు కుపుఁ బొంటి ఖడ్గిఁగోరు నే పం
[చిరొంటచి ।

తలఁపు కేళాకూళిఁదమ్మితూండ్లు గ్రసించువరటయుండుట కాసపడునె
[పడియ।
నింగినాఁగియవాననీరానుస్తోకకి క్రోలఁగాంక్షించునే రొచ్చునీరు।
అప్రమేయమహిముఁడగు శంకరుఁడిప్రసన్ను।
తాంఘ్రినళినయుగళమంమనిర్వ।
కల్పలగ్నహృదయగానొప్పనేనుకో।
రుమనెనిమ్నఁబోఁటి మెమకనొరుని॥

చ॥ ఖరనఖరాగ్రనిర్దళితగంధమదావళకుంభనిస్సర।
త్తరసరసగ్రసిష్ణువయి తద్దయు విశ్రుతిఁగాంచినట్టికే।
సరిపముఁగాకశింహి మృతజంతుకళేబరమాంసజగ్ధిత।
త్పరమగు ఫేరవంబుపయిఁదర్పముపూనునె యెన్నఁడేనియుఁ॥

చ॥ ఉపయమలిప్సనాయెడ నహోప్రభవించెనకాదె నీకునా।
నపడితోలంగిపోక నిమసంబిఁకనిచ్చటనుంటివేనినీ।
యుపయమలిప్సదీర్చుటకు నొప్పరికింపనతప్పకంచుగ।
ట్టుపబువుపట్టిమండిపమదుఁ వినియాతఁడలంతినవ్వులోఁ॥

సీ॥ చదువరిఁగానని సంశయించెదవేమొ సర్వజ్ఞుఁడందురు జనులునన్ను।
ధనికుఁడనేనుగానని యెంచెదేమొనాయుదవసితంబురూప్యోపలమయ
మింతినాచెల్వమీవీక్షించదితివకదా జితమారుఁడనని యెంచెదరుప్రజలు।
శౌర్యంబులేదని సందేహపడుదేమొ శక్తిమంతుఁడనేనె జగములందు।
బాగుబాగునాకంటెఁ గవర్ధియందు।
నేమియధికతకలదని యెంచియతని।
నంతగాఁబొగడుచునన్ను నింతదెగడు।
చున్నదానవె యుస్మిలితోత్పలాక్షి॥

క॥ ననుఁబెండ్లియాడుటకు నీ।
కొననంటీమాటవుఁ డవకుముసుమ్మీ శీ।
తనగేంద్రతనయనీమన।
మునజ్ఞాపకమ్ముంచికొనుము పోయెదననుచున్॥

క॥ సుజనస్తుతయాయమయ।
కుజమును సిబ్బితియుఁజెంది కనుఁగొనుచుండన్।
ద్విజరాజమౌళితోఁచెన్।
నిజరూపముతో హిమావనీధరసుతకున్॥

ఉ॥ త్రాఁచులుసొమ్ము లిట్ట్రరముత త్తడికృత్తి యధోంశుకంబునై।
తోఁచినచిత్రచిత్రచరితుం బరమేశ్వరుఁగాంచి నానయున్।
గోఁచతనంబునున్ గదురఁ గొండలరాయనికూతుఁరాసతుల్
పూఁచిరెయునర్చఁ గేల్మొగిచి భూతలపాలితదేవయష్టియై॥

క॥ ఇటుకుఁబతిత నాలంబిం।
చుటకెయరుగుదెంది నాఁడజోటియుచుసం।
దిటఁబట్టి లేవఁదీసెన్।
నిటలేక్షణుఁడా పెరెయొడలు నిట్టవోడువగన్॥

శా॥ వానప్రస్థులు కణ్వగాధిసుతమర్వాసోవశిష్ఠాత్ర్యుఖా।
భూనాకూస్యపకశ్యపాదులునిలింపుల్ నిర్జరేంద్రాహిభు।
గ్యానాంభోరుహసంభవాదులునెఱుంగన్ లేరనన్ మూర్ఖునే।
నానీమాయఁగనుంగొనంగలుగుదానన్ సర్వలోకేశ్వరా॥

క॥ తెలియక కాలుబ్రపేలితి।
నలుగకనాయెడ ననుగ్రహమువూనవెయో।
బలరిపుధాతృశ్రీవ।
త్సలాంచనాది వరివస్యితపదాంభోజా॥

మ॥ అనిప్రీడావనతాస్యయై పలుకునార్యంజూచి యోగుంతియు
ప్లనగ్రామణియొద్దకర్హజనులన్ బంపించిచెప్పించియా ।
తనిసీకోల్పి పరిగ్రహింతునినుం దధ్యంబింటకింబొమ్మనీ ।
వనియారాజిచ్చియామెహీడ్గొనిశివుండంతర్హితుండై చనెన్ ॥

*చంద్రకళావృత్తం*

సానుమద్వరపుత్రియు నట్లాసంశ్రితవాంచితదాయకుం ।
డైనచంద్రకిరీటునిచే సంప్రాప్తమనోరథయై చనెన్ ।
దానకంబునకాళులతోనంతన్ శ్రుతతచ్ఛుభవార్తులై ।
మేనకాహిమవంతులు నాత్మన్ మిక్కిలి మోదిలిరత్తరిన్ ॥

*క్రౌంచపదవృత్తం*

శ్యామశిరోధీ శ్యామశిరోధీ యమిసుతవిశసనయమపురయ్యరోధీ।
పామజఘాతీ భూమవిభూతీ సముపచరితపదజనశివతాతీ।
జామియుతాంగా భూమిశతాంగా సకలజగదధిపజలనిధిషంగా ।
ధీమదుపాశ్యా వ్యోమకకేశ్యా దివిజనుతచరితస్థిరలసదాస్యా ॥

ఇది శ్రీపరమేశ్వర కృపాసాదిత కవితావైభవ శ్రీను
దినట్టూరి సోమనాథశాస్త్రితనూభవ సూరి
జనవిధేయ, సూర్యప్రకాశ నామధేయ
ప్రణీతంబగు తారకాపచయం
బునందుత్తరభాగమున
చతుర్థాశ్వాసము

